# సీతారామ ప్రభావము



గ్రంథకర్త:

మొవ్వ వేంకటదాసస్వామి

శ్రీ వేణుగోపాలసేవాశ్రమము-పూడివాడ

[వయా] చందోలు — గుంటూరుజిల్లా

ర్వస్వామ్యములు

వెల: 1-25

# సీతారామ ప్రభావము



గ్రంథకర్త:

మొవ్వ వేంకటదాసస్వామి

శ్రీ వేణుగోపాలసేవాశ్రమము-పూడివాడ

[వయా] చందోలు — గుంటూరుజిల్లా

ర్వస్వామ్యములు

వెల: 1-25

# శ్రీ సీతారామ ప్రభావము

    

మొవ్వ వేంకటదాసుగారిచే
రచియింపఁబడి

తెనాలి
శారదా ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

---

1000 ప్రతులు.

---

కాపీరైటు రిజిష్టర్డు] [వెల 1—0—0

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ సీతారామ ప్రభావము

## ప్రథమాశ్వాసము



ర్యులారా !

నే నీగ్రంథమును రచించుటకుఁ గారణం బేమనఁగా, బాల్య భృతి విష్ణుభక్తుండనగుటచే శ్రీభగవద్రామానుజ యోగీం ని మతంబునఁ బ్రవేశించి తదీయ సిద్ధాంతవిషయంబులు న్ని తెలిసికొని గ్రామాంతరంబుల కేగి భోధింపుచుండ గవత్కృపచే నింతవరకు శ్రీపురుషాదులు మున్నూఱుమంది నియందుఁ బ్రవేశించిరి. వీరందఱేక భావంబున గుంపుగాఁ రినందులకు భాష్యకారసమాజంబను నామంబునిర్మాణంబయ్యె. ామానుజ జన్మవాసరంబగు నార్ద్రా నక్షత్రంబునఁ జిత్రి నెల వీరందఱొక్కచోటఁ జేరి రామానుజ ప్రభావంబును తదీయ ద్ధాంతంబును తెలుసుకొని యైదుదినంబులు భగవద్గుణానుభ ంబుచేసి యాఱవనాడు స్వగ్రామంబులు చేరుచుందు రియ్యు వంబు సంవత్సరమున కొక్కసారి సామాజికులుండు గ్రామం

బున జరుగుచుండు. నిట్లుండఁ జావలి గ్రామంబున నివసిం
సమయంబున శ్రీవాల్మీకిరామాయణోత్తర కాండంబున
మచంద్రుండు నానాదేశాధిపతులను వానరులను సాగ
విషయంబులను వక్కాణించితి. నయ్యద్భుత కథనాల
సభ్యులందఱు నన్నుంగాంచి గురుపుంగవా! రామవియోగ
వానరులకుఁ గలిగిన దుఃఖమధికముగా నున్నది.
యందు రామునకుఁగల వాత్సల్యంబు నద్వితీయంబు
యిప్పుడు విన్నదానిచే మాకుఁదృప్తిజనించలేదు. దీనినొక
ముగా నొనరించి వినిపించినచో బాగుండునని కోరి నేను
కియ్యకొని భగవత్కథాప్రపంచమునందుఁ బ్రేరించువా
మిత్రులు, బంధువులగుదురని యూహించి మొదట నీగ్రంథ
కారంభించినప్పుడు నూఱు పద్యములతో ముగించవలయ
యెంచితిని. గాని నేను నిలుపఁ దలంచినప్పుడెల్లఁ జక్ర
తిరుమకనాఱు కలంబును ముందుకు నడపుచుండె. దా
నాపుటకు శక్తిలేనివాఁడనై యెంతవరకుఁ బనుచునో
మ్మని పోగా నేడువందల నలువది పద్యంబులవరకేగి యా
నిందు దోషములున్నచో నా సొంతమేకాని గ్రంథనిర్మా
చాతుర్యమంతయు శ్రీరామచంద్రునిదిగా నెఱింగి గుణ
హణపారీణులగు పండితులు, వివిధకావ్య నిర్మాణ చతురుల
కవులు, భగవద్గుణానుభవపరులగు భాగవతులు, కవిజనరక్షా
దక్షులగు రసికులు, పుణ్యకథాశ్రవణాసక్తలగు సాధ్వీమణు
నసూయారహితులగు సమస్తజనులు శాఖాపత్రప్రవాళంబు

విడిచి రసాలఫలంబులు భుజించు చక్కెరతిండిపోల్కి నేతద్గ్రంథ రాజంబునందలి దోషంబులు విడిచి భగవద్విషయంబు నంగీకరింతురని సాష్టాంగనమస్కారంబు లాచరింపుచున్నాను.

ఇట్లు విన్నవించు శ్రీవైష్ణవవిధేయుఁడు,

మొవ్వ వేంకటదాసు.

# దీనియందలి కథాక్రమము.

---

రావణవధానంతర మయోధ్యకువచ్చిన వానరులు చిరకాలసుఖంబు లనుభవించి రాముని విడిచి పోఁజాలమని హనుమంతునితో వచించుట, వానరుల కనుమడిచ్చిన సమాధానము ,భరత లక్ష్మణ శత్రుఘ్నులు రామునితో నేకాంతగృహంబున రాజులను వారివారిదేశంబుల కంపుమని ప్రార్థించుట, రామచంద్రుండు జనకాది బంధువులను భూపతులను స్వీయరాజ్యంబుల కనుచుట, రాజులు రామునకుఁ గానుకలు బంచుట, శ్రీరాముండు వానరులకు బహుమతులిచ్చి విందు చేయుట, సుగ్రీవాదులు రాము నెడఁబాయలేక దుఃఖించుట, వానరులందఱు రామునితోఁ గలసి సీతాదేవి మందిరమ్మున కరుగుట, భూపుత్రి వానర, వానరకాంతలకు రామాజ్ఞచే వరంబు లొసంగుట, విదేహనగరమునుండి హనుమంతుని రమ్మని లేఖవచ్చుట, రాఘవుండు హనుమతో భాగవత ప్రభావంబు చెప్పుట—యింతవరకుఁ బ్రథమాశ్వాసము.

రామవియోగంబు సహింపలేకెల్లట్లో యేడ్చుచు వానరులు తమతమదేశంబులు జేరుట, దాశరథి భక్తవియోగంబోర్వఁజాలక దుఃఖింప లక్ష్మణాదు లోదార్చుట, సీతారామాజ్ఞచే వాయుసుతుండు మిథిలకేగుట, జనకుం డాంజనేయుని సత్కరించి తనభార్యకు గురుశిష్యలక్షణంబు లెఱింగించుట, సుశీల రామపాదాసక్తలగు స్త్రీలతోఁగూడి హనుమకడ రామపరతత్వంబుఁ దెలిసికొనుట, మిథిలాంగనలకు సంశయ

నివారణంబుగా సర్వోత్కృష్టుండగు విష్ణువే రాముండని వచిం చుట, విదేహాకాంతలు సీతారాముల దర్శింపగోరుట—యింత వరకు ద్వితీయాశ్వాసము.

సామీరి శిష్యరాంద్రతో వచ్చి యయోధ్యలో రాముని దర్శించుట, సుశీలాదేవి స్వదేశాంగనలతో నేగి సీతాదేవిఁ దర్శించి పుత్రికావాత్సల్యంబునుఁ బ్రకటించుట, మిథిలాంగనలు సీతాదేవిం బొగడి తదీయాజ్ఞచే రాముని దర్శించి స్తుతించుట, సరమా రాక్షసాంగనలతో విభీషణుం డయోధ్యకు వచ్చి రాముని దర్శించుట, సరమ భూపుత్రిం గాంచి తన యార్తిని వెల్లడించుట, జనులు రాక్షసాంగనలఁజూచి భయా శ్చర్యంబులొందుట, నక్తంచరీ సమూహము ధరాసుతం గొని యాడుట, రామాజ్ఞచేఁ దారా సుగ్రీవాదులును నానాదేశపు రాజులును సాకేతమునకు వచ్చుట, సుగ్రీవ విభీషణులు రామ ప్రభావంబు వర్ణించుట, సరమా, తారా, పరస్పర సల్లాపానం దము, మారుతి యుపన్యాసము, రామభక్తులందఱు సీతా రాములఁ గొల్చుచు సాకేతంబున నన్యోన్యానురాగముతో నుండుట—యిది తృతీయాశ్వాసము.

ఏతద్గ్రంథరాజం బామూలాగ్రముగా నాకర్ణించి గ్రంథ మచ్చువేయించినచో బాగుండునని నాకు మహోత్సా హంబుఁ గల్గించిన మా రేపల్లె కోటయ్య శాస్త్రిగారికి వందన శతంబు లర్పించి గ్రంథముద్రణమునకుఁ గావలసిన ద్రవ్య సహాయం బొనర్చిన చావలిగ్రామ నివాసులగు స్త్రీ పురుషా

దులకు నేతత్కార్యంబున మహాసహాయం బొనరించి యే తద్గ్రామ నివాసులకుఁ బ్రబంధవిషయంబున రుచిఁ గలిగించి కార్యసాఫల్యంబుఁ గావించిన వెలివల నాగయ్యగారికిని ఆయు రారోగ్యంబులును శాశ్వతకీర్తియు నొసంగి రక్షించుఁగాక యని మదీయోపాసనా దైవంబగు శ్రీ సీతావల్లభుని సుందర పదారవిందంబులు డెందంబున నిరంతరము ప్రార్థించి ప్రబంధ రచనాకాలంబున నేనొనర్చినశ్రమ సాఫల్యంబొనరించిన మహా మహులగు పైవారి కింతకంటె వేఱొక సహాయం బొనరింప లేమిఁ గృతఘ్నతాదోషంబు నా కొదవకుండ నింతమాత్రము వెల్లడించితి. రసగ్రహణపారీణులు మన్నింతురుగాక.

ఇట్లు విన్నవించు భాగవతవిధేయుఁడు,

గ్రంథకర్త.

శ్రీమతేరామానుజాయ నమః

శ్రీసీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత
శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# సీతారామ ప్రభావము ప్రారంభము

---

శా॥ శ్రీ వైదేహ తనూభవాహృదయ రాజీవాబ్జబంధుఁ మహా
దేవాంభోజ భవామరేశ్వర ముఖాదిత్య స్తుతాంఘ్రిద్వయుం
భావన్యాశయ వారిరాడ్విధుని శుంభన్మార్గణేష్వాసుమ
జ్జీవాధారుని రామచంద్రు నెదలో సేవింతు నశ్రాంతముఁ॥

మ॥ తరణిం దేజము యామినీవిభుని శీతంబుఁ లతాంతాళివి।
స్తరసౌరభ్యము మేలుజాతి మణులం దత్కాంతియుం గీలిఁ
దు। ర్భరతిగ్మంబును బాయకుండు గతి స్వప్రాణేశుఁడౌ
రాము నా। దరమొప్పఁ భజియించు జానకి పదద్వంద్వంబు
ధ్యానించెదఁ॥

వ॥ ఇవ్విధంబున నిష్టదేవతా ప్రార్థనంబు గావించి శేష శేషాశన వైనతేయాది నిత్యసూరులను శంఖచక్రాది దివ్యాయుధంబులను భరతలక్ష్మణ శత్రుఘ్నాంజనేయులను సరోభూత మహదాహ్వయాది యాళ్వారులను గోదాదేవిని శఠగోప నాథ యామున యతిరా ద్వరవరయోగి ప్రభృతి పూర్వాచార్యులను ధ్యానించి నమస్కరించి భూతభవిష్యద్వర్తమాన కాలముల యందుంగల మహాకవులం గొనియాడి విమర్శన

శీలురగు పండితులకు జోహారులొనరించి మదీయ వంశ క్రమం బెఱింగించెద నెట్లనిన.-

సీ॥ మురవైరి పదపద్మమున జనించిన వేల్పు
ఏటికిఁదోబుట్టు వెద్దియయ్యె।
బంటలు నేలపైఁ బండించి యెల్లరఁ
గాచి కాపను పేరుఁ గాంచె నెద్ది
భూపాలురకు వేలుపులకుఁ గావలసిన
ధాన్యంబు గలిగె నెద్దానివలన
నైమిశాటవిఁ బురాణములు నిరాబార్ల
కెఱుఁగఁ జెప్పిన సూతుఁడెందుఁ బుట్టె
నట్టిబలిజకులమున నెువ్వాన్వయమునఁ
బైడిపాలగోత్రమునందు భవ్యయశుఁడు
సూరయార్యుఁడు పుట్టి యాధీరుఁడుకనె।
నరవి భగవానులను బాలచంద్రుఁ జగతి॥

క॥ వారిద్దఱు పండితులై
ధారాళముగాఁగ భారతము భాగవత
శ్రీరామాయణములు జన
వారమునకుఁ దెలిపి కీర్తి వడసిరి పెలుచన్॥

తే॥ మఱియు వారలు గుంటూరి మండలమునఁ
బూడివాడను పీటఁ గాపుర మొనర్చి
కాలమును ద్రోయుచుండంగ బాలచంద్రు
వీడుకొని భగవానుఁడు వీడు వదలి॥

క॥ మామిళ్ళపల్లెపేరిటి
గ్రామంబున కేగి యచటఁ గడువేడుకతో
ధామంబుఁ గట్టుకొని శ్రీ
రాముని కృపచేత గాపురంబు నడపుచుఁ॥

తే॥ వంశవృద్ధిఁ గాంచి వర్తించె నాతని
విషయమట్టులుండ విమలచరితుఁ
డైన రామచంద్రుఁ డప్పాడివాడలో
నిలిచి కాఁపురంబుఁ జలుపుచుండ॥

తే॥ ఆతనికి రామయాహ్వయుం డవతరించె
రామయకుఁ బుట్టె జానకి రామయార్యుఁ
డమ్మహాధీరుఁ డల బాపమాంబతోడఁ
గాఁపురము చేసి సుఖమొందు కాలమందు॥

ఆ॥ రహిఁ జనించి రోలి రాముని కరుణచే
ముత్తయార్యుఁడునుఁ బ్రమోదభరితుఁ
డైన లక్ష్మణుండు నటుమీఁద రామయ్య
కృష్ణమార్యుఁడనఁగఁ గీర్తిపరులు॥

క॥ ఆనల్వురు నందనులు మ
హానందముతోడఁ బాపమాంబను
జనకుం గ్లానిఁ గనకుండఁ బ్రోచిరి
పూనికతోఁ బుండరీకుఁ బోలినవారై॥

వ॥ వారియందు,

సీ॥ పరుల దోషము లెన్ను పలుగాకులనుఁ గన్నఁ
జెవుల లోపల వేళ్లు చేర్చువాఁడు

పరవధూజనపాళి బాటలో నెదురైనఁ
బెడ మొగంబిడి దారివిడుచువాఁడు
పరధనంబన్న సర్పమునుఁ గాంచిన భంగి
భయమొంది యెపుడు లోఁబడనివాఁడు
తన శీలమునుఁ బరుల్ వినుతింపఁ జొచ్చిన
సిగ్గుచేఁ గేల్దమ్మి లొగ్గువాఁడు

నగుచు వర్ధిల్లి కృష్ణార్యుఁడంతమీఁద
వంశమును వృద్ధి పఱుపంగవాంఛఁ జేసి
వక్కపట్లాన్వయంబున వన్నెకెక్కి
నట్టి శ్రీకృష్ణమాంబఁ బెండ్లాడె నెలమి॥

సీ॥ అనసూయ నిచ్చోటఁ గనఁగల్గెమాకని
సజ్జనాగ్రేసరుల్సన్నుతింపఁ
జింతామణిని నిరీక్షించినామనిసదా
బాంధవయూచ కుల్ప్రస్తుతింప
మాకు యశంబు సంపాదించినావని
తల్లిదండ్రులు సహోదరులు పొగడ
సంసారభారంబు సడలెఁబో తనకని
నాయకుం డతిశయానందమొంద

నిరుగుపొరుగువార లీమెరీతినటింప
మనకు మేలుగల్గునని తలంప
వెలసెఁ గృష్ణమాంబ విష్ణుదేవుని పాద
పంకజములపైఁ బ్రపత్తిచేసి॥

క॥ సారగుణంబులు గలిగిన
యా రామామణికిఁ గృష్ణమార్యునకును నే
నౌరసుఁడ వేంకటాఖ్యుఁడ
శ్రీరామానుజ మతమునఁ జేరినవాఁడన్॥

సీ॥ పదియు రెండేడుల ప్రాయంబుగలనాఁడె
తనపాద సేవా నిధాన మొసఁగి
జ్ఞానమార్జవ మనుష్ఠానంబుగల సదా
చార్యుల పాదకంజములఁ జేర్చి
పరమవైదికమని ప్రఖ్యాతిఁగన్న య
తీంద్ర సిద్ధాంతంబుఁ దెలియఁజేసి
యేనుండఁ గురుశిక్షలేల నీకని
సంస్కృతాంధ్ర భాషావిషయములు నేర్పి
సదనసన్నిధిఁ గల్పవృక్షంబుపగిది
నాలయముతోడ గోపాలకాఖ్యవెలసి
నన్నురక్షించు శ్రీరమా నాథుఋణము
వశమెతీర్పంగ నెన్నిభవములకైన॥

క॥ ప్రీతిన్ వేదాలకులో
ద్భూతునిఁ గౌండిన్యగోత్రుఁ బుణ్యచరిత్రున్
సీతారామాచార్యునిఁ
జేతస్సున సన్నుతింతుఁ జిరకాలంబున్॥

ఆ॥ సంజయునకుమున్ను సత్యవతీసూను
డెలమితోడ జ్ఞాన మిచ్చిప్రోచు

మాడ్కి భాష్యకార మతము దెల్పిన సము
ద్రాల లక్ష్మణార్యు రహి నుతింతు॥

వ॥ ఇట్లు మదన్వయక్రమంబు నెఱింగించి, మహోపకారులైన సదాచార్యుల నుతించి, నాయొనర్పంబూనిన సీతారామ ప్రభావంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన—

రావణ వధానంతరంబున లంకాపురంబునుండి సాకేతంబునకు వచ్చిన వానరవీరులు శ్రీరామచంద్ర పట్టాభిషేకంబైన పిమ్మట నమ్మహాత్ముని విడువంజాలక మూఁడుసంవత్సరంబు లచ్చటనే యుండి యొక్కనా డేకాంతంబున మరున్నందనునితో నిట్లనిరి.

సీ॥ గనిలోని మానికంబను నట్టులుండు నీ
పాండిత్యమెంతయో ప్రబలమయ్యె
సామాన్యకపులతో సాటియా తావకా
స్యంబున బ్రహ్మతేజస్సు పొదలె
నంజనాచలనిభంబై తనరారు నీ
తనువునఁ గాంతి విస్తారమయ్యె
క్షణకాలమైన విశ్రాంతి నీయనిభవ
త్సంచార మీనాడు శాంతినొందెఁ
దావకవచః ప్రభావమందటి మనముల
కద్భుతానందము లొసంగె నౌరయింత
మహిమ నీ కెట్టులబ్బెనో మాకుఁ దెల్పు
మారుత కుమార! మేరు సమానధీర॥

ఆంజనేయులు

సీ॥ పంపాసరోవర ప్రాంతంబునందున్న
శ్రీరామచంద్రు దర్శించినాడ
నాడాదిగా రఘునాథు పాదములేడు
గడయంచు మదినిల్పి యడరినాడ
రామకైంకర్య సాంబ్రాజ్యమే పురుషార్థ
మితరంబులేదని యెంచినాడ
సీతామహాదేవి శ్రీపాదములు గొల్చి
యామెచే వరములనందినాడ

నిన్నిపున్నెంబు లేకమై నన్నుఁబొదువ
జానకీజాని భుక్తశేషంబు దినది
నంబుప్రాప్తించె దానిచే నవ్యమహిమఁ
గాంచుచున్నాడఁజుమి ప్లవంగవరులార॥ 2

వానరులు

సీ॥ నగలు చీరెలులేవు నాకేల సమకూర్ప
వనుచు నిందించు నిల్లాలిపోరు
చాలినంతటి భోగసామగ్రి యింటిలో
లభియింపకేడ్చు పిల్లలమెలుంగు
తమతమ వాంఛాఫలము లీయలేదని
దూఱుచునేగు బంధుగులగోడు
కాంక్షించు సాయమొక్కటి చేయఁడితడంచు
వాపోవు పొరుగిండ్లవారి గోల

చూచి మేలోర్వలేని దుష్టులకఠోర
భాషణంబులు వినకుండఁ బ్రబలసుఖము
లందుచుంటిమి యీయయోధ్యాపురమునఁ
గౌసలేయునిఁ గొలిచిన కారణమున॥ 3

సీ॥ చదలు కాపులకైన శక్యంబుగానట్టి
కంధిపై సేతువుఁ గట్టినాము
ముల్లోకముల నల్లకల్లోలముగఁ జేయు
ఘోరాశరుల ననిఁ గూల్చినాము
రణరంగమునఁ గూలి క్రమ్మఱ నిద్రించు
వారు లేచిన భంగి బ్రతికినాము
సాకేతపురమందు జనులెల్లఁ గొనియాడ
నేనుగులెక్కి యూరేఁగినాము

దిగులులేమిలేక వగలులే కొరులతోఁ
బగలులేక నెగులు తెగులులేక
పగలుగేయి సౌఖ్యముగనుంటి మిచ్చోటఁ
గౌసలేయుఁగొల్చు కారణమున॥ 4

సీ॥ అమృతాశనులకైననాశ్చర్యమొనఁగూర్పఁ
జాలిన భక్ష్యభోజ్యములతోడ
మూచూచినంతనే చేచాచి యాచింపఁ
దగినట్టి సద్యోఘృతంబుతోడ
నాకినమాత్రాన నాకసౌఖ్యమొసంగఁ
జాలినమంచి పచ్చళ్లతోడ

మేలిమీఁగడతోడ మిశ్రమై స్వచ్ఛమై
చవులూరుచున్న ద్రప్పంబుతోడఁ
గూరలప్పడంబు లూరుగాయలతోడఁ
బాయసంబుతోడఁ బప్పుతోడఁ
బూటపూట కెలమి బోసేయుచుంటి మ
క్కాసలేయుఁగొల్చు కారణమున॥ 5

సీ॥ నిర్జరనగరసన్నిభమౌ నయోధ్యా పు
రమున స్వేచ్ఛావిహారంబుగల్గె
నందనతుల్యవనములలోఁ దేనెలు
ఫలములుభోగించు భాగ్యమబ్బె
భర్మతంతువులచే నిర్మాణమైయొప్పు
కమ్రాంశుకంబులు కట్టఁగల్గెఁ
గస్తూరిహిమవాలు కాగంధసారాదు
లతికుతూహలముతో నలఁదఁగల్గె
నవ్యస్వర్ణభూషణంబులు నవరత్న
హారములు ధరించునట్టి భాగ్య
మొదవెనునకు రామపదసేవఁ గావించు
కారణమున నోసమీరపుత్ర॥ 6

ఆ॥ మితములేనికూడు మెక్కుచుంటిమిగాని
తెవులుగలుగదొక్క దేహికైన
రామమహిమచేత నామహాత్ముని ఋణం
బెట్లుతీర్చుకొందు మింకహనుమ॥ 7

సీ॥ వెలయ డెబ్బదిరెండు వేల్వల లెక్కచే
వసియించె నిటమనవానరాళు
లలయుధా జిద్విదేహాదిబాంధవరాజ
సైన్యంబులొప్పె లక్షులకొలంది
వివిధ దేశాధినాథవరండముల వెంటఁ
జనుదెంచు సేనకు సంఖ్యలేదు
స్వజనంబు మఱి విభీషణుని చమూసమూ
హంబులు గణనలేకలరుచుండెఁ
గానియిందఱు రేయిపగలునుదిన్న
రామచంద్రుని ధనధాన్యరాసులించు
కైనఁదఱుగవిదేమి మాహాత్మ్యమో వ
చింపు మారుతనందనా! చిన్నిథాన॥ 8

సీ॥ శరణన్నమాత్రాన సాపరాధులనైన
స్వీయాంగమట్లు రక్షింపుచుండు
స్నేహించుమాత్రానఁ జెలఁగి నీచులనైనఁ
దనప్రాణములరీతి మనుచుచుండు
దరిజేరుమాత్రానఁ బురుదరిద్రులనైన
విత్తవంతులను గావించుచుండు
స్తుతియించు మాత్రానఁ దులువలనైన ని
ర్మలురఁ గావించి ప్రేమమునఁ బ్రోచుఁ
గౌసలేయుండహా త్రిలోకంబులందుఁ
గలఁడె యిటువంటి దాత మర్కటులమైన

మనకు లభియించు నెన్ని జన్మముల ఫలమొ
నుతసుధాశనవార మారుతకుమార॥ 9

సీ॥ లాకు నేత్రము కొమ్ము దాకు నిచ్చుట దక్క
నిర్మల విద్యలన్నియు నెఱుంగు
బరకాంతలకు బొమ్మ పరిపంథులకు వెన్న
దక్క యాచకులకంతయు నొసంగు
శరణాగతులతప్పు లొరులసొమ్ముల చొప్పు
గాన కెల్లజగంబు గాంచుచుండుఁ
దాను చేసిన మే లితరుల దోషంబులు
తలపోయకన్నియుఁ దెలిసి మెలఁగు
రామచంద్రుఁ డిదేమిచిత్రంబొ యిట్టి
ప్రభుఁడు మనకబ్బె వేఱుజపంబు లేల
తపము లేటికిఁ బుణ్యసాధనము లేల
నుతసుధాశనవార మారుతకుమార॥ 10

ఉ॥ ఇన్ని దినంబులేగె మనయింటవసించి ర నేక దేశభూ
భృన్నికరంబు వెళ్ళుటక పేక్షయు లేదు ధనవ్యయంబు చేఁ
జన్నది కాలమంచును విచారమునొంద డుపేక్ష సేయఁడో
యన్న ఖరాసురారి కెనయైన వదాన్యుఁడు కల్గునే ధరన్॥ 11

ఉ॥ మోమున మందహాసమున, మోయనుదీనులఁబ్రోచుదీక్ష దు
ష్కామమునం దుపేక్షకల కాలము మార్గణపోషణంబు సం
గ్రామమునందు ధైర్యమరిఖండనశక్తియు భూరికీర్తి శ్రీరా
మునియందుఁదక్కఁ బరరాజులయందునఁజూడ శక్యమే॥ 12

ఉ॥ పుణ్యమునందు విక్రమవిభూతులయం దసమానరూప లా
వణ్యములందు దుర్దశలువాపుటయందు యశస్సునందు దా
క్షిణ్యమునందు సత్యమువచించుటయం దభయప్రదాన కారు
ణ్యమునందు నార్జవనిరూఢి రఘుప్రభుతుల్యు లుందురే॥ 13

తే॥ మిత్రుఁడుదయించుటయు నస్తమించుటోలి
నరయ కిన్నాళ్ళు దేహేంద్రియములు మఱచి
దివ్యసౌఖ్యంబు కోసలదేశమందుఁ
గాంచితిమికద జానకీకాంతుఁగొలిచి॥ 14

శా॥ కిష్కింధాపురి కిన్నమస్కృతులు సుగ్రీవాజ్ఞకుందండముల్
శుష్కారణ్య ధరాప్రదేశములకుం జోహారుపోమెన్నడున్
నిష్కామంబున రామపాదయుగమే నేర్పొప్పఁగా యావ దా
యుష్కాలంబు భజించుచుండెదము దుర్యోగాప్తి లేకుం
డఁగన్॥ 15

వ॥ అని మహానందంబుతోఁ బల్కుచున్న శాఖామృగంబుల
వచనంబులు విని మందహాసంబుగావించి తత్త్వవేత్తయగు
జగత్ప్రాణ నందనుఁ డిట్లనియె॥ 16

తే॥ తెలిసెమీయంతరంగముల్పలుకులందు
మర్త్యసామాన్యుఁడైన రామప్రభునకు
నింతమహిమంబు గలుగుట కేమి హేతు
వనితలంచితి రెఱిఁగింతు వినుడుదాని॥ 17

తే॥ మానవుఁడుగాడు జానకీజాని లోక
రక్షకుండైన యాదినారాయణుండు

జానకీదేవి త్రైలోక్య జననియైన
లక్ష్మియంచు నెఱుంగుడు ప్లవఁగులార॥ 18

వ॥ నిర్వికారుండగు నతనికి మానవత్వం బేలవచ్చెనంటిరేని॥ 19

తే॥ సాధురక్షణ ధర్మ సంస్థాపనంబు
దుష్కృతవినాశమొనరింపఁ దొల్లి వేల్పు
గములు వేడంగ విష్ణువిక్కాలమందు
జననమొందెను రఘుకులజాతుఁడగుచు॥ 20

తే॥ రాఘవుండు త్రివిష్టపారాధ్యుఁడైన
విష్ణువనెడు ప్రమాణముల్ వేలుగలవు
వానిలోమీరు సులభముగా నెఱుంగు
నట్టిప్రత్యక్షమెఱిఁగింతు నయ్యలార॥ 21

తే॥ శాస్త్రమెఱుఁగక ఘనతపశ్శక్తిలేక
దైవసంబంధబుద్ధి సుంతయును లేక
సద్గురూపాసనము లేక జ్ఞానిగాక
రామపరతత్వ మెఱుఁగఁ దరంబుగాదు॥ 22

క॥ మసిపాతయందు ముడిచిన
పసగల మణిమూల్యరుచులు వాయనిగతి మా
నిసియైన జక్రిప్రాకృత
వ్యసనవికారముల నొందడనుచు నెఱుఁగుడీ॥ 23

వ॥ శ్రీరామచంద్రుం డొనర్చిన యమానుషకృత్యంబు లేవి
యందురేని॥ 24

సీ॥ జగములొక్కట మ్రింగఁ జాలినతాటకా
ప్రాణంబు లొకకోలఁ బాపినాఁడు

పోరి మఖద్రోహులఁ బోదోలి సంయమీ
శ్వరు మనోవాంఛ లొసంగినాడు
పాదరజంబుచేఁ బాషాణమౌ గౌత
మాంగనా శాపంబు నడచినాడు
పదివేల బల్లిదుల్పట్టి తెచ్చిన శివా
విభునికోదండంబు విఱిచినాడు
జానకినిఁ బెండ్లియాడి యజ్జనకరాజు
మానసంబున గలవెతల్మాన్చినాడు
పరశుధరగర్వ భంగంబు నెరపినాడు
రామవిభుఁ డివి మర్త్యచర్యలె తలంప॥ 25

ఆ॥ తండ్రిమాటకొఱకుఁ దనరాజ్య మర్పించి
భోగభాగ్యములు ప్రభుత్వవాంఛ
వదలి రాఘవుండు వనికేగెసంతోష
ముననితండు మర్త్యుఁడనఁగఁ దరమె॥ 26

తే॥ సాధుబాధకుఁడైన విరాధుఁగూల్చి
సరవి శరభంగమునికి మోక్షంబొసంగి
దర్శనముచే సుతీక్ష్ణుని ధన్యుఁజేసె
దశరథాత్మజుఁ డివి నరాధముల పనులె॥ 27

సీ॥ దండకాటవి మునీంద్రస్తోమములువచ్చి
శరణన్న నభయంబొసంగినాడు
ప్రాణముల్తీయుట పరువుగాదని శూర్ప
నఖ ముక్కుచెవులు పోనాడినాడు

ఖరదూషణాదుల నరజాములోపలఁ
జక్కాడి సన్నుతికెక్కినాడు
మాయాబలముల నజేయుఁడై జగతిపైఁ
దిరుగు మారీచువధించినాడు
భయదరూపుఁడౌ కబంధునిం బొరిగొని
పతఁగనాథునకు శబరికిమోక్ష
పదమొసంగినాడు పరికించిచూడంగ
నినకులేశ్వరుండు మనుజుఁడగునె॥ 28

తే॥ కష్టములసోలి ఋష్యమూకమునఁ దన్ను
శరణుజొచ్చిన సుగ్రీవుసాధ్వసంబు
నడచియాస ప్తసాలముల్ కడపినట్టి
దాశరథి మానవుండనఁ దగునె మనకు॥ 29

సీ॥ లీలజీలగ బెండుఁ బోలె వాలధిఁజుట్టి
రావణునెవఁడు సంద్రమునముంచె
డీకొని బహునాళ్ళు వీకతోఁబోరాడి
గోలభునెవ్వాడు కూలనేసె
సంవత్సరముపోరి సపరివారంబుగా
మాయావినెవ్వాడు మడియఁజేసె
దుందుభినెవ్వాఁడు త్రుంచి సుగ్రీవుని
ఋష్యమూకమునఁ జరింపఁజేసె
నఖిలకీశచమూసమూహముల నెవ్వఁ
డేలె నవ్వాలినొకబాణమేసి కనులు

మూసినట్టులఁ బువ్వులుగోసినట్లు
చంపె రాముఁడు సామాన్యజనుఁడె తలఁప॥ 30

సీ॥ ఎసరు వెట్టినకుండ మసలఁగ్రాగిననీటి
విధమునజలమెల్ల వెచ్చనయ్యెఁ
దిమితిమింగలకుళీర ముఖభయంకర
సత్వసంఘాతముల్ చచ్చి తేలె
మైనాకమాదిగా నానానగంబులు
చటచటార్భటులచేఁ బెటిలిపగిలెఁ
బాతాళలోకస్థ పన్నగంబులువికా
వికలై మొగములెత్తి విసముగ్రక్కె
వనధిపై రాఘవుఁడు బాణవహ్నిఁబాదు
కొలిపినపుడిట్టి వింతలు కలుగుచుండ
మనము కంటిమికాదె రామప్రభుండు
మర్త్యుఁడనవచ్చునే కీశమాన్యులారా॥ 31

క॥ కడుభీతి జలధి రాముని
యడుగులఁ బడి కావుమనుచు నాడిన నుడులే
ర్పడ విూదువింటి రప్పని
పుడమిని మానిసుల కెనయఁ బోలునె చెప్పుడీ॥ 32

సీ॥ విసువకమనము మున్ విసరివైచిన మహా
శైలముల్ మున్నీటఁ దేలువేళ
సోఁకు దయ్యమునకుఁ జొరరాని లంకలోఁ
జెలఁగి కీశులు ప్రవేశించువేళ

సర్వజంతువుల మాంసము మెక్కు రాకాసి
తెగల వానరులు వధించు వేళ
ముజ్జగమ్ములఁ జలమ్మున గెల్చు రావణా
శరుఁడాత్మసేనతోఁ జచ్చు వేళ
వహ్నిఁజొచ్చి స్వప్రభావంబుచేఁ గసు
గందకుండఁ బుడమి కాన్పుభర్తఁ
జేరినట్టి వేళ శ్రీరామచంద్రుని
దేవదేవుఁడనుచుఁ దెలియలేదే॥ 33

ఉ॥ అన్నిటికేమిగాని సమరావని రాక్షసపాళిచేతనా
పన్నతనొంది ప్రాణములు పాసిన వానరకోట్లు సుప్తులై
క్రన్నన లేచు వార లవగందగ జీవములొంది ధీరులై
యున్నవిధంబుఁ గాంచిమన కొప్పె నెరాముని మానవుండనన్॥

సీ॥ అష్టాంగయోగంబు లందునసంసిద్ధిఁ
బొందిన పుణ్యాకర్మందిజనము
కూర్మిముప్పది మూడుకోట్ల వేలుపులతోఁ
జేరి రాజిల్లు శచీవిభుండు
భువనసంస్తుత్య విభూత్యష్టకంబుచేఁ
గరము భాసిల్లు గంగాధరుండు
లీలజీవులనెల్లఁ దోలుబొమ్మలఁజేయ
నేర్పరియైన వాణీవిభుండు
కేలుగవలుమోడ్చి ప్రాలి ప్రియానుజ
సహితుఁడైన రామచంద్రు సన్ను

తించుచుండ నాలకించిన మనకొండు
సాక్ష్యమేల యింక సరసులార॥ 35

తే॥ శ్రీరఘూత్తమునకు నభిషేకవేళ
దిక్పతి చతుష్టయము వాయుదేవుచేత
నవ్యమణిహారములు పంచినారు వేల్పు
లట్టిమర్యాద మనుజున కెట్టులొసంగు॥ 36

తే॥ ఇంతమాత్రమెకాదు సీతేశుఁడూరఁ
జేరి కంఠీరవాసనాసీనుఁడైన
దాది రాజ్యంబునకుఁగల హాయినాకుఁ
దెలిసినంత నెఱింగింతు నెలమివినుఁడు॥ 37

సీ॥ జక్కరరాయండు పెక్కు మానికములు
విపులపై నలలచే విసరివైచు
దావి మోపరిమంచితావులీనుచు దేహ
ధారుల కింపౌవిధమునవీచుఁ
బర్జన్యుఁ డధికశుభప్రదుండై వృష్టి
కోరినచోటులఁ గురియుచుండు
భూమి సస్యసమృద్ధిచేఁబెంచి ముక్కారు
పంట లేడాదిలోపల నొసంగు
వలదు బ్రతుకింక మాకనువరకు మాన
వచయమునుఁ జంపరాడు వైవస్వతుండు
రామచంద్రుండు పాలించు రాజ్యమందు
నమ్మహాత్మ్యప్రభావఁ మేమనగవచ్చు॥ 38

సీ॥ పాతివ్రత్యం బేకపత్నీవ్రతము రేఁగి
యాడంగ జారత్వమడగిపోయె
దానగుణంబు నిదానంబు పెంపొందఁ
జౌర్యదారిద్ర్యముల్ సన్నమయ్యె
శమదమముఖసద్గుణము లుప్పతిల్లంగఁ
గామమోహాదులొక్కటనశించె
వేదశాస్త్రార్థవివేకంబు విలసిల్ల
నాస్తికవాదముల్ నాశమయ్యె

సజ్జనులకోపు వెలసె దుర్జనముజడిసె
సత్తుచిత్తులు మీఱె దుర్వృత్తులాఱెఁ
గఢిదిసిరులొప్పెఁ గఱవులగాసి దప్పె
రామపాలనమింపొందు రాజ్యమందు॥ 39

సీ॥ ఆధులుప్రబలామయవ్రాతములు తమ్ము
బాధింపఁ జెడిన దుర్బలులు లేరు
తినుటకన్నము కట్టఁకొనగింటెములు లేక
వాపోవు బలుబీదవారు లేరు
ధనము ధాన్యం బున్నదని గర్వమున దుష్ట
కార్యంబులొనరించు ఖలులు లేరు
సంతాన మికనైన సమకూడదాయె మా
కనికుందు ననపత్య జనులు లేరు

విధురులగువారు విధవలై వ్యధలుబొందు
వారనాచారపరులగువారు పుణ్య

హీనులగువారు లేరు కపీంద్రులార!
రామచంద్రుండు పాలించు రాజ్యమందు॥ 40

సీ॥ అర్థుల వెదకు మహావదాన్యులె కాని
దాతలవేడు నిర్ధనులు లేరు
విద్యార్థులనుఁ గోరు వివిధసూరులె కాని
శాస్త్రంబు లెఱుఁగని జడులు లేరు
సద్బోధలెఱిఁగించు జ్ఞానవంతులెకాని
తెలియక బదరు నాస్తికులు లేరు
పుణ్యకార్యముల కుప్పొంగు వారలెకాని
కాదని నిందించు ఖలులు లేరు

పిచ్చిపట్టినవారు కన్పించఁబోరు
సర్పవృశ్చిక షడ్బిందుసారమేయ
భూతభేతాళభాధలఁ బొందువార
లరయ లేరెందు రామరాజ్యంబునందు॥ 41

సీ॥ కర్పూరధూపము ల్ఘనమఖధూమంబు
లేక మైపర్వంగ నాకసంబు
బహుసుమంబులయందుఁ బరిమళద్రవ్యంబు
లందుండు వాసనల్చెందివాయు
వధ్వర వేళల నాజ్యప్రవాహంబు
పానంబుఁ గావించి పావకుండు

సత్యవంతులు సదాచారులై కావించు
పుణ్యకార్యములచేఁ బొదలిభూమి

భూరిపుణ్యాత్ములగు జనంబులకు నెల్ల
స్నానమజ్జనయోగ్యమై భవ్యజలము
తనివిఁ జెందెను పంచభూతములఁ జేయు
తండ్రి శ్రీరాముఁడగుట తద్రాజ్యమందు॥ 42

సీ॥ ఆయువీయరె కౌసలేయుని కిలమీఁద
నుష్ణరశ్మియుఁ జంద్రుఁడుండు దాఁక
నారోగ్యమీరె రామాధీశునకుస మ
స్త ప్రాయకాలదేశములయందు
శ్రీనొసంగరె కుజాజాని కెప్పుడుదచ్చి
దెసజేండ్లకన్న నాధిక్యముగను
యశమొసంగరె నేలయల్లుని కద్భుతం
బయి శాశ్వతంబుగా నమరునట్టు

లనుచుఁ దమతమ వేల్పుల ననుదినంబు
పౌరులునుఁ బల్లెటూళ్లలోపలిజనంబు
తాల్మిగొల్తురు రామాభ్యుదయముఁగోరి
యమ్మహాత్ముని సుగుణచయమునఁ జొక్కి॥ 43

సీ॥ కౌసలేయునిఁ గూర్మిఁ గౌఁగిలింపఁగఁ గోరు
నెలఁత లేపుణ్యంబు సలుపవలయు
దాశరథిని సదా దర్శింపఁగాఁ గోరు
చెలువ లేదానముల్ చేయవలయు
మనరామచంద్రుండె మగడు కాఁగోరెడు
సుదతు లే తీర్థముల్ చూడవలయు

సాకేతవిభునితో సరసమాడఁగఁగోరు
నాతులే వ్రతము లోనర్పవలయు
నయ్యుపాయంబు దెల్పు మాకంతెచాలు
వలదు నీరసవేదాంతవాక్కులనుచు
బోధ చేసెడు వేళఁ బూబోండ్లు నన్నుఁ
గని వచింతు రయోధ్యానగరమునందు॥ 44

సీ॥ స్థావరాకారంబుఁ దాల్చినఁ దాల్చెబో
గౌతమాంగన మహాపూతశీల
బోయవారింటిలోఁ బుట్టినఁ బుట్టెబో
శబరిమహాతపోజన్మభూమి
పొరివీనులును ముక్కుపోయినఁ బోయెబో
శూర్పణఖెంతయో సుకృతరాశి
హేయకీశాకృతి నెనసిన నెనసెబో
తారాసరోజాక్షి ధన్యురాలు

యెందు కన్నవార లినకులేంద్రునిడాసి
కనుల కఱవుదీఱఁ గాంచి మాట
లాడిరట్టి భాగ్యమబ్బదు మనకంచు
నిచటికాంతలాడు టేనువింటి॥ 45

సీ॥ అంతఃపురమునందు నరసికాంచెదమన్నఁ
దరమె లాఁతులకు సీతమకుఁదక్క
సభలోన వేంచేయు సామిఁగాంచెదమన్నఁ
బొలఁతులచ్చోటికిఁ బోవుటొప్పు

దూరేఁగుచోఁ జెంతఁ జేరిచూచెదమన్న
నరద మాపదు పాపియగునియంత
వనవిహారంబునందునఁ జూత మన్నచో
దాసీలు కాకొరుల్ దాయరాదు
యింక నెట్లుచూతు మినకులేశ్వరుఁడైన
రామచంద్రుముద్దుమోముదమ్మి
నటులఁ గాంచకున్న నక్కటా మనబ్రతు
కేలయనువధూజనాళిఁ గంటి॥ 46

సీ॥ తిరుమేన నలుగిడి తీరుగాఁ బన్నీట
జలకంబులాడించి స్నానమైన
పిమ్మటఁదడియొత్తి యిమ్మైనవస్త్రంబు
లందిచ్చికట్టిన యంతసోగ
కురులు చిక్కులుదీసి గుమగుమవాసించు
పూనూనెయత్తరుపూసి పూల
మాలలఁగైసేసి మణిభూషణంబులు
ధరియింపఁగాఁజేసి దాశరథినిఁ
జెలఁగి దినదినమునుగాంచు సీత చెలిమి
కత్తియల పాదరజము మానెత్తులందుఁ
దాల్చు భాగ్యంబు నొనఁగూర్చు దైవమయను
పద్మగంధులఁ గంటి నిప్పత్తనమున॥ 47

వ. అని వెండియు సామీరి వనేచరుల కిట్లనియె. 48

సీ॥ పెరటిలో సంజీవి ధరణిజానాయకుం
డీగలులేనిజున్నినకులుండు

కొంగున ముడివేసుకొను పైఁడి రాఘవుం
డలుచేతిమణి రావణాసురారి
కడఁగిపెట్టనికోట కాకుత్థ్సరత్నంబు
సదనసన్నిధి దినేశజహితుండు
నిజగోష్ఠమునఁగల నిర్జరగవిరాముఁ
డాపద్ధనము తాటకాంతకుండు
దాసకోటికిఁగాన సీతనిఁ బ్రధాన
భక్తి సేవింపుడెడయక ప్లవఁగులార
యనుచు బోధింప నవ్వాయుతనయు పాద
ములు నుతింపుచు వారలు పలికిరిట్లు॥ 49

క॥ జీవులు పుణ్యము పోయిన
దేవపురింబాయలేక దిగులొందుగతిఁ
దేవా మాతలఁపులు సీ
తావిభువిడు వంగలేక తల్లడ పడెదుఁ॥ 50

సీ॥ చవిగల మంచిభోజనములకై కాదు
సాకేతపురి బాయలేక కాదు
భవ్యతరా రామఫల లబ్ధికై కాదు
విరితేనియలు గ్రోల మరగి కాదు
కనకచేలములు చక్కఁగం దాల్చుటకుఁ గాదు
దిటవుగా నగలు వెట్టుటకుఁగాదు
కలపపు బచ్చెనల్ కాంక్షించియును గాదు
పూలదండలు తలఁపోసి కాదు

భోగములు పోవునని కుందఁబోము గాని
మనరఘూత్తము తిరుముఖమండలంబు
కానరాకున్న నసువు లెక్కరణినిల్ప
నోపుదుమటంచు నేడ్చెదమోయి హనుమ॥ 51

ఉ॥ చాలినవాఁడ వీవు రఘుసత్తముఁ జేరి మదీయవాక్యముల్
చాలగఁదెల్పి మేమతని సన్నిధిఁ బాయకనిల్చుటెట్లొ యా
లీల ఘటింపవేయను వలీముఖులంగని మందహాసుఁడై
వేలుపు బువ్వబోలి కడువిందగు మాటలతోడ నిట్లనున్॥52

క॥ ప్రారబ్ధభోక్తలగు సం
సారుల కజ్జానకీశుసన్నిధి నెపుడున్
గోరివసింపఁగ శక్యమె
వైరాగ్యనిధానులైనవారికిఁ దక్కన్॥ 53

ఆ॥ తపముసేసికన్న దశరథునంతటి
ఘనునకైన విడక కౌసలేయుఁ
గలసి మెలసి యుండఁగాదయ్యెశక్యం బి
తరులఁ జెప్పనేల తండ్రులార॥ 54

ఆ॥ తనకధీనమైన ఘనరాజ్యమర్పించి
చేతులలికమందుఁజేర్చి వేడు
కొన్న భరతుననుఁ గుదురదాయెను వియో
గంబులేక రాముఁ గలసియుండ॥ 55

ఆ॥ సుదతులందుబిడ్డ కడుపులందునుభోగ
పదవులందురోత చదువులందు

మొదవులందు నాసవదలిన సుజ్ఞాన
నిధులకబ్బురాముని నిత్యసేవ॥ 56

క॥ రాముఁడు పరాత్పరుండని
మీామనములనమ్మి భక్తిమెలఁగితి రేనిన్
రాముని సన్నిధినుండెద
రీమహిలోనైన మేను లేదియునైనన్॥ 57

వ॥ అని యిట్లు వాయునందనుఁడు వచించిన విని వానరు లయోధ్యాపురంబున సుఖలీలఁ గాలంబు గడపుచుండు నంత నొక్కనాటి రాత్రి భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు, శ్రీరామచంద్రుని శయ్యాగృహంబున కరిగి తదీయదివ్య పాదారవిందములకు సాష్టాంగనమస్కారంబులు గావించి రహస్యంబుగా నిట్లనిరి. 58

క॥ దేవాదేవర వారల
కేవేవియొ కొన్ని వార్తలెఱిగించుట కి
త్త్రావున కరుదెంచితి మనఁ
గావిని రాముండు కౌతుకంబునఁ బలికెన్॥ 59

ఆ॥ ఎలమి రాత్రివేళ నేకాంతగృహమున
కేలవచ్చితిరి పనేమికలిగెఁ
గఁడిదికార్యమైనఁ గావింతునన రాఘు
వేంద్రుతోడఁ దమ్ములిట్టులనిరి॥ 60

తే॥ చెలఁగిమీారిందుఁ బట్టాభిషిక్తులైన
దాదిగావచ్చి సర్వదేశాధిపతులు

నిన్ను విడనాడలేక పొమ్మన్న బోక
నిలిచి రాత్మీయరాజ్యము తలపకుండ॥ 61

ఆ॥ వారలట్టులుండ భారంబు మీాకేమి
కల్గెనందు వేమొ కౌసలేయ
సర్వదిశలనుండి సాకేతనగరికి
వచ్చుజాబు లెన్నవశముగాదు॥ 62

సీ॥ ప్రజలలోఁ గలహంబు బలమయ్యె సవరించు
దొరలిందులేరని తూర్పునుండి
వేతనంబులులేక వివిధసేనలకెగ్గు
వాటిల్లెనంచు నవాచినుండి
సాధులఁగలచు దుర్జనుల కృత్యములకు
మాఱులేదని పశ్చిమంబునుండి
ప్రజలచేఁ బన్నురాబడక బొక్కసములఁ
దీఱె డబ్బనుచు నుదీచినుండి

వచ్చుచున్నవి లేఖలవ్వారిగాధ
రాధిపతులకు దినదిన మవియెఱుంగ
నట్లు దాఁచెదరయ్య మహాత్మనీవు
వినినచో వారినుండనీవని తలంచి॥ 63

సీ॥ తల్లిదండ్రులు నిన్నుఁ దలపోసి యేడ్చుచు
న్నారు రమ్మని యొక్క నరపతికిని
భార్యాసుతులు నీవు వచ్చిచూడకయున్న
జీవించరనియొక్క క్షితివరునకు

ధనధాన్యములు మేలుగనవు నీవిచటికి
రాకున్ననని యొక్క రాష్ట్రపతికి
స్వపరివారంబులు సల్ప రేపనులైన
సరసి కొమ్మనియొక్క ధరణిపునకు
జాబులరుదెంచుచున్న జవాబులీక
పిచ్చిపట్టినగతి భూమి భృచ్చయంబు
లూరకున్నవి గాన నీ వూఅడించి
పనుపకుండిన ధర్మలోపంబు గలుగు॥ 64

సీ॥ మిన్నక గడియైన మేనఁ బ్రాణములుంపఁ
దరముగాదని నిజ ధర్మపత్ని
కన్నులుండియు లేనిగతినయ్యె మాకునో
తనయుఁడా రమ్మని తల్లిదండ్రి
తెగనాడి మమ్మిట్లు దేశాంతరముల వ
సింప ధర్మమెయ్యంచుఁ జెలిమికాండ్రు
నసురహితాంగంబు లట్లయ్యె నీలేమి
మాచందమంచు నమాత్యచయము
వ్రాసి కాశీశుఁడైన ప్రవర్ధనునకు
నిన్నఁ బనిచిన లేఖల ప్పిన్నతేఁడు
తామసింపక చదివి యాదరణమాని
మందసమ్మునదాఁచె నేమందునింక॥ 65

సీ॥ వేదాంతవిషయముల్ వివరించు గురువు లి
తర దేశముల కేగఁ దలఁచిరనుచు

రాజ్యాంగతంత్రపారగు లైన వివిధాధి
కారు లప్పనులకుఁ గడగరనుచు
సామంతనృపులు స్వేచ్ఛావిహారములచే
మించి మాయాజ్ఞఁ బాటించరనుచు
స్వీయభూపతిని వీక్షింపక బ్రతుకలే
మని పురజనులు పెల్లాడిరనుచు
రహిలిఖించి విదేహాపురంబునుండి
సచివు లనిచిరి జనకభూజాని చెంత
కమ్మహాత్ముఁడు తల్లేఖనంది చదివి
మాఱువల్కక చారుల మరలఁబనిచె॥ 66

ఉ॥ మత్తుఁడవై యయోధ్య ననుమానముదక్క వసించినాడ వీ
వి త్తఱి రాజ్యభార మొవడిచ్చుటఁ దాల్చునటంచు నెంచితోఁ
బొత్తులబిడ్డవో తెలివిపోయెనె రమ్మని కిన్కతో యుధా
జిత్తునుఁ గూర్చి కేకయుఁడు శ్రీముఖమంపెను జానకీపతీ॥ 67

తే॥ కేకయాధిపుఁడిట్లు లిఖించి కొడుకు
రాడ నెడు సందియమున శ్రీరామమీకుఁ
జెప్పుమని వేగులనుఁబంచెఁ జిత్తగింపు
మనుచు వచియించి తమ్ము లిట్లనిరి మరల॥ 68

క॥ ఎకిమీండ్ల సొంతరాజ్యము
లకుఁ బనుపక వారివారి లాలసలకుఁ బూ
నికఁ జేయఁ జూచితేనియు
సకలావనియందుఁ బ్రజలు సంక్షోభించుఁ॥ 69

క॥ మీరా నాకెతిఁగించెదు
వారని నిరసింప కఖిల వసుధాధిపులం
జేరుపు మునిజ పురములకు
శ్రీరామాయనఁగ నతఁడు చెలిమిన వ్రాలయ౯॥ 70

క॥ తమ్ములకు నిట్టులనియె సుధామయమ్ము
లైన పల్కుల మీరిపు డాడినట్టి
దెల్ల సత్యంబయగుఁ గాని కల్లలేదు
నాకు సందేహ మొకటి మనమునఁ గలదు॥ 71

మ॥ ననువీక్షింపఁ దలంచి యిప్పురికి నానాదేశ రాజన్యులో
య్యన విచ్చేసి వసించినారిచట నీహాపూర్తి నామీఁదఁబొ
ల్చిన చెల్మి౯విడిపోవలేకటులె నాచిత్తంబు వర్తించెఁ బొ
మ్మన నోరాడదు సాహసించియటులేనన్న౯మదింగుందరే॥72

ఉ॥ కన్నడసేయకోజఁగల కాలము రక్షణసేయునంచు మే
మన్నియుఁ బాసి రాఘవుని యండను జేర దయావిహీనుఁడై
యన్నము పెట్టలేక యిటులంపెనటంచుఁ దలంచి భూపతుల్
ఖిన్నతచే వచింప మనకీర్తికి భంగము కల్గకుండునే॥ 73

క॥ వారికి భార్యాగేహసు
తారామప్రముఖమోహ మాత్మఁగలిగినం
జేరుదురు నిజపురములకు
నారాగంబెన్నడైన నడరకయున్నే॥ 74

క॥ మనము బలవంతముగఁ బొ
మ్మననేటికిఁ గొన్నిదినము లరిగిన వారే

చనుదురన రామచంద్రుని
కనుజన్ములు పల్కిరిటు కృతాంజలులగుచున్॥ 75

క॥ దేవా తావక శ్రీపద
సేవాతురులై నవార శేషసుఖంబుల్
భావంబునఁ దలపోయరు
భూవరులననేల యజ్ఞభుగ్వరులైనన్॥ 76

శా॥ నీకల్యాణగుణంబులెన్నుకొనుచున్ నీమాటలాలింపుచున్
నీకారుణ్యపయోధిలోమునిగి నిన్నే కాంచుచుం దాఁకుచున్
నీకుందాస్యముచేయఁగోరు సుజనానీకంబు లెక్కించునే
పాకారాతిపదంబు బ్రహ్మపదమున్ భావంబులో రాఘవా॥

ఆ॥ పంచదారతీపు పంచదార కెఱుంగ
రానియట్లు నీవిరాజమహిమ
నీకెఱుంగరాదు నినుఁగొల్చు మాబోటి
భక్తజనుల కెఱుకపడిన దేవ॥ 78

తే॥ రాజులిట్లుండ వానరరాజు లాత్మ
దేశములకేగుటన యామ్యదిశకుఁ బోవు
నట్లు దుఃఖించెదరు వీరలందఱోలి
మీరు శాసింపకున్న బోనేర రనిన॥ 79

క॥ విని శ్రీరాముఁడు మీమీ
మనములఁగలయట్లు సర్వ మనుజేశ్వరులం
బనిచెదన కీర్తిప్రాపిం
పని సదుపాయంబెఱుంగఁ బల్కుండనినన్॥ 80

క॥ మనమాహమ్మైన మిథిలా
జనపతి నజ్జనకరాజు సవినయరీతిం
బనిచి యథాజిద్భూవరుఁ
బనిచిన నొడఁబడుదు రఖిలపార్థివు లటుపై॥ 81

క॥ తరువాత నిఖిలపర్వత
చరవర్యుల సాగనంపఁ జనునన సీతా
వరుఁడనుకూలించె విభా
వరికడచెఁ సౌఖ్యలీల వారలకనువై॥ 82

తే॥ అంతమఱునాఁడు రాఘవుండమరనికర
పరివృతుండైన సురతాణిభంగి సర్వ
జనులు వేష్టింప నవమణీసహితకాంచ
నాసనాసీనుఁడై ప్రభాభాసుఁ డగుచు॥ 83

క॥ తనవలె సువర్ణపీఠం
బుననుండు విదేహదేశభూపాలు గనుం
గొని జోహారులొనర్చుచు
వినయంబునఁ బలికె సభ్యవితతులు వొగడన్॥ 84

సీ॥ ప్రజలనందఱి స్వకప్రజఁబోలె రక్షించి
జనక విఖ్యాతిచేఁ దనరినావు
శబ్దాది విషయవ్యసనముల నొగి విస
ర్జించి సుజ్ఞానమార్జించినావు
రారాజువయ్యు విరాగప్రభావంబు
చే మునీశ్వరుల మెచ్చించినావు

బ్రహ్మానుభవముచేఁ బ్రబలిరాజ్యైశ్వర్య
సుఖములఁ దృణముగాఁ జూచినావు
కర్మయోగి యనెడు గౌరవపద మధి
ష్ఠించినావు రిపులఁ ద్రుంచినావు
సాధుజనుల మదికి సంతోషమిడినావు
బ్రహ్మతరమె నిన్నుఁ బ్రస్తుతింప॥ 85

సీ॥ అనివార్యమగుట నేనాడెడు మాటలా
లించి దోషములు క్షమించవలయు
మామగారనుమాట మఱచి పంక్తిరథుని
లీల మమ్మెపుడు లాలింపవలయుఁ
దెలిసియుఁ దెలియకేడ్తెఱ మీయెడలఁ జేయు
మాయపరాధముల్ మఱువవలయు
నప్పబోయిన బిడ్డలైన మమ్మెపుడు యో
గక్షేమములెఱింగి కావవలయు
మిథిలయందునుంచు మీకూర్మి కోసల
పురవరంబుచందు నెరపవలయుఁ
జాలకాలమయ్యె సామి మీరిటవచ్చి
స్వీయరాజ్యమునకుఁ బోయిరండు॥ 86

ఆ॥ పనుపనేల యింత బలవంతముగనన్ను
సందువేమొ రాజ్యమందు నృపతి
లేకయున్నఁ బ్రజలు చీకాకు పడియెద
రిదియు నీదుమదికి నెఱుక కాదె॥ 87

చ॥ అని మణిభూషణంబులు మహాంబరముల్ రఘునాథుఁ డీయఁగా। జనకుఁడు చేతనందుకొని చయ్యన రాముని గౌఁగిలించి గ్ర। ద్దనఁ దొడమీఁద నిల్పుకొని దాశరథీయని మస్తకంబు మూ। ర్కొని చిబుకంబు వేపుడికి కోమలగండయుగంబు నొక్కుచుఞ॥ 88

ఉ॥ అల్లుఁడవీవు నాకని నరాళివచించెద రట్లకాదయా
తల్లియుఁదండ్రియుంగురుఁడు దైవముసోదరులెల్ల బాంధవుల్
మొల్లము నేతదాత యిహాముం బరముఞ గతి వీవె యంచు నా
యుల్లమునందు నమ్ముకొని యుండెద నెప్పుడు జానకీపతీ॥

తే॥ జానకీదేవి భార్గవి చక్రపాణి
వీవనుచు మానివర్యులు దేవతలునుఁ
జెప్పఁగావింటి నేను యోజించికంటి
మిముఁవిడువఁజాల మీయాజ్ఞమీఱఁజాల॥ 90

ఉ॥ సొమ్ములకెల్ల సొమ్మవయి సూర్యనిభంగి వెలుంగునీవు నా
సొమ్మగుచుండ వమ్ములగుసొమ్ము లొసంగెద వేల నీవకై
కొమ్మనియిచ్చి వీడుకొని కూఁతురి సన్నిధి కేగి కాంచి మా
యమ్మరొ పోయివత్తునన నమ్మహనీయ లతాంగి సీతయుఞ॥

ఆ॥ జనకుఁ గౌఁగిలించి సద్భక్తిమ్రొక్కి ప
సిండిపీఁటపై వసింపఁజేసి
తండ్రి నీదు రాక తడవాయె నైనను
నిన్నవచ్చినట్టులున్న దిచట॥ 92

తే॥ మరల నీవేగుదనిన మా మానసములు
తల్లడిల్లెడునన నిజతనయఁ బ్రేమఁ

గాంచి జనకుండుపల్కె నో కన్నతల్లి
నీప్రభావంబెఱింగి వర్ణింపఁ దరమె॥ 93

సీ॥ రామచంద్రుని శరీరచ్ఛాయగాభక్తి
సలిపి సద్వ్రితముచే మెలఁగినావు
సుచరిత్రయగు ననసూయా మహాదేవి
చే బహుమానంబుఁ జెందినావు
దండకాటవి మునీంద్రస్తోమములచేత
నంచితంబుగ నుతిఁగాంచినావు
నిప్పులలోఁజొచ్చి ముప్పొకింతయులేక
వెలువడి సత్యంబుఁ దెలిపినావు

నాడు నేడుముందు మూడులోకములందుఁ
బుణ్యసాధ్వియని యగణ్యకీర్తిఁ
గాంచినావు మగనిఁగలసి సుఖించి నా
వింతకంటె భాగ్యమేమిగలదు॥ 94

క॥ చింతామణి సన్నిభుఁడగు
కాంతుఁడు కల్పకమువంటి కాఁపురమును ని
శ్చింతాభర జీవన మ
త్యంతయశంబబ్బె నీకు నంబా స్థిరమై॥ 95

వ॥ అని పల్కుచున్న సమయంబున నూర్మిళా శ్రుతకీర్తు లరుగు
దెంచి సీతామహాదేవికి నమస్కరించి తండ్రిం బూజించి
రంత నజ్జనకుండు సీతాప్రముఖ కుమారీరత్నంబుల
నాశీర్వదించి బుజ్జగించి నిజపురంబునకుం జనియె నటు

పిమ్మట యుధాజిత్తుఁగాంచి శ్రీరామచంద్రుఁడు సవినయంబుగా నిట్లనియె॥ 96

క॥ మాతండ్రి దశరథేశుఁడు
మాతులుఁడగు నీవు గలవు మాకాశ్రయమం
చే తోఁట్రుపాటుఁజెందక
చేతోమోదమున దివికిఁజేరె మహాత్మా॥ 97

తే॥ ఆర్యులగుమీర లిటనెన్ని హాయనంబు
లుండినను మాకు మేలగుచుండుఁ గాని
చాతకము మేఘజలమట్లు సామి నీదు
రాకఁగోరెదుఁ గేకయ రాజ్యభూమి॥ 98

ఆ॥ అంతెకాదు కేకయాధీశ్వరుఁడు నీవు
లేమి దుఃఖవార్ధిలీనహృదయుఁ
డయ్యెననుచు నాతడంపినదూతలు
నుడివి రివిగో వారినుడులు వినుము॥ 99

ఆ॥ స్వీయరాజ్యమునకుఁ బోయిరం డటులేగి
యైనఁ బిల్లకాయలైన మమ్ముఁ
గనికరమున నరసికావంగ వలెనన్నఁ
ధరణికులునితో నతండు పలికె॥ 100

క॥ రామా నిన్నెడబాయుట
కీ మానస మొప్పదైన నేమనదగు నీ
నామంబు జపింపుచు నిజ
ధామంబున కేగెదను వ్యథాపూర్ణుఁడనై॥ 101

క॥ కనికరము నిల్పుమని నీ
వనుమాటలు విన్ననాకు నాశ్చర్యంబ
య్యెను మాబోటిజడాత్మ్ముల
కనికరమున నీకునేమి కార్యముతండ్రీ॥ 102

క॥ ముల్లోకము లేలంగల
బల్లిదుడవు దేవవినుతపదుఁడగు నీకీ
క్షుల్లకులగు ధాత్రీశుల
వల్లఁ బ్రయోజనముకలదె వాల్లభ్యనిధీ॥ 103

క॥ వాచామగోచరంబగు
ధీచతురత కల్గియును సధీరులమగు మ
మ్మ్మాచెన్నునఁ గొనియాడెదు
నీచరితము వత్సలత గణింపఁగ వశమే॥ 104

క॥ జననీజనకులు రాజ్యము
తనువు ధనము బాంధవులును దారసుతులు జీ
వనము సుఖము నీకంటెను
ఘనములుగా వీడుగావు కాకుత్థ్సవరా॥ 105

ఆ॥ ఐనఁగాని తావకీనశాసనము న
తిక్రమింపలేక దీనభావ
మున మదీయ రాజ్యమునకేగెదను నన్ను
మఱువకుండవలెసుమా యటంచు॥ 106

ఆ॥ పలికి రామచంద్రుఁ బట్టికౌఁగిటఁజేర్చి
యమ్మహాత్మ్మపాణులంది కనులఁ

గప్పుకొనుచుఁ బాయఁగాలేక కుందుచు
నెట్టకేలకాతఁడేగెఁ బురికి॥ 107

తే॥ అయ్యుధాజిద్విదేహుల నంపుటగని
మనకు మూడెనటంచుఁ దక్కినధరాధి
పతులు లోలోన దుఃఖింప వారినెల్ల
గౌరవంబునఁగాంచి రాఘవుఁడువల్కె॥ 108

క॥ చిరకాలమయ్యె మీమీ
వరరాజ్యపదములు పాసివచ్చి మహానం
ద రసాబ్ధిఁదేల్చితిరి నను
నరనాయకులార మీబుణంబెటుదీర్తు॥ 109

క॥ నాయందలి సఖ్యముచే
దాయాదులరాష్ట్రములను దారలసుతులం
డాయక నిలిచినమీకే
నీయంగల గొప్పవస్తు విలలేదుగదా॥ 110

క॥ బలవంతంబుగ మమ్మి
ట్టలయించి నిజాలయముల కంపెననుచుఁ ద
ప్పులు వట్టక కోపింపక
చలముంచక పోయిరండు జనపతులారా॥ 111

క॥ నావిని యచ్చటఁ గల నా
నావసుధాధిపులు తమ మనంబులు గలఁగం
దేవమునిస్తుతుఁడగు సీ
తావిభుతో నిట్టులనిరి తడఁబడు నుడులన్॥ 112

సీ॥ తినిపించితివి భూరి దివ్యాన్నమాస్తనం
ధయులఁ బ్రోచెడు కన్నతల్లిఁ బోలె
నిప్పించి నాడ వేమేమికోరిననది
యాక్షణంబునఁ గల్పవృక్షమట్లు
నడిపించినావు దుర్నయముమానిచి సదా
ధర్మమార్గమునందుఁ దండ్రి పోల్కి
వినిపించితివి వేదవేదాంతమర్మముల్
కరుణాబ్ధి వగుచు సద్గురునిమాడ్కి

నవరసంబులు సూపి యానందవార్ధి
నోలలాడించి నావెంత కాలమైన
గడియగాఁ ద్రోఁచెమాకు నోకౌసలేయ
బ్రతుకుటెట్లయ్య మిమ్మెడఁబాసినంత॥ 113

సీ॥ పరిమళోపేతమై పరఁగు మీపాదాబ్జ
ములకు మ్రొక్కులిడు మామూర్ధములకుఁ
గల్యాణ నిలయమై క్రాలు మీతిరుమేనుఁ
గాంచి జీవించు మాకన్గవలకు
నమృతంబుచేఁ బన్నులందు మీపల్కులా
కర్ణించి బ్రతుకు మాకర్ణములకు
బ్రహ్మరుద్రులకు లబ్ధముగాని మీదర్శ
నము నపేక్షించు మాగమనములకుఁ

దేనెలూరుచుండు మీనామములఁబిల్వ
రాగమొందుచున్న రసనలకు స

దాశ్రయంబుఁ జూపి యటుమీఁదఁ బొమ్మను
టనువుగాని యురక పనుచు టెట్లు॥ 114

ఆ॥ పోవఁగాళ్లురావు పోవము మేమన
వీలుగాదు నిన్ను విడిచిబ్రదుకు
మార్గమొండు లేదు మరణమా రాదు యిం
కేమి సేయువార మినకులేశ॥ 115

చ॥ తలఁపునకైన రారు సుత దారలు రాజ్యభరానురాగము
ల్కలపవు దేహరోగములు కాఁటియపెట్టవు శోకమోహము
ల్మలయవు సద్గుణంబులెద మాఱవు పెంపగునీపదాబ్జముల్
కొలిచిన నాఁటనుండిరఘుకుంజర మేమెడఁబాయు టెట్లయా॥

తే॥ పగతుఁ బవధించి లోకముల్ప్రస్తుతింప
సీతతోఁగూడి పట్టాభిషిక్తుఁడైన
నిన్నుఁ గనులారఁగాంచి మేమెన్నరాని
భాగ్యవంతుల మైతిమి భవ్యశీల॥ 117

సీ॥ మితిలేని మఖము లర్మిలిఁజేసి పుణ్యవి
వర్ధనుండైన యిక్ష్వాకునాడు
నీడోద్భవమునకు నిజశరీరముఁగోసి
చాగమిచ్చిన శిబీశ్వరునినాడు
మార్గణావళికి సమస్తద్రవిణమిచ్చి
రహిఁగీర్తిఁ గైకొన్న రఘువునాడు
విస్తృతతపముఁగావించి నిర్జరధుని
రసకుడించిన భగీరథునినాడు

లేనిసౌఖ్యమబ్బె నీనాడు ప్రజలకు
సర్వదేశముల విశాలమహా
ప్రభావ మొప్ప నీవు పాలించుటనుఁజేసి
రమ్యగుణసముద్ర రామభద్ర॥ 118

సీ॥ ప్రతిహాయనము భవత్పాదారవిందముల్
స్థిరభక్తినేము వీక్షించునట్లు
ధర్మంబు సత్యంబు దయయు నీపయిభక్తి
నీతిమాయెదల జనించునట్లు
తావకరాజ్యాంగ తంత్రముల్ సేమముల్
నెలకొక్కపరియైనఁ దెలియునట్లు
దేవరవారు ప్రీతినొనర్పఁ బోవు మ
ఖములు మేమరుదెంచి కాంచునట్లు

నిరుపమానమైన నీదయ మామీఁద
మలసి బాయకుండ నిలుచునట్లు
వరములొసఁగుమయ్య వనజాత దళనేత్ర
శత్రుజైత్ర జనకజాకళత్ర॥ 119

సీ॥ ఆశీర్వదించితివే శశాంకాస్య నీ
దరి నీక నుంచవా దశముఖారి
యెడఁబాయఁ దలఁచితే యినకులాంబుధిచంద్ర
కారుణ్యముడిగితే కౌసలేయ
పంపించఁదలఁచితే పాపనాశన యను
రాగంబుమానితే రఘుకులేంద్ర

భోజనంబిడలేవె భువన మోహనరూప
లాఁతులటంచుఁ దలచితె రామ
కననిచో బిడ్డలముగామె ఖరవిదార
యనుచు నిలమీఁదఁబడి యిటునటులఁ బొరలి
పొరలి యేడుచు భూపాల వరులనాద
రమున లాలింపుచును పల్కె రామవిభుఁడు॥ 120

తే॥ బోనమిడలేక గాదు మీపైనఁగూర్మి
లేకయును గాదు స్వీయులుగాక కాదు
మిమ్ము మీరాష్ట్రములకునే బొమ్మనుటలు
ధర్మపాలనకైచుమీ తండ్రులార॥ 121

చ॥ తలఁచిన మీరు రాదగు నుదంతములే నెఱిఁగించుచుండెదం
బిలిచెదఁ బుణ్యకార్యముల వేళల మిమ్ములఁ జూడకున్నచో
నిలుతునె భూతకోటులను నీరజ గర్భుఁడు ప్రేమపాత్రమా
నెలవులనుండునట్టుల జనింపఁగఁ జేసిన లెస్సయౌఁగదా॥ 122

ఉ॥ మీర లనుక్షణంబు మితిమీఱిన దుఃఖముఁ జెందుచుండ నా
కారట పాటుగల్గెనహహా గురు దీనత కోర్వజాలనం
చా రఘువీరుఁ డందఱి మహోదయుఁ గౌఁగిటఁ జేర్చి మేనులిం
పారఁగఁ జేతులన్నిమిరి యాదటఁ జెక్కులు నొక్కె నంతటన్॥

ఉ॥ భూపలలాములెల్ల రఘుపుంగవు పాదములందు మూర్ధముల్
మోపి బిఱాన లేచి కరముల్ ముకుళించి మహానుభావ సం
తాపభరంబుమమ్ముల నిదాఘమునందలిసూర్యుఁడో యనన్
వేఁపఁదొడంగె నైననిఁక వెళ్ళకతప్పునె రాఘవేశ్వరా॥ 124

క॥ తనయులొనర్చిన తప్పులు
జనకుఁడు మన్నించురీతిఁ జనువున మాచే
సిననేరములెల్ల మనం
బునఁ దలఁపక రాణీయవలయు మునినుతపాదా॥ 125

తే॥ అనివచించి ధరాధిపు లాత్మబలస
మేతులై రామచంద్రు నమేయభక్తి
సన్నుతింపుచుఁ దమనివాసములకరిగి
కరము లనిచిరి సాకేతపురికిఁ బ్రీతి॥ 126

వ॥ ఇవ్విధంబున నాయా దేశాధిపతులొసంగిన బహుమాన పదార్థంబులన్నియుం దెచ్చి సాఁగనంపఁబోయిన దూతలు వచ్చి నమస్కారంబులొనర్చి శ్రీరామచంద్రున కిట్లనిరి.

సీ॥ బాహ్లీక కాంభోజ పారసీకవనాయు
జాది భూపతులు మహార్వములను
చోళ బంగాళ నేపాళ బర్బర కాశి
కాదిపార్థివులు గజావళులను
వంగాంగ మగధ కళింగవరాటాది
నరనాథులు కడాని యరదములను
మాళవ మద్ర పాంచాల సాళ్వాది
రాజన్యుల్ సురూపతా కన్యకలను
మఱియు వివిధదేశమానవేంద్రులు పరి
వారములను గంధసారములను
హారములను భర్మభారములను వస్త్ర
వారములను బంచినారు కనుఁడు॥ 128

వ॥ అని వచియించిన సంతోషించి యాపదార్థంబులన్నియుం గైకొని యుచితస్థానంబులనుండ నియోగించి రాజ్యపరిపాలనంబొనర్చుచు నొక్క శుభముహూర్తంబున సభాస్థలంబుఁజేరి రత్నసింహాసనాసీనుండై యుచితాసనంబులఁ గూర్చుండియున్న వానరులకు ధన కనక వస్తు వాహన రత్నాంబరాభరణంబుల నవ్వారిగాఁ గోరినవారికిఁ గోరినట్టు లొసంగి వారల కిట్లనియె. 129

సీ॥ అంగనాలయ కుమారారామములఁ దృణ
ప్రాయంబుగా నెడఁబాసినారు
దారుణారణ్య పథములఁ రేవగలని
తలపక పైనంబు సలిపినారు
కంధి బంధనవేళఁ గడుదూరమున
కేగి హెచ్చైన మలలెల్లఁ దెచ్చినారు
ప్రాణము ల్దాపక బాహువీర్యముసూపి
కుటిలాశరుల ననిఁ గూల్చినారు
చచ్చియు మదీయ పుణ్యవశమున బ్రతికి
నారు మీఋణ మెన్ని జన్మములకైనఁ
దీర్చుకొనఁజాల వానరాధీశులార
ధైర్యశేవధులార యోతంద్రులార॥ 130

సీ॥ గరుడునిఁబోలు మీ గమనవేగమునకుఁ
దరణిబోలిన మీ ప్రతాపమునకుఁ
బవమానునకు నీడుపడు మీ బలమున కు
ధరములనేలు మీ ధైర్యమునకు

సూచికాగ్రము నేలఁ జూచు మీ బుద్ధికి
నతితీవ్రమైన మీ యత్నమునకు
మిగుల నిశ్చలమైన మీ స్వామిభక్తికిఁ
బిడుగునోడించు మీ పిడికిళులకు
నెన్ని బహుమతు లిచ్చిన నింకఁగొంచె
మప్పు పడుచుండుఁ గాన మహాత్ములార
పూని ప్రేమించు లే బహుమానమంచు
హాయిగా మీ నెలవులకుఁ బోయిరండు॥ 131

తే. అని వచించియు నంగదు నాంజనేయుఁ
జేరఁదీసి నిజోరులఁ జేర్చి సొమ్ము
లన్నియును దానె తొడిగి దినాధినాథు
సూను వీక్షించి జానకీజాని వల్కె॥ 132

క॥ నీ కనుసైఁగల మెలగుచు
నీ కనుకూలముగఁ బనులు నెరపెడు కీశా
నీకావక్రపరాక్రమ
మేకోవిద వరులకును గణింపఁగ వశమే॥ 133

సీ॥ మును త్రివిక్రమునకు ముమ్మాఱు వలగొన్న
దుగినినిబిడ్డ నీదు వశవర్తి
కంజాత బంధునిఁ గబళించి విడిచిన
మరుదాత్మజుఁడు నీ యమాత్యహాళి
వాలిచందాన రావణుని దిరస్కరించిన
యంగదుండు నీ గొనబుబిడ్డ

కస్తిలేకుండఁ బ్రహస్తుఁ జంపిన మేటి
నీలుండు మీ చమూపాలకుండు
నామయంబు లడఁచునట్టి సుషేణుండు
నీదుమాతులుండు నీ ప్రభావ
మిట్టిదట్టిదని వచింప శక్యముగాదు
పద్మభవునికైన భానుతనయ॥ 134

ఆ॥ ఇంతమందిలోన నంతవిక్రములైన
నీకుమారుఁ డంజనాకుమారు
లబ్జసూర్యులట్టు లఖిల జగత్పూజ
నీయులగుదు రింత నిక్కువంబు॥ 135

వ॥ అనిన రఘువీరునితో సుగ్రీవుండిట్లనియె॥ 136

సీ॥ శాఖామృగంబులఁ జంద్రశాలలయందుఁ
గ్రీడింపఁ జేసిన ఱేఁడువయ్య
ఫలభోజనుల సుధోపమ భోజనములచేఁ
దనియంగఁ జేసిన దాతవయ్య
వల్కలాంబరుల సువర్ణ చేలములచే
సంతృప్తి పరచిన స్వామివయ్య
వననివాసులను బత్తననివాసులఁజేసి
గౌరవించిన యుపకారివయ్య
దుమ్ము పూసికొనెడు త్రిమ్మరీండ్లకు సుగం
ధిగణమిచ్చు నట్టి సుగుణివయ్యఁ
బూనినావు నుతి కనూనమా నీదు వా
త్సల్యమింతయన వశంబె మాకు॥ 137

సీ॥ నీ వరణ్యమునందు నిలిచియుఁ
బట్టాభిషేకంబు నాకొగిఁ జేసినావు
పండ్లు, దుంపలు నీవు భక్షించి చవులూరు
శాల్యోదనము నాకొసంగినావు
పర్వతగుహాల లోపల నీవు నివసించి
కాంచనశాల నన్నుంచినావు
శర్కరావని నీవు శయనించి యుయ్యాల
తొట్టిలో నను బండఁబెట్టినావు
నారలీవు ధరించి విస్తారమూల్య
సంయుతాంబరములు నాకొసంగినావు
నీవు కష్టించియును నిజసేవకులకు
భోగముల నిచ్చు శీలంబుఁ బొగడవశమె॥ 138

తే॥ నీకుఁ జెప్పిన గడువులో రాక భోగ
లాలస మునింగియున్న నా బేలతనము
చిత్తమున నెంచకలరి రక్షించినట్టి
నీదు సౌశీల్యమెంతని నిశ్చయింతు॥ 139

ఉ॥ రావణుతోడఁ బోరి సమరంబున డస్సిన నన్నుఁగాంచి సు
గ్రీవ తెగించితేల యిటు కీడొక కొంచెము నీకుఁ గల్గినన్
జీవితమాత్మ తుల్యయగు సీతయు నేమిటికంచుఁ బల్కవే
దేవ భవద్దయారసము తేట పడెంగద నా డపారమై॥ 140

ఆ॥ తావిచేతఁబూవుఁ బూవుచే దారంబు
వాసిఁగాంచినట్లు వరద నీ ద

యా ప్తిచేత వానరాళి మహావైభ
వంబుఁ జెందినారు వసుధయందు॥ 141

వ॥ అని పల్కుచున్న సుగ్రీవు నభినందించి సమస్తవనచరులఁ
భుజింప నియోగించిన నా ప్లవంగపుంగవులును విభీషణాది
రాక్షసులును భోజనశాలకుం జని బంతులుదీరుటయు వారి
నానందింపఁ జేయు తలంపున రామచంద్రుండు సోదర సం
యుతుండై వారితోడం గలసి గూర్చుండె నయ్యవసరం
బున సదాచారసంపన్నులగు నారీపూరుషజనంబు వడ్డించు
టకుంబూని 142

సీ॥ కొనలుండు నరఁటి యాకులు కుట్టి మంబులఁ
బరిశుద్ధిఁ గావించి పఱచువారు
పఱచిన యాకులపైఁ గించి దుష్ణ
శాల్యోదనం బనువుగా నుంచువారు
శాల్యోదనము చుట్టు శాకసూపంబులు
మంచిపచ్చళ్లు వడ్డించువారు
నిలిచిన భోజనార్థుల హస్తములువట్టి
గుట్టుగాఁ గూర్చుండఁ బెట్టువారు
గాఁగ రాముని బంతి నక్కపివరేణ్య
చయములు విభీషణాది రాక్షసులు కూరు
చుండి కుతుకబంటిగా నిండు వేడ్క
లొలయ భక్షించి రేమని పలుకవచ్చు॥ 143

సీ. సద్యోఘృతంబొక్క సారి కైకొమ్ము మా
నాయనా యని పోర్లబోయువారు

పాయసం బింకొక్కపరి పుచ్చుకొను మగ్ర
జా యంచు నాకులో వేయువారు
పులిహోరఁ గైకొమ్ము లలినొక్కమారు తం
డ్రీ యంచుఁ జెలఁగి వడ్డించువారు
చక్కెర పొంగలిం కొక్క తేప భుజింపు
పట్టీ యనుచు నొక్కి పెట్టువారు
గాఁగ నవ్వానరాళి రాఘవులబంతి
లోనఁ గూర్చుండి గరగరమైన తిండి
మెక్కుచుండిరి రాముఁడే దిక్కటంచుఁ
గొలుచు వారల కెందైనఁ గొఱత కలదె॥ 144

సీ॥ చెలఁగి ద్రోణాద్రిఁ దెచ్చిన గాసి దొలఁగని
ప్పూరీలు దినుము సమీరపుత్ర
ఘనన రాంతకు వధించిన శ్రమదీఱనీ
వడలారగింపుమో వాలిసూతి
సేనల నడపిన సేదవాయంగ నీ
ఘృతమానుమయ్యా యో కేలితనయ
ఖలుఁ గుంభుఁ గూల్చిన యలసట వోవ నీ
మీఁగడఁ దినుము తమ్మిచెలిబిడ్డ
మారఘూర్తమునకు శత్రు మర్మములను
దెలిపిన ఋణంబు దీరంగఁ దినుము లడ్డు
ముద్దలు విభీషణాయని ముద్దరాండ్రు
వడ్డనలు సేసి రానంద వార్ధిదేలి॥ 145

సీ॥ భావిధాతవటంచుఁ బ్రస్తుతిసేతు మీఁ
గిన్నె పాయస మారగించితేని
కీశాధిపతివంచుఁ గీర్తింతుమోజ నీ
ద్రాక్షారసంబెల్లఁ ద్రావితేని
యువరాజవంచు నిన్నూహించి కొలుతు మీ
మీఁగడంతయుఁ గూర్మి మెక్కితేనిఁ
గమ్రల జాత్మజుడంచుఁ గడుగొప్పఁ జూతు మీ
గారెలన్నియుఁ దినఁగల్గితేని

ననుచు నాంజనేయు నంగదు సుగ్రీవు
జాంబవంతుఁగాంచి చానలెల్ల
సరసమాడుచుండ సామీప్యమున నుండు
వారలెల్ల నగి రవార్యభంగి॥ 146

సీ॥ వాయెత్త వేమికావలయు నీకని యొక్క
భామ గజునిమోవిఁ బప్పురుద్దెఁ
గడుపునిండిన జాడ కానరాదని యొక్క
వనిత తారునిమీఁద వడలు విసరె
సైఁగఁ జేసెద వహో చాలదేమని యొక్క
చెలి నలుమేనఁ బాసెంబుఁ బులిమెఁ
దిను మిట్టిదినమెప్పుడును రాదనుచు నొక్క
గరిత కేసరివాఁతఁ బెరుగుఁ బూసె

భూసుతాధిపుకృప నిట్టి భోగమబ్బె
నమలుఁ డని యొక్కనాతి వానరుల కెల్లఁ

బిండివంటలు మఱిమఱిఁ బెట్టఁ దొడఁగెఁ
నేమని వచింపఁ దగునాటి రామమహిమ॥ 147

సీ॥ తరళాక్షి నామీఁద దయనీకుఁ గలదేని
కమ్మనై పొలుచు తక్రమ్ముఁదెమ్మ
లలితాంగి వడ్డింప లాలస పొడమిన
నాడెమైతగు లవణమ్ముఁదెమ్మ
వనిత నాకిడ నీకు వాత్సల్యమున్నచో
గమగమ యను నూరుగాయఁదెమ్మ
యిందీవరాక్షి నీకిచ్చ జనించుచో
నిర్మలంబైన పానీయ మిమ్మ
టంచు నారీమణులతోడ నాడి తనివి
దీరఁబోసేసి వానరాధిపులు నృపులు
దానవులు లేచి కాళ్లు హస్తములు గడిగి
చెలఁగి యుచితాసనముల నాసీనులైరి॥ 148

వ॥ తదనంతరంబున నంగనా సమూహంబు లాస్థానంబున కరుగు
దెంచి మంగళ పదార్థంబులు గొనివచ్చి. 149

సీ॥ గంబూర మొదలౌ సుగంధ వస్తువులతో
నింపైన విడియంబు లిచ్చియిచ్చి
పచ్చికస్తురిఁ జేర్చి పన్నీరు సీసాలు
సారెసారెకు నెత్తి చల్లి చల్లి
పరిమళమిళిత పుష్పరచితమైన వి
విధమాల లఱ్ఱుల వేసివేసి

క్రమానుబోధ సాంకవ వంశకోపేత
మలయజంబు నొడళ్ళ నలఁది యలఁది
విమల చామరములు దాల్చి విసరి విసరి
యమృత వాక్కులఁ బరిహాసమాడియాడి
చాన లింపొనరింప నా శైలచరులు
పరవశతఁ జెంది రేమని పలుకవచ్చు॥ 150

వ॥ అప్పుడు రామచంద్రుం డిట్లనియెఁ. 151

సీ॥ పుట్టినప్పుడు సందుగొట్టునో యని జాగ
రూకతో బురిటింట సాఁకునాడు
ధన్యాత్ముఁడగు నుపాధ్యాయు సన్నిధినిఁ జే
ర్పించి విద్యలను సెప్పించునాడు
మర్యాద వెలయు సంబంధంబులోఁ గల
చెలువఁ గూరిచి పెండ్లి సేయునాడు
బహుపదార్థములు సంపాదించి దినదిన
మెలమి మీఱఁగ సమర్పించునాడు
మిమ్ముఁ గన్నవారు మీకొఱకై పడ్డ
బాధలేవి యేను పడియెఱుంగ
నైనఁ గాని బిడ్డలైతిరి మీరు నా
కిట్టి చిత్రకార్యమెందు గలదు॥ 152

సీ॥ కన్నవారలఁ బ్రోవ నెన్న బిడ్డలఁ బోలె
నన్నోమితిరి దిట్టమిన్నలార
కంటికి నిద్రయుఁ గాలికి సుఖమెఱుఁ
గక చేసితిరి పను లన్నలార

యేవేళ కేమాట లెన్ని చెప్పినను మా
అనక సల్పితిరి మహాత్ములార
కోపించి తిట్టిన నేపాటివగ పైనఁ
బొంద రైతిరి గదా పుణ్యులార
మీబలము మీప్రతాపంబు మీవిశాల
ధైర్యశౌర్యంబులును మహత్తరజవంబుఁ
దెలిసి వర్ణింప శేషుని కలవిగాదు
యిచ్చకపు మాటలనుచు గణించవలదు॥ 153

తే॥ ఎంతయో కాలమరిగె మీరిటకు వచ్చి
దేహసంబంధులగువారు దిగులు పడరె
మీయునికిపట్ల కెల్లరుఁ బోయిరందు
ప్రేమమాత్రము నిలుపుడీ రామునందు॥ 154

ఉ॥ ఇమ్ముల కేగుమంచు మిము నీగతి నాడిన నీరుకన్నులం
గ్రమ్మెడు నైనఁ జేయఁదగు కార్యముమాన వశంబుగాక నేఁ
బొమ్మనుచున్న వాఁడనన భూపతివాక్యము నాలకించి దే
హమ్ములుకంప మొందనహహాయనిమూర్ఛమునింగివానరుల్

ఆ॥ కొంతవడికి లేచి కోసలాధీశుని
చరణ సరసిజముల శిరములుంచి
మ్రొక్కి లేచి హస్తములు ముకుళించి యి
ట్లనుచుఁ బలికి రార్తి పెనఁగొనంగ॥ 156

సీ॥ తొల్లింటి తండ్రులు తోఁబొడబ్లీయ య
శశ్శరీరము లీ వొసంగినావు

వెనుకటి జనకులు విద్యనేర్పింప బ్ర
హ్మజ్ఞాన దాతవై యలరినావు
మునుఁగన్నవారు దెప్పుచుఁ దిండి పెట్టంగ
మించిన కూర్మిఁ దిన్పించినావు
సాఁకిన పితలు సంసార మీయంగ ని
మ్ముల మోక్షపథమీవు దెలిపినావు
కాన నీవు మమ్ముఁ గన్నవారలకంటె
హెచ్చు పితవుగాని లొచ్చుగావు
భవభవంబులందు భవదీయపాదార
వింద భక్తి నిమ్ము విశ్వరక్ష॥ 157

సీ॥ కామినీ పురుషులు కలియుచో శోణిత
వీర్యముల్ ముద్దగావించు నేర్పు
గాఢాంధకారమా కాంతాజఠరమందు
బిడ్డను బహునాళ్లు పెంచుమహిమ
జనని గర్భమునఁ బుట్టినవేళ బాలు నే
డ్పించి యప్పాలు ద్రావించు యుక్తి
మేతాలుపులు సదా మెక్కు పదార్థము
ల్బాయక పచనంబు సేయుశక్తి
నీదె చుమ్ము వేదవేదాంతములు దేవ
దేవుడంచు నిన్నుఁ దెలుపుకతనఁ
దల్లివీవె కన్నతండ్రివి నీవె వే
ఱొకడు లేఁడు జగములకుఁ దలంప॥ 158

సీ॥ కఱవు వచ్చిన వేళఁ గావలేమని లిబ్బి
కాసించి బిడ్డల నమ్మువారు
కొడుకులు రాగానె కొడుకుల గాడిదె
కొడుకులుగా నెంచి విడుచువారు
వ్యయము మోపయ్యెఁ గామానందమా బోయె
నీపిల్లలేలని యేడ్చువారు
భవదీయ భక్తి సంపాదించు పుత్రుల
జడిపించి చెడుదారి నడపువారు
కలరు తండ్రులు కాని నీవలె ఫలమున
కాసఁ జేయక భూరి దయారసమున
సాఁకు తండ్రులు లేరు ముజ్జగములందు
తరణి కిరణ ప్రకాశ సీతాహృదీశ॥ 159

ఆ॥ నీదుబొడ్డుతమ్మి నీరజాసనుని సృ
ష్టించి యతనిచేఁ బ్రపంచమును సృ
జింపఁ జేసినావు జీవకోటికి నిన్నుఁ
బోలు తండ్రి గలఁడె మూలమెన్న॥ 160

సీ॥ భవదీయ దివ్యరూపంబుఁ జూడనినాఁడు
కన్నులువోయిన క్రొన్నుకొనుచు
దావకాలాపామృతంబుఁ గ్రోలనినాఁడు
చెవులు లేనట్లు యోజించుకొనుచుఁ
త్వత్పాదపద్మము ల్తాకి మ్రొక్కనినాఁడు
చేతులూడినరీతిఁ జింతపడుచుఁ

చేరి సీతతోడ భాషింపఁ జాలనినాఁడు
రసన లేనట్టుల వ్యసనపడుచు
గడియ సేపు బ్రహ్మకల్పంబుగా నెన్ను
కొనుచు జీవమెందు కనుచు మఱిఁ గృ
శించి బ్రతుకఁగలము జీవచ్ఛవములట్లు
రఘుకులాబ్ధిచంద్ర రామచంద్ర॥ 161

సీ॥ చటులతరాజవంజవ సముద్రోద్భూత
ఖేదంబులడఁచు నీ పాదసేవ
మాక్షికద్రాక్షాసి తేక్షురసముల పై
వాల్లభ్యమొందు నీ వచన రచన
శైలభిత్తనయ వసంతకంతుల కైన
ధిక్కారమొసఁగు నీ చక్కఁదనము
స్వాశ్రితజనులపై వ్యాపించునపు డబ్ధి
తుల్యమౌ నీదు వాత్సల్యలహరి
మఱువశక్యమౌనె మాబోటిదాస సం
ఘాతములకు నెన్ని ఘనతలున్నఁ
జమురు లేనిదివ్వె జంత్రమూడిన బొమ్మ
పగిదికాదె మిమ్ముఁ బాసినంత॥ 162

ఆ॥ ఎపుడు విడని తావ కైకపత్నీవ్రతం
బునకు సత్యవాక్యమున కమోఘ
మైన బాణమున కహర్నిశంబును న
తులాచరించెదము ఖరాసురారి॥ 163

సీ॥ శత్రు వినాశలక్షణమై వెలుంగు నీ
　　తీరైన గండపెండారమునకు
శరణాగతత్రాణ బిరుదంబుగాఁదన
　　రారు నీకుడిచేతి తోరమునకు
నాశ్రితవైరి సంహారార్థముగ వెల్గు
　　చుండు నీదీర్ఘ కోదండమునకు
జిలుకు లెన్నైనిఁ దీసిన రిత్తగాక తీ
　　పారు నీభవ్య తూణీరములకుఁ

బరులచే నని బేధింపబడక యెల్ల
కాల మొకరీతి వెలయు నీకవచమునకు
వేలజోహార్లు మేము గావింతు మెపుడు
తరణితుల్యప్రకాశ సీతాహృదీశ॥ 164

సీ॥ ఆయువిచ్చితివి నీ వవనీస్థలంబేలు
　　చుండునందాక మేముండు నంత
శ్రీనిచ్చితేము యాచించు వారికిఁ బెట్టి
　　సకుటుంబముగఁ దినజాలినంత
యశమిచ్చితివి బలియంబుగా రవిచంద్రు
　　లిలఁగల వరదాఁక నిలుచునంత
జ్ఞానమిచ్చితివి నీచరణాబ్జముల భక్తి
　　సలిపి మోక్షముఁ జెందఁ జాలినంత

బలమొసంగినావు బలవద్విరోధులఁ
జంపి జయముఁ గాంచఁ జాలినంత

కాని బ్రతికినంత కాలంబు మీచెంత
మెలఁగునట్లు సేయఁ దలఁప వకట॥ 165

వ॥ అని యనేకవిధంబుల దీనాలాపంబులు వల్కుచున్న వలి
ముఖగ్రామణుల నివారించి పండితశిఖామణి యగు హను
మంతుండు శ్రీరామచంద్రునితో నిట్లనియె॥ 166

క॥ వేలుపులకు మునులకు నర
జాలములకు వానరులకు సర్వాత్మలకుఁ
మేలొనరించితి వీ క్షితి
పాలకులంబున జనించి పంకజనాభా॥ 167

తే॥ సకలభూతంబులకు మేలొసంగినట్టి
తావకీనావతార తత్వంబుఁ దెలియఁ
జాల కజ్ఞానులగుచు దూషణమొనర్చు
నీచులొందుదు రెనలేని నిరయమెపుడు॥ 168

తే॥ కలుషహర వర్తమానయుగమునఁ గాని
ముందు రాబోవు యుగములయందుఁగాని
చెట్టలెనిన్ను దూషణసేయువారు
కాంతు రాపద లుభయలోకములనోలి॥ 169

ఆ॥ చీకుతనము చెవుడు మూకత్వమును పరా
భవము చేటులోటుపాటు భయము
కలిగి తల్లడింపఁ గలరు నిన్దూషించు
పాపకర్మ లఖిల భవములందు॥ 170

తే॥ వేదవేద్యుండవైన నీవాదరమున
మానవాకార మొంద నామ్నాయ మవత

రించె రామాయణంబై ప్రపంచమందు
నీరహస్యం బెఱింగినవారు సుఖులు॥ 171

శా॥ రామా నీపయి నీసహోదరులపై రామాయణ శ్లోకధా।
రామాహాత్మ్యముపై ధరాతనయపై రామాయణ గ్రంథము।
ద్రామాజాజ్ఞ రచించినట్టి మునిపైఁ దప్పెంచి దూషించు
దు। ర్వ్యామోహాత్ములు జన్మజన్మమున దుఃఖావాప్తి
వాపోవరే॥ 172

సీ॥ తావకాశ్రితులపై దండెత్తువాఁడు శూ
ర్పనఖట్టు లంగముల్వాసి కుందు
నిన్నొక నరునిగా నెన్ని డీకొనువాఁడు
ఖరదూషణాదులకరణిఁ జచ్చు
నిన్ను వంచింపఁబూనినయట్టి మాయావి
మారీచుపగిది దుర్మరణమొందు
నీసొత్తుఁ గొనఁజూచు నీచుండు పరివార
యుతముగా రావణుగతి నశించు
నీరహస్యం బెఱింగినవారు చెడరు
కాని మౌఢ్యంబుచేఁ గన్నుఁ గానలేక
నిన్ను దూషించు దుర్మార్గు లెన్నరాని
వగపుఁ జెందుదురిల యుగయుగమునందు॥ 173

సీ॥ నీతత్వ మెఱిఁగిన నిపుణులు దండకా
వశులట్లు కాంతురు వైరివధము
భవదర్థమై కళేబరము విడుచువారు
ఖగపతిగతిఁ బొందఁగలరు ముక్తి

తనవారితోడ నీపనికిఁదోడ్పడు వార
లినజున ట్లొందుదు రెల్లసిరులు
నీవిరోధులరోసి నినుఁ గొల్చువారొండె
దరు విభీషణునిభంగి పరివృఢత్వ
మయ్య తావకాంఘ్రులందు సద్భక్తితో
మెలఁగువారు సురులకలవిగాని
కార్యములను సేయఁగలరీ ప్లవంగపుం
గవులరీతి యుగయుగంబులందు॥ 174

తే॥ వానరాకారములుదాల్చి వానరాళిఁ
జొచ్చి నొచ్చిన సారణశుకులతేవ
భక్తిలేకుండ నీకు సంబంధవేష
మూనినను వారు సౌఖ్యంబుఁ గానలేరు॥ 175

తే॥ భూసుతాక్షేమ మరయంగఁబోయి నేను
రాయబారమునాడు తారాసుతుండు
దశముఖు నిరాకరించు చందమున నెంత
వారిని గణించఁబోరు నీవారు రామ॥ 176

తే॥ అన్నిటికిఁబుట్టు నుపదేహికాళికిత్తు
నంటి మాఁడినమాడ్కి దురాత్ములాగ్ర
హించియును నీపదములు ధ్యానించువారి
నొంచఁగాలేక తామె చేటొందఁగలరు॥ 177

తే॥ పూజితవ్యయు సాధ్వియూ రాజపత్ని
మదననిభరూపుఁడగు భర్తవదలి నీచ

పురుషు నాసింపనేరని పోల్కి నీదు
దాసుఁడొందడు పరదైవతముల ప్రాపు॥ 178

ఆ॥ రాజపత్నియైన రమణి పరాయివా
రిండ్ల భిక్షమెత్త నినునకది స
హింపరానిరీతి నితరామరులఁగొల్చు
వారు నీకుఁ బనికిరారు రామ॥ 179

తే॥ కొండ చేరువనుండంగ గులకరాల
వెదకు పామరుగతి నిన్ను హృదయమందుఁ
గాననేరక యజ్ఞానులైనవారు
లాతివేల్పులఁ గొల్తు రిలాస్థలమున॥ 180

సీ॥ జానకీ లక్ష్మణ సహితుండవై యొప్పు
నీ విగ్రహంబులు నిల్పుచోట
నిజదేశికునికృప నీ దివ్యమంత్ర మా
ర్జించి జపం బొగిఁ జేయుచోట
నమృతోపమానమై యలరునీనామంబు
లంచితభక్తిఁ గీర్తించుచోటఁ
బర్వఘస్రముల నీపాదాబ్జములు తుల
సీపుష్పములఁ బూజ సేయుచోట
దావకాశ్రితులన దభ్రానురక్తి న
ర్చించుచోటనెల్ల సిరులు కరులు
హరులు ముత్తియంపుసరులు సుందరులు మొ
దవులు గలిగియుండు దశముఖారి॥ 181

తే॥ గూబలకు సూర్యకాంతి గోగులకు నోద
నంబు దుస్సహమైనట్లనాధరక్ష
నీప్రభావంబు దుర్జనానీకమునకు
సరిపడదు వారిపాతకోత్కరమువలన॥ 182

ఆ॥ దృగ్గుగాతురుండు దీపంబుఁ గనికష్ట
పడినరీతి నీదుభజనపరులఁ
జూచినంతలో నసూయఁ గైకొని సహిం
పంగలేరు దేవపాపరతులు॥ 183

ఆ॥ మ్రాఁకు మ్రాఁకునందు మారీచుఁడొగి భవ
దీయరూప మన్ని దెసలఁగాంచి
భయముఁ జెందినట్లు పాపులు నీభక్త
వరులఁజూచి జడియుదురు నిజంబు॥ 184

తే॥ అయ్య నీకథయైన రామాయణంబుఁ
జెప్పువాఁడును వినువాఁడుఁ జెడనిభక్తి
తోడఁ బారాయణ మొనర్చువాఁడు వర్త
మాన దేహమునందె కామములఁ గాంచు॥ 185

వ॥ శ్రీరామచంద్రా! మదీయ రసనేంద్రియంబు పవిత్రంబగుటకు దేవరవారినిఁ గొంచెము వర్ణించెద నాలకింపుము. మనుకులోధస్వరత్నాకర నీహారగభస్తీ, కౌసల్యా దశరథానంద దాయకా, కుశికతనయాధ్వరసంరక్షకా, గౌతమకర్మంది జాయాపాషాణరూప విమోచన పాదరజఃపుంజ విరాజమానా, చండీనాథప్రచండకోదండఖండనా, విదేహక్ష్మా

పాలక మనస్సంశయ తమఃపటల బాలభాస్కరా, ధరా
సుతావరాశయ కైరవ కైరవాప్తా, భార్గవావలేపధారాధర
సంఘాతఝంఝా ప్రభంజనా, స్వకజనకసత్యవాక్పరిపాలన
దీక్షాదురంధరా, భరద్వాజజటీశ్వరస్తుతామల గుణగణాల
వాలా, చిత్రకూటాచలప్రథమనివాసా, భరతప్రార్థిత చతు
ర్దశవర్షానంతరాంగీకృతాయోధ్యారాజ్యవైభవా, విరాధా
ఖ్యక్షపాచరవధసమర్థా, శరభంగపారికాంక్షి మోక్షదా
యకా, సుతీక్ష్ణమునివందిత పావనచరణారవిందయుగళా,
దండకారణ్యస్థాఖిలమునిజనహృదయ శల్యప్రాయవిభావరీ
చర సముదయకృతబాధా నివారణకారణాభయదానప్రదా
ద్భుతవచస్సమూహసేవధీ, కుంభసంభవసంయమీశ్వరదత్తా
సాధారణదివ్యాయుధవిశేషా, కుటిలరాత్రించరీ కర్ణనాసా
చ్ఛేదనా, ఖరదూషణాదిచతుర్దశసహస్రకఠోరనక్తంచరవ
రండగహన వైశ్వానరాయ మానసునిశితశిలీముఖపరం
పరా హేతుభీషణ కార్ముకపాణిపద్మా, కపటమారీచప్రాణా
నిల కాకోదరప్రాయభయంకరపృషత్కా, దశకంధరకలహా
వ్యాజార్పితస్వకీయకాయ జటాయుమోక్షప్రదా, కబంధ
పలాశియోజన బాహుద్వయఖండనా, సదాచార్యపాదార
విందపరిచర్యా లబ్ధానందభరిత కిరాతాంగనా సమర్పిత
ఫలహారాంగీకార సంజనితదయావత్తమోక్షసామ్రాజ్యా,
ఫలకిసలయ కుసుమపరిపూర్ణ తరుజాత పరివేష్టిత తట
ప్రదేశ బంధుర పంపాసరోవర విహారా, సుగ్రీవభయ నివా
రణా, పురందరనందన గంధగజసమదకంఠీరవా, రాజీవ

బాంధవకుమారవలీముఖ రాజ్యప్రదాయకా, ద్వీపవతీ నాయకప్రబలావలేప ప్రాలేయతరణి కిరణసందోహసదృశ ప్రదరా, లంకాపురీసంచార కర్కశనిశాటనికరశమనసమ శాఖామృగోత్సాహదాయకాద్భుతప్రభావా, పురుహూతజిత్ప్రముఖ నిఖిలక్రవ్యాద నిర్మూలకారణా, మూలబలాకూపార బాడబానలా, దశాననకుంభకర్ణ శిలోచ్చయశతారధారా, కమలభవభవపవిధరాధిసురనికరమునిగణపనాయిత చరణసరోజయుగ్మా. వహ్నిపూర్వకపరిశీలిత శుచిర్ఖ్యాత సీతాపరిగ్రహమానసాంభోజా, భూతధాత్రీసుతా లక్ష్మణ సమేత పుష్పకవిమానారూఢస్థితీ, సురనరతిర్యక్పరివేష్టి తాయోధ్యాపురస్థితసింహాసనారూఢా, పరనితంబినీ సౌందర్యపరాఙ్ముఖా, ధరాకుమారీ సుకుమార సౌందర్యాదిల సద్గుణలహరీవిహారమానసా, శరణాగతరక్షణదీక్షా దురంధరా నమస్కారంబులు, నమస్కారంబులు, నమస్కారంబులు, దేవా నీకల్యాణగుణవిలాసప్రభావంబులు తెలిసి వక్కాణింప, జతురాస్య, పంచాస్య, షడాస్య, సహస్రాస్య సహస్రాక్షులకును వాగ్దేవికిని శక్యంబుగాదు. తక్కినవారిని, వక్కాణించుట పరిహాసాస్పదంబైనను స్వజాతిసహజంబగు బుద్ధిచాపల్యంబుచేతను నిలుపోపరాని భక్తిని శేషంబుచేతనుఁ బ్రేలుచున్నవాఁడ. దోషభోగ్యులగుదేవరవారు మదీయ వాగ్దోషంబులు క్షమింతురనియు ధైర్యంబు గలదు నీ బింబపూజనంబులేని భవనంబు పితృవనంబు, నీకు సమర్పింపనివారిజీవనంబు వనంబు, నిన్ను విడిచి జపించువాని

మంత్రంబు నడుమంత్రంబు, నీకుం బరిచర్య చేయనివాని దేహంబు మృత్యుగేహంబు, నిన్నుం బొగడని వానివిద్య మిథ్య, నీభక్తులతో సంభాషించనివారంబు నరకద్వారంబు, కావున మదీయత్రికరణంబులు సర్వకాల సర్వదేశ సర్వావస్థలయందు నీయందు నిలుచునట్లును నీరామాయణం బీలోకంబున నుండునంతవరకు నాశరీరంబు నిలుచునట్లును, వరం బొసంగు మవ్వరం బేల యంటివేని నీవిలాసంబు లాకర్ణింపుచు సుఖముగాఁ గాలంబుఁ గడపెదఁ ద్వదీయ గాథాప్రపంచంబు వర్ణించువారును వినువారును లేనప్పుడీ లోకంబు సత్పురుషులకు నివాసయోగ్యంబు గా దట్టి పాపిష్ఠికాలంబున నిట్టిరోఁతకోఁతిమేనితో నుండుట నిందాకరంబు, భక్తాభీష్టఫలప్రదాయకా రక్షింపుమని వేడుచున్న వాయుపుత్రుం గాంచి శ్రీరామచంద్రుండు లేచి యాలింగనంబు గావించి దీవించి తండ్రీ నీవడిగిన వరంబులన్నియు నొసంగితి. నీకును నాకును రూపభేదంబె కాని మానసభేదంబు లేదు. నిన్నారాధించువారిని మద్భక్తులతో సమానముగాఁ జూతు నీకీర్తి సర్వలోకంబుల వ్యాపించి శాశ్వతంబై ప్రకాశించు మేలుచేసిన వానికది యొనర్పఁబూను టాపద గోరినట్లగుంగాన నీ కెన్నటికి నుపకారం బొనర్పఁ దలంపనని బహూకరించి విభీషణునితో నిట్లనియె. 186

ఆ॥ తావకీ నభవము దైతేయకుల మందు
నైనఁ గానిదేవ మానివరుల

శీలమున మెలంగి తీలోకమునభవా
దృశుడొకండు లేడు ధీరవర్య॥ 187

ఆ॥ ఎంతమేటికైన హితపరులగు పెద్ద
వారు నీతి సెప్పవలయు నంద్రు
కాన లంకఁజేరికదు జాగరూకత
నేలుమయ్య ధర్మశీలి వగుచు॥ 188

తే॥ దానవేశ్వరసుగుణి వీవైనఁగాని
పరిచరులు మాంసభోజనపరులుగాన
నగ్ని తప్తజలంబు శైత్యంబుఁ బాయు
మాడ్కి నీగుణ మేమైన మాలునేమొ॥ 189

తే॥ శాస్త్రవశ్యుఁడవై సదాచార సత్య
శౌచములు గల్గి భూతహింసనములేక
ధనదువాక్యంబునకు జవదాఁటకుండ
నేల పాలింపు మెప్పుడు మేలు గలుగు॥ 190

తే॥ మనవనాటుల నన్నెద మఱువకుండ
రాజ్యపరిపాలనంబు నెరపుము నిన్నుఁ
దేరిచూడంగ లే రాదితేయులైన
సర్వకాలంబు గల మదాశ్రయమువలన॥ 191

తే॥ వచ్చి చిరకాలమాయె నీ విచ్చటికినిఁ
బోయి రమ్మాత్మపురి కని పుడమిపట్టి
మగడు వల్కంగ నతని నిర్మలపదాంబు
జంబులకు మ్రొక్కి యావిభీషణుఁడు వల్కె॥ 192

సీ॥ పాపనివాసమై పలలాశనాగ్రహమై
యెప్పుడానవదేహ మొందినాడ
సురముని ద్రోహియై పరగురావణునితోఁ
గలసి కాలంబెంతొ మెలఁగినాడ
జాయాసుతాది సంసారసంబంధమే
పురుషార్థమని మెంచి పొంగినాడ
మునివరేణ్యులు తెల్పు మోక్షమార్గములన్ని
వినియు నశ్రద్ధలో మునిగినాడ
దాహపీడితుండు త్రైలోక్యపావని
యైన గంగ గాంచినట్టు లాజ
వంజ వాశ్రయాశవారిదంబైన త్వ
దాశ్రయంబు నేటి కందినాడ॥ 193

ఉ॥ వేలకొలందియేడుల వివేకముతోఁ దశకంఠుచెంత నే
నాలరి నైభవాంబునిధి యందునదారసుతాదివాంఛ చేఁ
గూలుట చాలు ముక్తి కనుకూలములైన భవత్పదాబ్జముల్
తాలిమిఁ గొల్చుచుండెదను దాశరథీ కృప నానతీయవే॥

తే॥ బ్రహ్మపదమునుఁ గైలాసపదము నింద్ర
పదమనఁగఁ గలవెన్నియో పదములోలి
గాని నీపదము లొసంగు గాఢసౌఖ్య
మున శతాంశమిడఁగ లేవు మునిశరణ్యా॥ 195

ఉ॥ గట్టునఁ జేరు భీరుని నగాధజలంబులఁ ద్రోసినట్లు నే
నెట్టెటులో భవమ్ముల కుదిమ్మగు సంసృతిఁ బాసి వచ్చి నీ

పట్టుననిల్పి ముక్తికి నుపాయము సిక్కెనటంచుఁ బొంగుచో
నెట్టెదవేల పొమ్మనుచు నీకు భరంబె మదీయపోషణల్॥

ఉ॥ ఎక్కడ లంక దారసుతులెక్కడ నెవ్వరికెవ్వ రాప్తులా
నిక్కడ నిన్నుఁబాసి మను, టెక్కడరాజ్యము నేలు కేలనీ
యిక్కకురాకమున్ను నివియెల్ల సుఖంబనితోఁచుగాక నే
డెక్కునె మానసంబునకు నెన్నివిధంబుల బోధచేసినన్॥

చ॥ తనకొఱకేడ్చుబిడ్డకు ముదంబున బొమ్మనొసంగి యాడుకొ
మ్మనిపనికేగు తల్లివలె నక్కటభక్తులమైనమమ్ముఁ జ
య్యన నిజరాజ్యభూములకునంపి తదీయములైన తుచ్ఛభో
గనికరమందుఁ బాదుకొననుఁగాఁ దలపోసితివయ్య రాఘవా॥

మ॥ ధనధాన్యంబులుబంధుమిత్రులునుఁ బుత్రభ్రాతృవర్గంబులున్
జననీవప్తలు రత్నహారములు వస్త్రక్షేత్రగంధర్వ దం
తినికాయంబులు తావకీనకరుణాప్తిం గల్గులేకున్న స్వ
ప్ననిభంబుల్ మృగతృష్ణలాగద మహాభాగ్యంబులునే
భోగ్యముల్॥ 199

చ॥ ఇహపరలోకసౌఖ్యముల నింపుగఁ జెందదలంచువారికిన్
బహువిధమార్గముల్కలవ పాయయుతంబుల వెల్లనాఁగినన్
రహిఁ ఫలమీవ యీవలయు రాఘవతద్విధకాంక్షలేది ని
వ్నహారహామున్ భజించెడు మహాత్ములు పొందుదు రీప్సి
తార్థముల్॥ 200

ఆ॥ సిత లభించెనేని చీకు తన్మాధురీ
మహిమఁ జొక్కియుందు మడియునట్లు

నిన్నుఁ గాంచువేళ నీభక్తుఁ డఖిలంబు
విడిచి లీనుఁ డగును వేదవేద్య॥ 201

సీ॥ కనకాంబరములు శృంగారంబుగాఁ దాల్చి
తీరైనకస్తూరితిలక ముంచి
తళుకులనీను ముక్తాహారములు వేసి
కోమరారు మణిమకుటము ధరించి
మొసలివారొుంటు లింపెసఁగఁ దాల్చి సువర్ణ
మయతనుత్రాణ మేమఱక తొడిగి
సౌందర్యమునఁ బుష్పశరకోటి నదలించి
తనుకాంతిచేత మార్తాండు గెలిచి
దినదినం బీ యయోధ్యలో దివ్య లలర
గొనబు సింగంపుఁబీఁటపైఁ గూరుచుండు
నిన్నుఁ గాంచుట మాని నే నెన్నిగతుల
నైన జీవింపనేర దశాననారి॥ 202

వ॥ అని బహువిధంబులగు దీనాలాపంబులాడి దుఃఖించు
విభీషణునిఁ గౌగిలించి యూఱడిల్లఁజేసి॥ 203

తే॥ ఘోరసంసారవార్ధిలోఁ గూలుదునని
సందియముఁ జెందవలదు నాయందుభక్తి
గలమహాత్ములు నేమియుఁ గలఁగ, రజాల
దంధకారముర ము సూర్యోదయమునుఁబోలె॥ 204

తే॥ అన్నియాశ్రమములలో గృహస్థధర్మ
మెక్కుడని పల్కిరిలసూరులెల్ల దాని

వలననేకద దేహముల్కలుగుటయును
నిలుచుటయు వృద్ధిగనుటయు నీవెఱుఁగవె॥ 205

తే॥ అదియుఁగాకొక్క వృత్తాంత మానతిత్తు
వినుము తావకదారయై వెలయుసరమ
జాబొాగిలి ఖంచి రాజహంసంబుచేతఁ
బనిచె నటజానకీదేవి పజ్జకెలమి॥ 206

సీ॥ లంకాపురమున నాలతకూనలిర్వురు
బహుదినంబులు పరస్పరముమైత్రి
నెరపియుండుటఁజేసి నేడుజానకిపేర
వ్రాసిపంపించె నవ్వనరుహాక్షి
తల్లేఖనంది సీతాదేవి రాతిరి
నాకిచ్చి మిగుల చీకాకుపడుచు
నాతోననిన భాషణంబులు వినుమోలి
మనుజమాంసము మెక్కు దనుజకామి
నీసమూహమధ్యంబునఁ గాసిఁ జెందు
వేళ నన్నూఱడించిన వెలఁది సరమ
యొక్కతయకాదె మనమామె నిక్కరణిని
వగవగాఁ జేయు టెంతటితగవు నాథ॥ 207

సీ॥ నీచుఁడౌ రాక్షసనేతవన్నినమాయ
లన్నియుఁ దెలిసి మాకపుడె చెప్పె
సోకులమ్మారుతితోఁకఁ గాల్చిననాడు
తోడనే వచ్చి నాతోడఁ దెల్పెఁ

కృపణవిద్యుజ్జిహ్వాకృతమాయచే నేడ్వ
నుచితవాక్యముల నన్నూఱడించె
జన్యరంగమున రాక్షసనాశనంబు మీ
విజయంబు తోడ్తోడ విన్నవించె
బంతితలలవాఁడు పాతాళహోమంబు
నెరపుగీము మనవనేచరులకుఁ
జూపి మే లొనర్చె నాపుణ్యసాధ్వియౌ
సరమఁ బోలువారు జగతిఁ గలరె॥ 208

ఉ॥ పావనశీలయౌ సరమ పల్మరు పూనికఁ జేసి పొమ్మనం
గావినికాదె నీచదశకంఠునిఁ బాసి విభీషణుం డొగిం
దావక పాదపద్మములదాఁపునఁ జేరి విరోధిమర్మముల్
కేవలభక్తితోఁ దెలిపి కీరితిగాంచుట రాజ్యమేలుటల్॥ 209

తే॥ చెలి విడిచి నేను నీకడఁ జేరునాఁడు
సరమ నాకొసఁగిన పరిచర్యకీయఁ
దగినసత్కార్యయోగ్య పదార్థమొకటి
యైనలేదాయె ననుకొంటి నాత్మనాథ॥ 210

ఆ॥ గులకరాలలోనఁ జెలఁగుమానికముల
లీల దుష్టదానవాళిలోన
సత్యవంతులైన సరమావిభీషణుల్
నిలువకున్నలంక నీరుగాదె॥ 211

క॥ మనదంపతులం గలిపిన
ఘనదంపతు లిట్టులెడలుఁగావచ్చునె నా

మనవిఁ బని సరమ చెంతకుఁ
బనుపుము తన్నాథునికి శుభంబగు ననుచున్॥ 212

వ॥ మత్ప్రాణనాయకియగు సీత వక్కాణించెనని చెప్పి శ్రీరామ
చంద్రుండు సరమాప్రేషితంబగు లేఖ నందిచ్చుటయు
నవ్విభీషణుండు తమదంపతులయందు సీతారాములకుంగల
వాత్సల్యంబున కచ్చెరువందుచు రామవియోగంబు కలు
గునేయని దుఃఖింపుచు నేమియుంబలుక కూరకుండె
నంతలో సీతావల్లభుండు సుగ్రీవమహారాజుగారితో నిట్ల
నియె, 213

మ॥ బలవద్వైరముమాని వాలిగెడసెన్ బాహుప్రతాపంబుచే
గెలువంజాలుదు వెల్లలోకములు నీ కీర్తిప్రభావంబులు
జ్వలమై యెప్పుడుగాక శాశ్వతముగా శక్రాదిసర్వామరుల్
తులగా నేర్తురె వైభవంబునకునీతో భానుమన్నందనా॥214

శా॥ ఎంతోకాలము పోయెఁగాదె రహిం నీవిచ్చోటికి న్వచ్చి నే
సంతోషించితి బోయిరమ్ము నిజరాజ్యశ్రీలు పాలింపనా
వంతైనం దిగులొందఁగావలదు సర్వత్సన్మధరాటచ్ఛటా
స్వాంతంబు ల్కరఁగింపుమయ్య సుముదావాప్తిన్ సదా
ప్రోచుచున్॥ 215

సీ॥ నలుని నీలుని వాయునందనుఁ బనసుని
జ్యోతిర్ముఖుని నవ్విధాతృసుతుని
శరభు నంగదునిఁ గేసరిని సుషేణుని
గంధమాదనుని నగ్గజగవయులఁ

దార గవాక్ష శతవలిధూమ్రములదరీ
ముఖరుమణ్వంతకుముదుల విజయ
సంపాతిమైందేంద్రజానులహరచండ
వినతద్వివిధరంభ వేగదర్శి
క్రోధన శ్వేతులాదియగాకోటిగములు
మఱియుఁ దక్కినకీశులమార్గవాశ
యమున రక్షింపు మంబురుహాప్తతనయ
దానిచే మేలు గల్గు నిద్ధరణి నీకు॥ 216

ఉ॥ అందఱికంటె నంగదు మహాదయతో నొగిలాలనంబు సే
యందగు నెందుకన్న భవదగ్రజుఁ డీలుగువేళ నిన్ను న
న్నుం దగఁజేరి తాస్వకతనూజుని దీనత నప్పగించి పో
యెం దివికానుడుల్ మఱువ నెట్లగుసాధ్యము మంచివారికిన్॥

చ॥ అనివచియించి వాలిసుతు నాదటఁ జెంతకులాగి నాయనా
యినసుతుమాటదాఁటకితఁడే జనకుండు మరించియున్న నీ
జనకుఁడె పిన్నతండ్రియని చక్కఁదలంపుమటన్నఁబొంగి య
వ్వనచరపుంగవుండు రఘువర్యునిపాదములందు వ్రాలియున్

ఉ॥ ఏమనిచెప్పవచ్చు జగదీశ్వర తావకసత్యశీలముల్
పామరుఁడైననన్నుఁ బరిపాలనసేయుటకింత పూన్కిఁ జే
తోముద మొప్ప భానుజునితో డనవచించితి నీఋణంబు నే
నేమిటఁదీర్చుకొందు నిఁక నెన్నిభవంబులనైన రాఘవా॥

ఆ॥ తారచేతనైనఁ దండ్రిచేనైన
నిక్కరణి గారవంబుఁగాంచిమెఱుఁగ

బూతకోటినెల్లఁ బుట్టించుతండ్రి నీ
కుండుకూర్మి పరులకుండు టెట్లు॥ 220

ఆ॥ చెఱకడమునకంటె సితకంటెఁ బూదేనె
కంటెఁ బాయసమునకంటె దాక
రసముకంటెఁదీపు రామనీకల్యాణ
గుణము లనుభవించు గుణనిధులకు॥ 221

ఆ॥ దేహమైనవాఁడు దేవనీకల్యాణ
గుణగణాబ్ధినొక్క గుణముఁదీసు
కొనినుతింప సాఁగినను బ్రహ్మకల్పంబు
చాలుననఁగరాదు జానకీశ॥ 222

ఆ॥ శౌర్యధైర్య సత్యశౌచంబులునుఁ బరా
క్రమము బాంధవంబు కరుణసిరియు
నిర్జితేంద్రియత్వ మార్జవంబునుభవ
ద్దేహమైజనించె దితిసుతారి॥ 223

ఆ॥ గరిమ నీదుసోయగముఁ గన్నపురుషుల
కైన మోహజనకమౌను చాన
గములఁ జెప్పనేల కామజయంతులు
సాటిరారు నీదుగోటికైన॥ 224

ఆ॥ గురుబుభుక్షుచేతఁ దిరుగుమానిసిదిండి
కలికి నిన్ను దండకావనమునఁ
గాంచినంతలోనె కౌఁగిలింపఁ దలంచె
నొడిసి సోయగమున కోడిగాదె॥ 225

ఆ॥ ఎన్నిసార్లు నీవు తన్ను నిందించి తి
రస్కరింపుచున్న రావణుండు
మాటువల్కలేక తాటుమాటయ్యె నీ
తేజమునకు నోడి ధీరవంద్య॥ 226

చ॥ గొలుసులఁగట్టి వేసినను గొంచెము సేపొకచోటఁ బాదముల్
నిలిపి వసింపఁజాలని వనేచరపుంగవులీ యయోధ్యలో
పల మెడఁబట్టి నెట్టినను బాయక యిన్ని దినంబులుంటకే
వల దయతోడఁ గూడినభవత్సుగుణంబులఁజొక్కియేకదా॥

తే॥ నిమిష మొక్కెడఁ గాలూది నిలువనట్టి
కలిమిజవరాలు భవదురస్థలమునందు
నిలిచినట్టుల వానరావళియు నీదు
సుగుణములఁ జొక్కినిలిచి రిచ్చోటునందు॥ 228

తే॥ స్వాశ్రితులపై శిరీషపుష్పంబు ఘోర
వైరిసముదాయములయందు హీరనిభము
యాచకశ్రేణియందు సురావనీజ
మగుచు వెలయు భవచ్చిత్తమవనిజేశ॥ 229

తే॥ శాత్రవపరాక్రమము భక్తజనుల దోష
ములు వనీపకులకుఁ బ్రేమముననొసంగు
ద్రవ్యమును లెక్కసేయని తావకీన
భావగాంభీర్య మెన్నంగవశమె రామ॥ 230

తే॥ యాచకులుసేయునుతియు నిజాశ్రితాళి
భక్తినొసఁగు పదార్థముల్ రక్తి శరణు

సేయువారల గుణమెంత చిన్నదైన
గొప్పగానెంచి రక్షింపఁగోరుదీశ॥ 231

తే॥ దశగళుండొక్కనాటి యుద్ధముననీదు
బారిఁబడి యేడ్చుచుండంగ బాలుఁజూచి
బలముఁగైకొని రమ్మని పనిచినాడ
విట్టిసౌశీల్య మెవ్వరికేని గలదె॥ 232

చ॥ శరణనియవ్విభీషణుఁడు సాగిలబడ్డ నిమేషమందె దు
ష్కరమగు పంక్తికంధరని కారణకృత్యముకాకమున్న చె
చ్చెర సరమామనోహరునిఁ జేసితి లంకకు రాజుగాఁగ నీ
గురుతరశౌర్యధైర్యములకుం గడియున్నదె జానకీపతీ॥ 233

ఉ॥ ఊరకయుండలేక యిటు లుబ్బుననన్నుతిఁ జేతగాని నీ
చారుగుణప్రభావములు సత్యపరాక్రమముల్ గణింప ని
స్సారవనాటవాక్కులకు సాధ్యమెయంచు ముగించినంతనా
సూరకుమారుఁడిట్లనియెసూరివరుండగు రామచంద్రుతోన్॥

ఉ॥ కొమ్మమెకంపుతేఁడులనుఁ గూరిమిరక్షణసేయుమంచు నా
కిమ్ములఁజెప్పసాఁగితివివెక్కడిమాటలు రాజవందు లో
కమ్ములనేలునీవకద కర్తవు కాచినకావకున్న నే
నిమ్మహిఁదావకాంఘ్రులుభజింపుచుదాసుఁడనైచరించెదన్॥

ఉ॥ అంగదునేలునట్టిపనికై యిటుసారెకుహెచ్చరించెదీ
యంగదునందు నాకొకదురాశయముండిన నుండనిమ్ము చే
యంగలనే పరాభవమహా యటు దుర్నయమాచరించి నీ
ముంగలనిల్వఁగావశమె మూఢుడనే ధరణీసుతాధిపా॥ 236

సీ॥ అడవిలోఁ బలఁగాచినట్టివెన్నెల కదా
నీభక్తి లేనిమన్నని సిరులు
మగని చేరికఁ బాయు మగువయందముగదా
నీపూజ సేయని నీచుబ్రతుకు
మానితుండగు రాజు లేనిరాష్ట్రముకదా
నీస్తుతుల్ సేయ లేని నరువిద్య
నెఱదివ్వె లేక పాడఱిన గేహముగదా
నీ నెనరొందని వాని మేను

కాన నేను సర్వకాలంబులందు నీ
పాదసేవ చేతఁ బ్రబలునట్టు
లితరదుర్మనీష లెల్లనశించు న
ట్లిమ్ము వరము జానకీశ రామ॥ 237

వ॥ అని బహువిధంబుల వినుతించి కౌసలేయుని చేత వాంఛిత వరంబులన్నియుం బ్రాపించి దశరథనందనా! మాకుం దల్లియగు సీతామహాదేవి పాదములకు నమస్కరించి తదీయదివ్య శాసనంబు వడయవలయునని మేమును వానరాంగనలునుఁ గోరుచుంటిమన నభ్భరతాగ్రజుం డట్ల కానిమ్మని బయలు దేఱుటయు నద్దాశరథి వెంట సుగ్రీవాంగదాంజనేయనల నీలజాంబవత్ప్రముఖ వలీముఖులును వానరాంగనలును విభీషణ భరత శత్రుఘ్నులును గమనంబొనరించి భూసుతామందిరమ్మునకరిగి రంత నాలోకజనని ప్రాణనాథుండగు శ్రీరామచంద్రునకు నమస్కరించె నటుపిమ్మట నద్దేవుం డొక్కసువర్ణాసనంబున సుఖాసీనుండయ్యె నమ్మహా

త్మునిశాసనంబున సీతామహాదేవియుఁ దత్సాన్నిధ్యస్వర్ణ
పీఠంబునఁ గూర్చుండె నయ్యవసరంబున వారియాజ్ఞ
శిరసావహించి తక్కినవారంద ఱుచితాసనంబులం బరి
వేష్టించి కూర్చుండిరనంతరంబున బద్ధాంజలిపుటుండై
భావిబ్రహ్మయగు హనుమత్సూరివర్యుం డిట్లనియె. 238

శా॥ తల్లీ వందనముల్ జగజ్జనని జోతల్ జానకీ మ్రొక్కులు
త్ఫుల్లాంభోరుహలోచనానతులు భూపుత్రీ నమస్కారముల్
చిల్లోలాశయ చిన్నిపూలు వరలక్ష్మీదేవి జేజేలు సం
పల్లాభాధికదాయకీ వినతులో పద్మాలయాదండముల్ ॥239

తే॥ పూర్వ మొదవిన యాపదంభోధిదాటి
భర్తతోఁగూడి సామ్రాజ్యపదవియందు
నంచితసుఖంబులొందు నిన్గాంచినంత
సార్థకంబయ్యె నాదులోచనయుగంబు॥ 240

ఆ॥ నీవురాఘవుండు నిరుపమానానంద
భరితులగుచు రాజ్యపాలనంబు
సేయ నెపుడుసూతునోయనువాంఛ నా
కిపుడుదీరె జనకనృపకుమారి॥ 241

సీ॥ మున్ను పంపాతీరమున భవన్నాథుని
కమనీయరూపంబు గాంచినాడఁ
దరువాతనాతని దారవౌ నీపాద
యుగళంబు లంకలోనఁ గనినాడ
ధాత మీయిద్దఱి దాంపత్యమొనగూర్చి
ధన్యుఁడాయెనటంచుఁ దలఁచినాడ

మీపాదపద్మములు ప్రాపించి ముజ్జగ
ములమేలుబంతినై చెలఁగినాఁడ
వపువునిల్చునంతవరకు మీసేవయే
ధారకాదులని యుదారదీక్షఁ
దాల్చియున్నవాఁడఁ దల్లి మిమ్మెడఁబాయ
నోడి యేడ్చుచున్నవాఁడ నిపుడు॥ 242

ఆ॥ ప్రాణతుల్యుఁడైన ప్రాణనాథునిఁబాసి
లంక కేగి పదినెలలు వసించి
చెట్టునీడనిల్చి జేజేలచానల
చెఱలుమాన్పినావు శ్రీలతాంగి॥ 243

ఆ॥ జగ్ధి లేక దేహసంస్కారములు లేక
నిద్ర లేక మంచినీళ్లు లేక
యుపవసించి లంకనుంటివి నిర్జరాం
గనల చెఱలు మాన్పఁగాఁ దలంచి॥ 244

ఆ॥ పంచవటి రావణుఁడు కంటఁ బడిననాఁడె
భస్మమొనరింపఁజాలియు బాము లోందు
దైవతస్త్రీలఁ బ్రోవంగఁదలఁచి యింత
గాథఁ జరిగించి తేమనంగలము తల్లి॥ 245

వ॥ శ్రీరామచంద్రమనోహారిణీ, విదేహరాజవంశపావనీ, పరి
మితి లేనిప్రణామంబు లాచరించెద వాగ్దోషంబులు క్షమింప
వలయు. శ్రీరామప్రభుం డశేషజగత్కారణుండును జగ
దేకజనకుండగు నాదినారాయణుండు నీ వఖిలవిష్టపసవిత్రి
యగు నాదిలక్ష్మి వీరహస్యంబు సామాన్యులకు దురవగా

హంబు, తామసులకు మీ ప్రభావం బెన్నడును గోచరింపదు. రాజసులకు విపరీతంబుగాఁ దోఁచు. విపరీతంబన నెట్టిదంట్రి వేని శిల దారువుగాను దారువు శిలగాను, తీపు చేదుగాను, చేదు తీపుగాను, మంచి చెడ్డగాను, చెడ్డ మంచిగా నొకటి రెండుగాను, రెం డొకటిగానుఁ దోఁచు నట్టిది విపరీతజ్ఞానం బనంబడు నది గలవారు విపరీత జ్ఞాను లనఁబడుదు రప్పాపాత్ములకు మీయప్రాకృతచర్య లన్నియు మానుషచర్యలట్లు కానంబడు: నా పాడుతెలివి శాస్త్రంబులచేతను పండితహితోపదేశంబులవలనను నివర్తిం చునది కాదు. యముని క్రూరదండనలచేతను బహుజన్మ సహస్ర దుఃఖానుభవంబుచేతను దీరవలసియుండు నన్నిచు లం జెప్పనేల. సాత్వికాగ్రేసరుల కున్నదున్నట్లు గోచరించు టచే నమ్మహాత్ములు మీ తత్వంబును మీచేఁ దమకు గలుగు తరణోపాయంబునుఁ దెలిసికొని యితర వ్యాపారం బులు మాని నిరంతరము భజింతురు. సమీపంబునంగల భేకంబు రాజీవమకరందం బాస్వాదింపలేనట్లును, దర్వి, శాక రుచి యెఱుంగఁజాలనట్లును తామసులు మిమ్మెన్నటికిం గానఁజాలరు. రత్నంబును రాలంబోలె నిరాకరించు కుక్కు టంబురీతి, రాజసులు మిమ్ము దూషింతురు. గనిలోని మాని కంబుల నంజనసాయంబునం గాంచు పరీక్షకునివలె సాత్వి కులు మిమ్ము భజింతురు. మార్గంబుఁగానక నూతంగూలు గ్రుడ్డివానిగతి మిమ్మెఱుంగనివారు భవార్ణంబునం గూలు దు రగ్నిని సమీపించువారు శీతబాధారహితులై సుఖించు

శేవ మిమ్మారాధించువారు సంసారసముద్రంబు దాఁటి శాశ్వతానందంబు నొందుదురు. మిమ్ము విరోధించువారు చెడుదురనుటకు ఖరదూషణత్రిశిర రావణకుంభకర్ణేంద్రజిదాది రాక్షసులును, మిమ్మారాధించువారు సుఖులగుదురనుటకు నస్మదాదివానరులును, విభీషణాదులును సాక్ష్యంబు. వేయిమాటలేల ప్రత్యక్షంబునకుఁ బ్రమాణంబును ముంజేతి కంకణమ్మున కద్దంబును, నిరుపయోగంబు. మిమ్మారాధించువారు మహాత్ములు గనుక వారికి వందనంబు లాచరించెద. మిమ్ముం దెలియనివారిం గూర్చి సహింతు: క్షమించెద. మిమ్ముదూషించువారి వధింపఁదలంచియు వారి నాశంబునకు వారిపాపంబు చాలియుండ నే నేలయని యూరకుందు నది యట్లుండనిమ్ము మీకథగలంతకాలంబు శరీరంబు నిలుచునట్లు మజ్జనకుండగు రాఘవుండు వరంబొసంగె నీవు తల్లివి కావున మీ దంపతుల శ్రీపాదంబులు నాహృదయకమలంబున నెల్లకాలంబుండునట్లు వరంబొసంగుమనిన నద్దేవి మగని మొగంబుఁగాంచి తదీయశాసనంబు వహించి యవ్వరం బొసంగి వెండియు నిట్లనియె. 246

సీ॥ ఆవంతయైన నీకాపత్తిలేకుండఁ
గాలంబు సుఖలీలఁ గడచుఁగాక
మాదంపతుల దివ్యమానసంబులు రెండు
నీమేలు గోరుచు నిలుచుఁగాక
మాభక్తులై పొల్చు మహితశీలురు నిన్ను
సదమల ప్రీతిఁ గోరుదురుగాక

మాకీర్తి చందాన నీకీర్తి సకలలో
కవ్యాప్తమై సదా ప్రాలుఁగాక
శౌర్య ధైర్య పరాక్ర మైశ్వర్య సత్య
సాహితీజ్ఞాన సమ్మద స్థైర్యముఖ మ
హాగుణాంబులు నీయందు ననవరతము
నిలిచి వర్థిల్లుఁగాక యనిలతనూజ॥ 247

వ॥ అని యిట్లు దీవించుతఱి సుగ్రీవుండు విపులగ్రీవుండై సాష్టాంగ దండవత్ప్రణామంబాచరించి లేచి యంజలీ బద్ధుండై సీతామహాదేవి కిట్లనియె. 248

సీ॥ ప్రాగద్రిమొద లస్తపర్వతాంతము దాఁకఁ
దిరుగుచో నాపదల్పొరయకుండ
జలరాశి బంధింపఁదలఁచి మహత్తరా
చలములుదెచ్చుచో నలగకుండ
త్రైలోక్య భయదమై తనరు లంకాపురి
కేగుచో సందియ మెనయకుండ
సమరస్థలమున రాక్షసులవధించుచో
నణుమాత్ర మపజయమందకుండ
నిండ్లయొద్దనుండి యేగినవారొక్క
రైనఁగాని మరణమందకుండ
బ్రతికివచ్చినారు పర్వతచరులు మీ
కరుణఁజేసి మమ్ముఁగన్నతల్లి॥ 249

తే॥ వాలిగలనాడు పెద్దమ్మవారునన్ను
ఋశ్యమూకాద్రిలో డాగురించి నీదు

పేరుదలఁపంగఁబాతె సన్నిడిచి దాని
నింకరానీకుమమ్మ మా యిండ్లకడకు॥ 250

తే॥ అందఱికి వైరిలేమి పేదఱికమునకు
నాశకారిణివగుచు నున్నావుకాన
నీకటాక్షంబు మాయందు నిలిపితేని
దాయదిఁకలేమి మమ్మోగతాళికైన॥ 251

తే॥ జనని నీకటాక్షమునకుఁ బాత్రుఁడుకాని
వానియింటఁ బెద్దవాలుగంటి
చేరినాశనంబుసేయుదశాస్యుఁ డి
క్కతనఁ జేటునొందెఁగద సవిత్రి॥ 252

తే॥ అనినసుగ్రీవచాతుర్యమునకుమెచ్చి
జానకీదేవి మందహాసంబొనర్చి
యినసుతా నీవుకోరినట్టింటరాష్ట్ర
భూమియందున సంపదలొప్పదలుఁగాత॥ 253

మ॥ అనుకూలాశయలైన కామినులతో నారోగ్యదేహంబుతో
ధనధాన్యంబులతోవశీకృతచమూ దాసీభటౌఘంబుతోఁ
దనయస్నేహితమంత్రిబంధుహితపాత్రశ్రేణితో భోగివై
యినసూతీ మనుమంచుజానకి వరంబిచ్చెం దయాపూర్ణతన్॥

క॥ తరువాత వాలిసూనుఁడు
ధరపైఁబడి జానకీపదంబులుసోకన్
శిరముంచిమొక్కి లేచియుఁ
గరములు జోడించిపలికె గద్గదఫణితిన్॥ 255

సీ॥ రాకచే మిథిలా పురప్రభునింటిలో
సాంసార సంపదల్ నింపినావు
చూపుచే రావణాసురు పుత్రపౌత్రాది
విభవముల్ నీఱుగావించినావు
మాటచే మున హనుమద్వాలవహ్నికి
సరగున శైత్యంబొసంగినావు
దీక్షచే మున్నాలుదినములలో రేము జలం
బులుమాని ప్రాణముల నిలిపినావు
బాసకగ్నిఁజొచ్చి పన్నీరమునఁదేలు
కరణి లేచివచ్చి కాంతుఁగూడి
సౌఖ్యమొందితివి యశస్సును గైకొంటి
వంబ నీప్రభావ మరయవశమె॥ 256

తే॥ తల్లిదండ్రులుగూర్చిన ధనముచే సు
తాళిజీవించినట్టులోయంబ మీప్ర
భావమున మమ్ముఁబోలిన భక్తజనులు
సౌఖ్యమొందినఁగద ప్రయోజనముమీకు॥ 257

క॥ నోరెత్తి యడుగకుండిన
నోరెమ్మడ దమ్మయైన నూరకయను మా
టారసి యిప్పుడు దేవర
వారలనడిగెద నొసంగవలయు వరంబుల్॥ 258

క॥ ఏతటిఁ దలుగనిసిరులును
మాతా మీపాదభక్తిమార్గణవాంఛా

ప్రాతము లొసంగు తెగువయు
భూతదయయు నాకు నెపుడుఁ బోరిఁబోరిఁ గలుగన్॥

చ॥ అనృతమునందు నన్యధనముందుఁ బరాంగనలందు జీవహిం
సనపణపానవాక్పరుషచౌర్యముఖక్రియలం దధర్మ సా
ధనములయందు నామనము తాఁకి చరింపక సత్యధర్మవ
ర్తనముల నిల్చునట్టులుగఁ దల్లి వరంబులొసంగఁగావలెన్॥

వ॥ అనిన విని యంగదుం గాంచి జానకీదేవి యిట్లనియె. బిడ్డా! సర్వజగన్నియామకుండగు మీతండ్రి శ్రీరాముండు సన్నిధానంబున నుండ నన్నడుగనేల యనిన నంగదుం డిట్లనియెఁ దల్లీ బిడ్డలకుఁ దల్లికడనుండు స్వాతంత్ర్యంబు తండ్రియొద్ద నుండ దదియునుంగాక పురుషకారంబులేని శరణాగతి ఫలింపదని పెద్దలు వక్కాణింతురైన నమ్మహానుభావుండు కొన్నివరంబు లొసంగె నింక నడుగుట మర్యాదకు లక్షణంబు కా దని మానితి. నీ వాదిలక్ష్మి వగుటం జేసి మాకు జన్మజన్మంబులందును నిరుపాధిక జనయిత్రివి. మాకే కా దఖిలభూతంబులకుం దల్లివి. కావున దివ్యచిత్తానుసారంబుగా నెట్లొనర్చినను మహాప్రసాదంబయనిన సీతాదేవి రామునిపాదంబులం బడి ప్రాణనాథా వీర లడిగినవరంబు లీయంజాల దేవరవారి సమక్షంబున స్వాతంత్ర్యంబు వహించి యిచ్చుటయు నర్హంబు గాదనుటయు నక్కౌసలేయుండు చిఱునవ్వొలయఁ బ్రాణనాయకీ నీకును నాకును రూపభేదంబె కాని స్వరూపభేదంబు లేదు. వీరందఱు ప్రాణంబు లర్పించి విరోధులం

గల్చి నీకు సంతోషంబుఁ గావించిరి. వీరి మనోరథంబులు నీచేతఁ దీర్పింపంగోరి తీసుకొని వచ్చితి. నాయాజ్ఞాను సారంబుగాఁ జేయు పనియందు భవత్పారతంత్ర్యంబునకు హానిలేదు. కావున నిరాఘాటంబుగా వరంబు లిమ్ము. నేనీయలేక కాదీయధికారంబు నీకు దక్కించి వేడుకజూడ గోరెదననిన వల్లెయని భూపుత్రి భర్త సన్నిధానంబునం గూర్చుండి అంగదుఁ డడిగిన వరంబులన్నియు నొసంగి యిట్లనియె. 261

సీ॥ కార్యసాఫల్యంబుఁ గనక వానరులతోఁ
ప్రాయోపవేశంబుఁ జేయునాడు
రాయబారమునాడు రావణు నిరసించి
గోపురం బురుశక్తిఁ గూల్చునాడు
కాల సన్నిభుఁడైన ఘటకర్ణు నఱచేతి
దెబ్బచే మూర్ఛఁ జెందించునాడు
పాతాళహోమ విఘాతార్థమగుచు మం
దోదరిఁ బట్టీడ్చి మోదునాడు
పడిన కష్టములకు ఫలముగా యువరాజ్య
పదవియందు మంత్రి భటపురోధ
సాళిబలసి కొలువ నాయురారోగ్య సం
పదలు గలిగి మనుము భవ్యశీల॥ 262

వ॥ అని వచించుసమయంబున సేనాధిపతియగు నీలుండు సాష్టాంగ నమస్కారంబుఁ గావించి చేతులు జోడించి యిట్లనియె॥ 263

ఉ॥ లేవగ లింద్రజిత్తు కసిలేఁగి వధించిన గుంభకర్ణుఁ డి
చ్ఛావిధిఁ బట్టి మ్రింగినను సర్వనిశాటులు రూపుమాపినన్
రావణుఁడ స్త్రశస్త్ర నికరంబుల ముంచి కలంచిపుచ్చినం
జావఁడు వానరుం డొకఁడు సత్యము మీకృపచేతఁ దల్లిరో॥

సీ॥ రిత్తచేతులవారు లేఁగి కారింపంగ
విచ్చుకత్తులదండు విరిగిపాఱెఁ
గొమ్మ మెకములు డీకొని పోరుసల్పంగ
గొడ్డంద్ర వారు గగ్గోలుపడిరి
కాయలుదినువారు కడు మొక్కలము సూప
మనుజులందినువారు తునిగి కూలి
రడవి ద్రిమ్మరులు వెన్నంటి మోదఁగఁ గంధి
మధ్యవాసులు మచ్చుమాసిపడిరి
దంతనఖరాయుధులు వెంటఁ దవిలి తఱుమఁ
బాఱిడాఁగిరి శస్త్రాస్త్రపాణులెల్ల
నంబ మీదంపతుల మహిమాతిశయము
వలన నీచిత్రమేమని పలుకవచ్చు॥ 265

ఉ॥ రక్కసులేయుమార్గణ పరంపరలం బరవీథిలేచి మా
ప్రక్కకువచ్చి దేహములపైఁ బడువేళల నింకఁ బ్రాణముల్
దక్కవటంచు నేడువఁగఁ దక్షణమే యవి విర్గి తుంటలై
యెక్కడికేగునో తెలియ దెప్పటియట్టులనుందు మే మొగిన్॥

ఉ॥ మేమొక రాక్షసుందునుమ మేకొని శైలమొ గండశైలమో
భూమిరుహంబొ తత్సమర భూతలమందున వీచివైవఁగా

వేమరు తద్విఘాతమున వేలును లక్షలు కోట్లు రాక్షస
గ్రామణులేగి రొక్క మొగిఁ గాలునివీటికిఁ కేమిచెప్పుదున్ ॥

చ॥ తడయక ఘోరదానవకదంబము లేయు శరంబులెల్ల మా
మొదళులందాఁ కెఁబూలగతినొప్పగుచామరలోయనంగమా
పిడికిటిపోటులన్ విసరివేసెడు ద్రుమాఁకులు కొమ్మలాకులుం
బిడుగులభంగి రాక్షసుల పీచమడంచెను తల్లి చిత్రమై॥ 268

తే॥ అనిననుండాఁకు దనుజసేనాధిపతులు
సేనలంగూడి యమపురిఁ జేరి రేను
సిగలలోఁబూలు వాడని సేనతోడఁ
గూడి మీపాదములు గొల్చినాడఁ దల్లి॥ 269

క॥ నాసేనాసముదాయము
గ్రాసము వస్త్రములు ధనము గల్గి సపత్నో
ల్లాస మడంచుచు వృద్ధిన్
భాసిల్లఁగ వరము లిమ్ము పంకజసద్మా॥ 270

వ॥ అనుటయు నన్నీలునితో జగజ్జనని యిట్లనియె॥ 271

శా॥ రక్షస్సైన్యపతిం బ్రహస్తుని సముద్రంగంబునందాఁకి వా
లక్షేపంబునఁ దత్ప్రవత్కములు నేలంగూల్చి వానిన్ సహా
స్రాక్షాదుల్ వెఱగొందఁజంపిన భవత్సామర్థ్య మానాఁడె క
ర్ణక్షేమంబుగ వింటిఁబో సరమ విన్నాణంబుతోఁ దెల్పగన్॥

మ॥ ఘనవేగంబునఁ బోరురావణుని వీఁకందాఁకి వారించి యా
సున దోర్లాఘవ మొప్ప వానినమితక్షోభంబుఁ బ్రాపింపఁ జే
సిన నీశౌర్యపరాక్రమంబులను మచ్చిత్తేశుఁడా రామచం
ద్రుని చే వింటిని మెచ్చుకొంటి నెద నెంతో చిత్రమయ్యెం జుమీ

సీ॥ క్షితిమీఁద నెన్నాళ్లు బ్రతుకఁగోరెదవన్ని
దినములాయుస్సు నీకొనరుఁగాత
మనిననన్ని యేఁడులా మయము లేకుండనీ
కాలంబుసుఖలీలఁ గడచుఁగాత
సైన్యంబునీమాట జవదాఁటక భివృద్ధిఁ
గాంచిసంతతము వర్తించుఁగాత
తఱుగు లేనిధనంబు దారసుతాదులు
తామరతంపరై తనరుఁగాత
వైరివర్గమెల్ల వశమైనిరంతరా
సక్తితోడ సేవసల్పుగాత
కామమోహాముఖ వికారముల్లేనట్టి
రామభక్తి నీకుఁ బ్రబలుగాత॥ 274

వ॥ అని యాశీర్వదింపుచుండ నమస్కారంబులొనరించి సీతా
మహాదేవితో నలుండిట్లనియె॥ 275

తే॥ ఎందఱో రాజు లీభూమి నేలినారు
కానివారాశి సేతువుఁ గట్టినట్టి
ఘనుఁడొకండైన లేడు రాఘవుఁడుదక్క
నదియునీ పేర నైనకార్యంబుతల్లి॥ 276

ఉ॥ ఘోరశిలీముఖంబులనకుంఠితశౌర్యముతోడ నీవిభుం
డీరస మొప్పనేయునపు డేమనిచెప్పుదు దత్ప్రభావ మా
నీరధిలోనిజంతువుల నేకముసచ్చె జలంబుగ్రాగె నా
శూరునిభూరిరౌద్రమునుఁ జూడఁగలేరయి రెల్లభూతముల్॥

తే॥ అమ్మనామాట నిజమనుకొమ్మబద్ధ
మంచునెంచుము రాఘవుండాదినమునఁ
దాల్చురౌద్రముచేత భూతచ్ఛటులు న
శించెననుకొంటి నేమనిచెప్పవచ్చు॥ 278

చ॥ శరణు రఘుప్రభూ యనుచు సంభ్రమము వాఁకలతోడ నీమనో
హరుని పదాంబుజంబులకు నాదట మ్రొక్కిన నాటి వైభవం
బరుదుగదమ్మ నీవు కనవైతివిగాని వనాటులైన మా
తరమె వచింపవేలుపులు తత్తఱపాటునఁ జూచిరెంతయున్॥

ఉ॥ లాలసతోడ వానరబలంబులు వైచిన రాలునీటిపైఁ
దేలుట లంకదాఁకబలు తిన్నగ సూత్రము వట్టియుంచుటల్
నాలుగునాళ్లపై నొక దినంబున కద్భుత సేతుబంధనం
బొలినొనర్చుటల్ తలఁపనొప్పెడు మీమహిమంబుచేఁగదా॥

ఉ॥ శిల్పముచేతగాదె విరచించితి వారిధిమీద సేతువా
శిల్పము సర్వకాలము నశింపక వృద్ధివహించు నట్టులా
శిల్పము సేయువారలకు జీవనకారణ విత్తమెప్పుడుం
బొల్పుగఁ జిక్కునట్లు పరిపూర్ణదయన్ వరమిమ్ముఁదల్లిరో॥

ఆ॥ కాంస్యకార లోహకార కాంచనకార
దారుకర్మ శిల్పకారవృత్తు
లెల్లకాలమును మహీస్థలి జీవన
దాయకంబులగుచుఁ దనరవలయు॥ 282

వ॥ అని విన్నవించిన నవ్వారంబు లోసంగితి ననుటయుఁ జేతులు
జోడించి జాంబవంతుం డిట్లనియె. 283

తే॥ ధనములకు ధాన్యములకు రత్నముల కంబ
రముల కైశ్వర్యములకును రాజ్యములకు
హేతువగు లక్ష్మి వీవిట నేతఁగూడి
మాకుఁ బ్రత్యక్షమగుట సేమంబులొదవె॥ 284

క॥ సేనలతో మిము వెదకుట
కై నేముఁ బ్రయాణమైన కాలమునందే
యేనాడు లేని యుత్సా
హానందములబ్బెమాకు నఖిలసవిత్రీ॥ 285

చ॥ బహుళపిపాసఁ జెంది మనవానరసేనలతో స్వయంప్రభా
గుహఁ జొరఁబడ్డనాడు పలుకోసులదూరము పోయిడస్సి వే
తహతహఁ జెంది ప్రాణములుదక్కవు మాకని యేడ్చుచుండ న
గ్గుహఁ గలకోమలాంగి మముఁ గూరిమిఁ బ్రోచుట మీకృపం
గదా॥ 286

చ॥ ఇనజుఁడొసంగినట్టి గడు వేగెను కార్యముకాకపోయె నా
తని మొగమెట్లు కాంతుమని, తల్లడమందిమరించ నెంచు కా
ననచరపాళి నొక్క ఖగనాథు వచస్సులచే మనంగఁ జే
సినమహిమంబు మీదె గద చెప్పగశక్యమె మమ్ముబోంట్లకున్॥

ఆ॥ దారసుతులయందు ధనభోగములయందు
బంధుజనులయందు బ్రతుకునందు
మెలఁగు నామనంబు మీపాదపద్మంబు
లందు నిల్వనొసఁగు మంబవరము॥ 288

క॥ అనియడిగిన విధినందనుఁ
గనియట్టులె వరమొసంగఁగా జనకజప

ద్వనజముల కెలఁగి సరమా
మనోహరుం డిట్టులనియె మంజులఫణితిన్॥ 289

క॥ త్రేతాయుగాంతమునల
క్ష్మీతామరసాక్షు లోకవిశిష్టకులమునన్
సీతారాములగుదురని
మాతండ్రి వచించవింటి మాతాముసన్నే॥ 290

తే॥ అంతెకాక త్రికాలజ్ఞులైనమునులు
పలికినట్టులె మీప్రభావంబు నేడు
కన్నులారంగఁ జూచినకతన నిశ్చ
యించితిని సత్య మని మాట లేల పెక్కు॥ 291

తే॥ సవనము లొనర్చి తపములు సల్పి జపము
లన్నదానంబు లొనరించియైనఁగాన
రాని మీరూపములు సుకరముగ నిచట
గాంచి ధన్యులమైతి మోకమలనిలయ॥ 292

క॥ నిరవధిక భోగయుతమగు
పరమపదము విడిచి భక్తపాలనకై యి
ద్దరఁ గష్టము లొందెడు మీ
స్థిరసౌలభ్యంబు వినుతిసేయఁగ వశమే॥ 293

తే॥ తల్లి నిత్యము పరమపదంబునందె
నిలిచియుండిన మీయునికి తెలియ కెల్ల
వారు నాస్తికులై ముక్తిఁ గోరకుండఁ
జెడుదురని పుట్టెదరు మీరు పుడమియందు॥ 294

క॥ మీరిట్లు ధరణిపై నవ
తారంబులు దాల్చినను వితతసాత్త్వికులే
కోరి భజింతురు తక్కిన
వారలు దూషించి శమనవశు లగుదు రొగిన్॥ 295

తే॥ గాయకునితలయూఁపు రోగముగ నెంచు
హీనుగతి నంగనావేష మూనువానిఁ
దరుణిగా నెన్నుజడునిచందమున మిమ్ము
మనుజులుగ నెంతు రమ్మతామసజనములు॥ 296

ఆ॥ గ్రుడ్డి చూడకున్న గూబ సహింపలే
కున్నఁ గొఱఁత గలుగ దుష్ణరశ్మి
కట్లు రాజసులు దురాత్ములు సేవింప
కున్న మీకు తక్కువొకటి లేదు॥ 297

ఆ॥ రామసహితవగుచు రాజిల్లునీపాద
భక్తిధర్మమందురక్తిదేహ
ముక్తిఁగాంచువేళ మోక్షంబు నాకీయ
వలయునన్న నవ్వి వాసుదేవు॥ 298

ఆ॥ ఈవరంబులెల్ల నిచ్చితి రామాజ్ఞ
చే నిరంతరంబు సిరులు కరులు
హారులుగల్గి భోగవగుమంచు దీవించి
పల్కె వేడ్కఁ బుడమిపట్టి మరల॥ 299

సీ॥ కనుసైగచే నెల్లకార్యంబు లొనరించి
సేవించువేల దాసీలుఁగలిగి

మెన్నేండ్లు భోగించి యొందఁటికిచ్చినఁ
దఱుగని ధాన్యంబు ధనముగలిగి
ముప్పూటఁ బితుకుచున్నప్పటి కెనలేని
క్షీరముల్ కురియు నైచికులు గలిగి
భవ్యసంతాన మపరిమితోత్సవములు
నామయరహిత దేహంబుగలిగి
యార్జవంబు జ్ఞానమనుకూలదాంపత్య
మెపుడు గలిగి కష్టమింత లేక
సతముమనఁగ వరమొసంగితి ననుచు
మా సరమతో వచియింపు సత్యశీల॥ 300

వ॥ నీవీపర్యాయ మయోధ్యకు వచ్చునప్పుడు చేటీజనసహస్ర పరివృతయగు సరమాదేవిం దీసుకొని రమ్మని నియోగించిన మహాప్రసాదంబని విభీషణుండొక ప్రక్కకు నొదుగుటయు వానరాంగనలు సీతామహాదేవి దివ్యపాదారవిందంబులకు సాష్టాంగనమస్కారంబు లాచరించి లేచి యిట్లనిరి.

ఉ॥ అంబ జొహారు వాశ్రితజనామర భూరుహమా జొహారు పీ
తాంబర ధారిణీవినతు లధ్వర భుజ్నికరస్తుతా ప్రణా
మంబులు కౌసలేయుధనమా యభివాదనముల్ ప్రఫుల్లనూ
త్నాంబుజనేత్ర వందనములాది రమారమణీనమస్కృతుల్॥

సీ॥ జ్ఞానప్రయోజనాయోనిజాతవు నీవు
ప్రాకృతయోని సంభవులమేము
రహిఁద్రిలోకములేలు రామునిమహిషివీ
వడవి ద్రిమ్మరుల జాయలముమేము

కడకంటిచే సిరుల్ కలిగించురమవీవు
రువ్వయు లేని నారులము మేము
సారశాల్యోదన సాహిత్యమతివీవు
వగరుకాయలు మెక్కు వార మేము
గొప్పయందున నిన్నునుఁ గొంచెమందు
మమ్ముఁబోలినవారు లేరమ్మ జగతి
నట్టులైనను మమ్మిట్టు లాదరించు
నీదుసౌలభ్యమరసి వర్ణింపఁదరమె॥ 303

సీ॥ బంగారు చీరలనంగ నెట్టివొ యెఱుఁ
గముగాని నేడిటఁగట్టినాము
రాజమార్గములందు రాజితాందోళిక
లెలమితో నెక్కి యూరేగినాము
సౌధనిష్కుటచంద్ర శాలాస్థలములందు
నంచితప్రీతిఁ గ్రీడించినాము
శాల్యోదనాపూప శాకసూపాజ్య పా
యసముఖవస్తువుల్ మెసగినాము
చందనంబు పునుగు జవ్వాజి మొదలౌ సు
గంధవస్తువులును కనకరత్న
భూషణములు పూలు పొలుపొందదాల్చి నా
మమ్మ నీదయారసమ్మువలన॥ 304

ఆ॥ మఱియు మూర్మిళందు మాండవిపై శ్రుత
కీర్తియందుఁ గల ప్రకృష్ట కరుణ

మందమతులమైన మాయందుఁ జూపితి
వంబ నిన్నుఁ బొగడ నలవియగునె॥ 305

ఆ॥ పరమ పదమునందు హరియు రస్తలమందు
క్షీరవార్ధియందుఁ జెలఁగు తావ
కాంఘ్రియుగ్మమిచట నంబా కనుంగొనఁ
గల్గె మాకు నీదు కరుణఁ జేసి॥ 306

ఆ॥ వేద నికరమందు వేదాంతములయందు
వశుల మనములందు వరనిలింప
శీర్షకంబులందుఁ జెలఁగు నీపాదముల్
కంటిమమ్మ నీదు కరుణఁ జేసి॥ 307

సీ॥ కొమ్మలు చిగురులాకులు పూలుకాయలు
పండ్లు తేనెలు పాదపములయందుఁ
దమ్ములుతొగల గాఢసుగంధ పానీయ
ములు రాజహంసము ల్కొలకులందు
హరులు మహాంగము ల్కరులు ధాన్యములెల్ల
సిరులు పూసరులు మందిరములందుఁ
బాడియుఁ బంట ప్రబల ధర్మ సత్య శౌ
చంబు లెల్లపుడు రాష్ట్రంబునందుఁ
బసుపు కుంకుమంబు పతిభక్తి సౌభాగ్య
గరిమ సోయగంబు కాంతలందు
నిలుచునట్లు వరము నేడు మాకొసఁగుము
వినుతసూరి జనకవిభుకుమారి॥ 308

వ॥ అని వచియించి యవ్వారంబులంది సీతారాములకు నమస్క
రించి వానరులు గమనోన్ముఖులగుటయు నయ్యవసరంబున
విదేహరాజ్యమునుండి యొక వేగులవాఁడరుదెంచి యొక్క
లేఖ శ్రీరామచంద్రున కిచ్చి యిట్లనియె. 309

చ॥ కొలఁది దినాళిక్రింద జనకుండు భవత్పురినుండి వీటికిమ్మల
నరుదెంచి మీమహిమ। ముల్ వినిపింపఁ దదీయపత్ని
నిర్మలమతి నాలకించియల। మారుతిఁ జూడఁదలంచి యమ్మ
హా। బలునిటు తోడితెమ్మనుచుఁ బంపగ వచ్చినవాఁడ
రాఘవా॥ 310

చ॥ అనవిని రాఘవుండు బహుళాదరమొప్పఁగఁజూచి యంజనా
తనయునితోడ నిట్లనియెఁ దండ్రి ధరాసుతకీవు మేలొన
ర్చినవిధ మవ్విదేహపతి చెప్పగనచ్చెరువంది జానకీ
జనని నినుంగనందలఁచి చారునిఁబంచెను మారుతాత్మజా॥

తే॥ జనకమహిషిధరా సుతజననిమాకు
శ్వశ్రువైనసుశీల నీసత్యశీల
శౌర్యములనాలకించి దర్శనముప్రీతిఁ
జేయఁగోరెను మిథిలకుఁబోయిరమ్ము॥ 312

క॥ నాభక్తులైన వారల
వైభవము నెఱింగికొలుచు వారలకెల్లన్
శోభిల్లును సౌఖ్యములు మ
హాభయములుపాతకంబు లాఱును హనుమా॥ 313

ఆ॥ నన్నుగొలుచువారి కన్నమదీయాంత
రంగభక్తులను నిరంతరంబు

నాదరించువారి నత్యంతప్రీతితోఁ
బ్రోచుచుందు నెల్లప్రొద్దు హనుమ॥ 314

ఆ॥ తల్లిదండ్రులందు దారపుత్రులయందు
ధనములందు గేహతనువులందు
వారిజాక్షులందు వాంఛవీడుదురు మ
దీయభక్తవరులు ధీరవర్య॥ 315

ఆ॥ దేహమోహముటకును దేహాంతమునఁగల్గు
నాత్మరక్షణమున కతఁడెకర్త
చుమ్మటంచు నన్నునమ్మి భజించువా
రంతరంగభక్తు లగుదురెపుడు॥ 316

ఆ॥ ఇపుడునాదుమహిమలెల్లఁ గాంచినుతించు
వారికంటెముందు వచ్చుయుగము
లందువినిభజించునట్టి భక్తులు మహా
ప్రేమపాత్రు లగుదురో మహాత్మ॥ 317

ఆ॥ నన్ను నమ్మి కొల్చుచున్నభక్తులకు నా
కన్న గొప్పదొకటి కానరాదు
వారికన్న మంచివస్తువొక్కటి నాకు
నైనఁ గానరాదు వానరేంద్ర॥ 318

ఆ॥ ఉఱుము లుఱుముచున్న మెఱపులు పిడుగులు
కలుగుచున్నఁ జాతకములు మేఘ
జలముఁ గోరురీతి సాధువుల్ నను గోరు
చుంద్రు కష్టములకు నోర్చి హనుమ॥ 319

ఆ॥ భూమిపుత్రియందు సౌమిత్రులందు భ
రతునియందు సర్వరాజ్యమందు
నిజశరీరమందు నెగడనికూర్మి నా
భక్తులందుఁ గలుగుఁ బవనతనయ॥ 320

ఆ॥ కంట నలుసు వడ్డఁ గాలిలో ముల్లు గ్రుచ్చు
కొనినబాధఁ జెందుమనుజునట్టు
లాశ్రితులకుఁ గొంచె మాపద కలిగిన
నేను తాళఁజాల వానగేంద్ర॥ 321

ఆ॥ లౌకికంబుఁ బాసి నాకై శరీరాత్మ
లర్పణంబు సేయునాశ్రితులకు
నేను నావిభూతితో నిరంతరము న
ధీనమగుచు నుందు ధీరవర్య॥ 322

వ॥ ఇంతవరకు వచించి శ్రీరామచంద్రుండు ముగించెనంత. 323

మ॥ ఖరనామాసుర భీమధామశరసంఘాత ప్రదేష్వాసనం
కరహస్తా గురుశస్త్ర మందిర సురౌఘ స్తుత్యపాదాబ్జ భా
స్కరతేజా గిరిరాజ ధీరవర విశ్వామిత్రమానీశ్వరా
ధ్వరదీక్షా భరణక్షమాపవన పుత్రస్వాంత పద్మారుణా॥ 324

క॥ కమలము గమలశరీరా
విమలానంద ప్రచార విశ్వాధారా
శమదమ గుణవిస్తారా
శమిత ప్రాకృత వికారచయ రఘురామా॥ 325

మాలిని

విమత జనవిదారా వేదవేదాంతసారా
సమర విజయపూర్తీ సత్యవాక్యానువర్తీ
సుమశర సమరూపా సూర్యతుల్యప్రతాపా
కుముద హితసుకీర్తీ కోమలశ్యామమూర్తీ॥ 326

గద్య

ఇది శ్రీసీతావల్లభప్రసాదసమాసాదితకవితాప్రవీణ వేదాల
సీతారామాచార్యకృపాలబ్ధమంత్రరత్నానుసంధానపవిత్రాం
తరంగ నిఖిలదుర్మత శిలోచ్చయ దంభోళీభూత సము
ద్రాల లక్ష్మణాచార్యానుగ్రహ బోధిత విశిష్టా
ద్వైతరహస్యార్థధురంధరశఠగోపయతిరాడ్వర
వరయోగిప్రభృతి పూర్వాచార్యచరణ
సరోజ భ్రమరాయమాన మొవ్వవంశ
తిలకకృష్ణార్యకృష్ణమాంబాతనూజ
శ్రీవైష్ణవవిధేయ వేంకటదాస
నామధేయప్రణీతంబైనసీతా
రామప్రభావమను మహా
ప్రబంధంబునందుఁ బ్రథ
మాశ్వాసముసర్వము
సంపూర్ణము

శ్రీమతే రామానుజాయ నమః

# సీతారామ ప్రభావము

## ద్వితీయాశ్వాసము

క॥ శ్రీరఘుకులాబ్ధిరాకా
తారాధిపమేరుధీర దశరథతనయా
సూరిజన వినుతపాదాం
భోరుహయుగ సకలదాస పోషక రామా॥ 1

అవధరింపుము. 2

వ॥ అటుపిమ్మట సీతామహాదేవి యంజనా నందనునితో
నిట్లనియె॥ 3

తే॥ పరఁగుసుతులందు జ్ఞానసంబంధులనియుఁ
గర్మసంబంధులనియును గలరు రెండు
తెగలవారందులోనశోధించినంత
జ్ఞానసంబంధులే శ్రేష్ఠులౌనుగాదె॥ 4

తే॥ పావనీమాకు జ్ఞానసంబంధసుతుఁడ
వగుటఁజేసి మదంబ నిన్నాదరింపఁ
దలఁచి విభునాజ్ఞ చేనేడు పిలువఁబనిచె
వేయునుడులేల మిథిలకుఁ బోయిరమ్ము॥ 5

తే॥ అంతెకాదయ్య మా వివాహంబునాడు
రామచంద్రుని సౌందర్యరాశిలోని

మగ్నులై తృప్తిఁ జెందకుద్విగ్నులై కృ
శించు చానలఁ దేర్ప యోజింపవలయు॥ 6

ఆ॥ కోరిమిథిలయందు నూరేఁగుతఱి రాము
సోయగంబుఁ గన్న సుదతులెల్లఁ
దనివితీరకార్తిఁ గనిరంచు వింటిన
చ్చానగములఁదేర్పుమూని హనుమ॥ 7

ఉ॥ మా తలిచెంతకీవు హనుమా చనుదెంచితివేని పొంగి య
ఘ్పాతచరిత్ర వీటఁగల పుణ్యవధూతతిఁ బిల్వనంప నా
నాతులువత్తురంత మననాయకుఁడౌ రఘురాముతత్వముం
బ్రీతివచింపుమయ్య భవభీతులువాసి తరింతు రందఱున్॥ 8

ఉ॥ రామపరత్వమిట్టిదని రమ్యవచస్సుల బోధచేయఁగా
నీమహినీ సమానుఁడొకఁ డేనియు లేడటుగానఁబూన్కితో
నామిథిలాపురంబునకు నాదటఁబొమ్ము తదీయపౌరులం
తోముద మొప్పనిన్నుఁగని తోడనె పాయుదురెల్ల పాపముల్॥

వ॥ ఇవ్విధంబున సీతారాములు శ్లాఘింపుచుండ నాంజనేయుం
డుప్పొంగుచుండె నయ్యవసరంబున వలీముఖులు డోలాయ
మానమానసులై యిట్లనిరి. 10

ఉ॥ రామవియోగమబ్బినను రామపదాంబుజతత్వవేత్త మా
సామిమరుత్సుతుం డెపుడు సన్నిధినుండునటంచు నెంచఁగా
నీమహనీయుఁడున్ మిథిల కేగెడుమా కెవరాప్తులింక రా
మామహిజాధిపాయనుచు మాటికిదుఃఖముఁ జెందుచుండగన్॥

వ॥ శ్రీరామచంద్రుం డవ్వానరపుంగవుల కిట్లనియె॥ 12

ఉ॥ నాయనలార మీరిటుఘనంబగుశోకముఁజెందనేల నే
మీయెడనుండునెల్లపుడు మీరునురాదగుఁగోరినప్పు డీ
వ్వాయుసుతుండుశీఘ్రముగ వచ్చుఁబనుల్ నెరవేర్చికూర్మి వి
చ్చేయుఁడసంగనాప్లవఁగ శేఖరులిట్లనిరాంజనేయుతోన్ ॥ 13

ఉ॥ పోయినచోట నేనిలువఁ బోకుముసంసృతివార్ధిమగ్నులై
పాయనిమానవాళులకుఁ బావనరామచరిత్రమర్మముల్
నాయముగావచించివిపినంబులలో దిగులొందుమమ్ములం
దాయఁగరమ్మనన్ వినియదార్ధవచస్సులవాయుజుండనున్ ॥

ఉ॥ ఈరెటుమద్వియోగముసహింపఁగనేడ్తురో మీవియోగమా
తీరున నేను నోర్వను నుతింపగ నేమిటికయ్యలార సీ
తారమణుఁడు చెప్పినవిధంబున నేగి విదేహరాజ్యముం
జేరి తదీయులం దనియఁజేసెద రామపరత్వబోధచేన్ ॥ 15

తే॥ తడయకటుమీఁద మీసన్నిధానమునకు
వత్తునని చెప్పి యల జాంబవద్దినేశ
సూనులకు మ్రొక్కి తక్కినవానరులను
సరవి నాలింగనాదుల సత్కరింప॥ 16

తే॥ అవ్వనాటులు కొంతసే పారటంబుఁ
గాంచి యేమియుఁ దోఁచ కక్కొసలేయు
పాదములమీఁదఁ బలుమాఱు పడుచు మరలఁ
బైకి లేచుచు నిట్లని పలికి రార్తి॥ 17

సీ॥ పట్టనిమ్మింకొక్కపరి మాకరములచేఁ
జెలఁగు నీపాదరాజీవములను

బడిఁ జూడని మొక్కఁ తడవ మాకనులచే
భవదీయ సౌందర్య వైభవంబు
చవిఁ గాంచని మొక్కఁ సారి మాచెవులచేఁ
దావకాలాపసుధారసంబు
నిలువంగ ని మొక్కఁ నిమిషంబు మము నేరి
కందంగరాని త్వదాశ్రయమున
జూడు మొక తేప చల్లని చూపులొలయఁ
బలుకు మొక మాట తేనియలొలుకునట్లు
తాకు మొకసారి పాణి పద్మములుసాచి
సవితృసంకాశ శ్రీభూమిజా హృదీశ॥ 18

సీ॥ దశరథాత్మజుని పాదములందకున్నచోఁ
బట్టనేమున్నదే పాణులార
కౌసలేయుని సోయగము తోఁపకున్నచోఁ
గాంచనేమున్నదే కన్నులార
లక్ష్మణపూర్వజాలాపముల్ వినరాని
చోనెట్లు నిలుతురే వీనులార
రామాంగ గంధసారప్రాప్తి లేనిచోఁ
గొఱవోవరే ముక్కుఁగ్రోళ్ళలార
రామసాన్నిధ్యమింక దూరమగుచుండ
నలుగుదురుగద పంచప్రాణంబులార
జానకీనాథు మృదుపదస్పర్శ లేక
సాగిజీవింతురే శిరోజంబులార॥ 19

సీ॥ కనులార బహువిధాకారము ల్కనిపించుఁ
గాని శ్రీరామునాకారమగునె
చెవులార యెన్నియో చెడునుడుల్ ప్రాప్తించు
గాని సీతేశువాక్యంబులగునె
చేతులారా యెన్నొ పనులబ్బుఁగాని రా
మస్వామిసేవతో మాద్రియగునె
ఘ్రాణమా యెన్నెన్నొ గంధముల్ద్వారకును
గాని రామాంగ సుగంధమగునె
చిత్తమా వేలుపులును రాజోత్తములును
గలరు కోటులుకాని రాఘవునిఁబోలు
శక్తిపరులు దయాపరుల్ జగతిఁ గలరె
యిట్టి మహనీయు విడనాడు టెట్లు మనకు॥ 20

వ॥ అని వచించి శ్రీసీతారాముల దివ్యపాదారవిందములకు సమస్కరించి భరత లక్ష్మణ శత్రుఘ్నులకు వరుసగా జోహారులొనర్చి తదీయ దివ్యశాసనంబు శిరసావహించి హాహాకారంబు లొనర్చుచుఁ దిరిగితిరిగి చూచుచుం బ్లవంగ సమూహంబులును, విభీషణాదులును తమతమ నివాసంబుల కరిగిరంత నారాత్రి రామభద్రుండు సీతాసహితుండై సుఖించియుఁ దెల్లవారు ఝామున లేచి భక్తపరాధీనుండు గావున దేశాంతరగతులైన భక్తులందలంచుకొని దుఃఖింపుచు భరతాది సోదరులను సుమంత్రాది మంత్రులను హనుమంతునిఁ బిలిపించి యిట్లనియె॥ 21

ఉ॥ వినుఁడు వయస్యులార కపివీరుల నల్ల విభీషణాదులం
బనిచితి నిన్నవారి నెడఁబాసిన దాదిగఁ గన్నులాకృతుల్
కనవాగి వీనులుర్జవినవు, గంధమెఱుంగదుముక్కు తాకుచు
న్న నెఱుఁగదీత్వగింద్రియము నాలుకెఱుంగదహా రసంబులన్

ఆ॥ తెలివిమాలి బ్రహ్మదేవుండు కూరిమి
గలజనాళినొక్క నెలవునందె
చేరియుండుగతి సృజింపనికతమున
నింతచేటు వచ్చె నేమిసేతు॥ 23

ఉ॥ అడ్డము సెప్పలేక బహుళార్తిఁ గృశింపుచు వీడలేనినా
బిడ్డలనందఱం బనిచి భీతిలుచున్నది మానసంబహా
గడ్డగుచింతలో మునిగి క్రమ్మఱదాకపులవ్విషభీణుం
డొడ్డుగనంగరాని దిగులొందరె కుందరె చెప్పశక్యమే॥24

ఆ॥ పిల్లచెంత లేనితల్లికి జన్నుల
పాలు సేపినట్లు మ్రోల వాన
రాళి లేనికతన నత్యంతచింతా
భరంబు కలచె నను నిరంతరముగ॥ 25

ఆ॥ జనకరాజుపట్టి శయ్యాగృహామునం ద
శేషసుఖము లిచ్చి సేవ లెన్ని
చేయుచున్నఁగాని డాయదు నామనం
బంటి వానరాళివెంటఁ జనుట॥ 26

వ॥ అని భక్తపరాధీనత్వంబున వగచుచున్న శ్రీరామచంద్రు
నితో లక్ష్మణుం డిట్లనియె. 27

తే॥ ఆశ్రితవియోగ మనెడు మహాతపమునఁ
దావకాశయ నవనీత మీవిధమున
గరఁగుచున్నది దాసనికరమునందుఁ
గలుగు కారుణ్య మెందైనఁ గలదె నీకు॥ 28

క॥ దీనుల మొఱవినుచో నీ
మానసమీ రాజ్యభార మైన గణింపం
గా నేరదు సీతను న
న్నైనను లెక్కింపఁదనఁగ నన్యంబేలా॥ 29

ఆ॥ కాని రాక్షసులును గానన చరులు సౌ
ఖ్యముగ వారివారియాలయములఁ
జేరినారుగనుక చింతింపవలదింక
నన్న నీకుఁ జెప్పనతఁడు కలఁడె॥ 30

ఆ॥ మదిదలంచినపుడు మనవానరుల విభీ
షణముఖాసురులఁ బ్రశ స్తరీతిఁ
బిలువనంపవచ్చుఁ బ్రేమింపఁగావచ్చు
నింతమాత్రమునకుఁ జింతయేల॥ 31

ఆ॥ అనివచించి రాఘవునిమనస్తాపంబుఁ
బాయఁజేయ నొక్కభంగినతఁడు
చింతఁబాఱఁదోలి సీతాసమేతుఁడై
యేలుచుండె రాజ్య మింపుమీఱ॥ 32

ఆ॥ అంతనొక్కనాడు హనుమంతుఁడవనిజా
రామచంద్రులకుఁ గరములుమోడ్చి

చిన్నిపూలొనర్చి సెలవుఁగైకొని విదే
హనగరమున కేగె నతిజవమున॥ 33

తే॥ హనుమ దాగమనము విని జనకభూమి
పాలుఁ డెదురేగి పూజించి భవ్యఫణితి
వినుతిఁ గావించి తోడ్కొని చని నిజాల
యమున నుచితాసనమునందు నమరనునిచి॥ 34

వ॥ వివిధోపచారంబు లందనివి నొందించి సరసాన్నంబు వడ్డిం
చిన భుజించి గండూషపూర్వకముగాఁ గాలుసేతులు కడిగి
సుఖాసీనుండైన మారుతి సమీపంబునకు చేటీసమేతయగు
తన భార్యను సుశీలంబిలిపించి కూర్చుండ నియోగించి
జనకభూవరుం డిట్లనియె॥ 35

ఆ॥ నాఁటఁగోలె నీకు నాచేత వివరింపఁ
బడిన సూరివరుఁడు పవనసుతుఁడు
రామభక్తుఁ డధికధీమంతుఁ డంజనా
నందనుండితండె నాతి కనుము॥ 36

సీ॥ గాత్రజంత్రముల ఝాంకారఁగించు సంగీత
విద్యకగారమీ విమలవర్ణి
పరిపంథుల వధించు బాహుశౌర్యమునకు
ననువౌనిధాన మీ యద్రిచరుఁడు
వేదవేదాంగాది వివిధశాస్త్రములకు
రత్నాకరంబీసురస్తుతుండు
శమదమ సత్యశౌచక్షమాదయలకుఁ
బుట్టినిల్లీ మహాపుణ్యరాశి

చిన్నిపూలొనర్చి సెలవుగై కొని విదే
హనగరమున కేగె నతిజవమున॥ 33

తే॥ హనుమ దాగమనము విని జనకభూమి
పాలుఁ డెదురేగి పూజించి భవ్యఫణితి
వినుతిఁ గావించి తోడ్కొని చని నిజాల
యమున నుచితాసనమునందు నమరనునిచి॥ 34

వ॥ వివిధోపచారంబు లందనివి నొందించి సరసాన్నంబు వడ్డిం
చిన భుజించి గండూషపూర్వకముగాఁ గాలుసేతులు కడిగి
సుఖాసీనుండైన మారుతి సమీపంబునకు చేటీసమేతయగు
తన భార్యను సుశీలంబిలిపించి కూర్చుండ నియోగించి
జనకభూవరుం డిట్లనియె॥ 35

ఆ॥ నాఁటఁగోలె నీకు నాచేత వివరింపఁ
బడిన సూరివరుఁడు పవనసుతుఁడు
రామభక్తుఁ డధికధీమంతుఁ డంజనా
నందనుండితండె నాతి కనుము॥ 36

సీ॥ గాత్రజంత్రముల రాల్కరఁగించు సంగీత
విద్యకగారమీ విమలవర్ణి
పరిపంథుల వధించు బాహుశౌర్యమునకు
ననువౌనిధాన మీ యద్రిచరుఁడు
వేదవేదాంగాది వివిధశాస్త్రములకు
రత్నాకరంబీసురస్తుతుండు
శమదమ సత్యశౌచక్షమాదయలకుఁ
బుట్టినిల్లీ మహాపుణ్యరాశి

జ్ఞానవైరాగ్యములకు నీ చతురుఁ డిక్క
దనుజులకు లయకాలుఁ డీ ధన్యశీలుఁ
డార్జవమునకు నిలయ మీ దుర్జనారి
రామభక్తికి నెలవీ పరాక్రమనిధి॥ 37

సీ॥ ఈగాన రహిమీఱ రాగమాలాపింప
గంధర్వతతి లజ్జగాంచవలయు
నీ సూరిశాస్త్రంబు లెలమి వక్కాణింప
నరవిందభవుఁ డరుదందవలయు
నీదిట్ట సంగ్రామమేదిని నిలిచిన
వైవస్వతుఁడు భీతి వడకవలయు
నీవర్ణి వైరాగ్యభావంబుఁజూపినఁ
బారికాంక్షులు తలల్వంచవలయుఁ
జెలఁగు నితనిభూరిసింహనాదము విన్న
ఘోరరాత్రిచరులు కూలవలయు
రామభక్తిచేత నీమేటి రేఁగినఁ
నేయఘంబులైనఁ బాయవలయు॥ 38

క॥ మనకూతు రైనజానకి
ఘనదుఃఖముఁ బాయఁజేసి ఖరరాక్షసులం
దునిమి యశము సంపాదిం
చిన పుణ్యాత్ముండితండు శీతాంశుముఖీ॥ 39

తే॥ సీతకే కాదు రామాదిభూతలాధి
పతుల కవ్వానరులకు నీపవనసుతుఁడు

చాలమే లొనరించె నాచంద మెట్టి
దండువా చెప్పెదను ప్రీతి నాలకింపు॥ 40

సీ॥ మహనీయరామసమాచార మెఱిఁగించి
మనజానకీదేవి మనిచినాడు
భూసుతోదంతంబుఁ బూర్ణంబుగాఁ దెల్పి
లలి రాముప్రాణముల్ నిలిపినాడు
సంజీవిశైలంబు సామర్థ్యమునఁ దెచ్చి
యిచ్చి లక్ష్మణుని రక్షించినాడు
రామాగమనవార్త రహిఁ దెల్పి భరతశ
త్రుఘ్నులదిగులు పోఁదోలినాడు
రాత్రివేళ సంగరమున మూర్ఛిల్లిన
కపుల కసువులొసఁగి కాచినాడు
నారి యీసమీరనందనుఁ డింతటి
ఘనుఁడు లేడు ముజ్జగంబులందు॥ 41

ఆ॥ వైరివర్గముల విదారించి పేరొందు
శూరవారమెల్ల మారుబారి
కోరెమయ్యెఁగాని నారీమణీ వానిఁ
జేరిలొంగడీ సమీరసుతుఁడు॥ 42

ఆ॥ ఆదివేదరూపుఁడగు భాస్కరునివల్ల
నంతమీఁద మునిచయంబు వలన
వేదశాస్త్రములును వేదాంతమర్మముల్
తెలిసినాడితండు తలిరుబోఁడి॥ 43

సీ॥ వివిధశాస్త్రంబులు వేదాంతమర్మముల్
తెలిసి వక్కాణింపఁగల బుధుండు
చౌర్యపానద్యూత జారత్వముఖదుష్ట
వర్తనంబులు లేక వరలుఘనుడు
పైశుచిత్వంబు లోపలిశుచిత్వము సదా
చారముల్కలిగిన సత్యవాది
భోగంబుపైన విరాగంబు నపవర్గ
పదమున రుచిగల భవ్యశీలుఁ

డఖిలలోకములకు నాధారుఁడై బ్రహ్మ
గన్న విష్ణునందఖండభక్తి
కలిగి దుర్మతములు ఖండించుధీరుండు
గురుఁడనంగఁజెల్లు కువలయాక్షి॥ 44

సీ॥ సాత్వికశాస్త్రముల్చక్కఁగా శోధించి
కాంచువేళల మూఁడుకనులుగలిగి
నారాయణుని సద్గుణము లెన్నునప్పుడ
నూనమై తనరు వేనోళ్లుగలిగి
యాశ్రితావళికి వేదాంతము తెలుపు ది
నంబునఁ జతురాననములు గలిగి
యపవర్గమార్గదాయకములౌగ్రంథముల్
వ్రాయుచో వేయికరములు గలిగి

నాస్తికమతానుసారుల శాస్తిజేయు
సమయమున శతకోటితీక్ష్ణంబు గలిగి

వెలయువాని గురుం డని విశ్వసించి
యాశ్రయింపంగవలయు ఫుల్లాంబుజాక్షి॥ 45

సీ॥ పెడవాదములు మాని పెద్దల సేవించి
వేదాంతవిషయముల్ విన్నవాఁడు
విసువకాశ్రితులకు విష్ణుపరిభావంబు
దంచిత పరిజ్ఞబోధించువాఁడు
తనదు బోధార్ణవంబున ముంచి సంసార
బంధంబు జనులకుఁ బాపువాఁడు
శ్రీహరిభక్తులై శిష్యులుజ్జీవించు
టే ప్రయోజనముగా నెంచువాఁడు

దారపుత్ర గేహధనబాంధవాదుల
పైఁగలట్టి కూర్మి పంకజాక్షు
మీఁద నిల్పువాఁడు మీనలోచన సదా
చార్యుఁ డగును లేదు సందియంబు॥ 46

సీ॥ తనముల్లె పోయినట్లనయంబు శిష్యుల
కింటింట దిరిగి బోధించువాఁడు
హరిభక్తిమాని సోమరులైన వారి దం
డించి సన్మార్గమందుంచువాఁడు
తాఁ జెప్పినట్టి సత్యమున నిల్చిన వారిఁ
గాంచి యుత్సాహంబుఁ బెంచువాఁడు
శాస్త్రవాక్యములచే సందియములను మా
యించి యానందాబ్ధి ముంచువాఁడు

చంటిపిల్ల నెలమి సాఁకెడు తల్లియ
ట్లఘము లొందకుండ నాశ్రితులనుఁ
గాచుచుండువాఁడు కాంతామణీ గురు
స్థానమందు నిలువఁ దగినవాఁడు॥ 47

సీ॥ దుర్మతంబులవారితోఁగూడి చెడుదారి
డాయుచోఁ గ్రూరదండనముసూపి
సంసారదుఃఖాగ్ని సంతప్తులైనచో
సత్కథాజలముచేఁ జల్లసేసి
తుచ్ఛసౌఖ్యములొందు తుష్టిచే దేహంబు
మఱచుచో వైరాగ్య మహిమఁదెలిపి
మందమనస్కులై మల్లడిఁ గొనువేళ
సరసవాక్యముల హాసంబుఁగూర్చి

యైకమత్యమొంద కన్యోన్యకలహంబు
సల్పువేళ భూరిశాంతి నొందఁ
జేసి సంతతంబు శిష్యులరక్షించు
వాఁడు దేశికుండు వారిజాక్షి॥ 48

సీ॥ పూర్ణానుకంపచే బోధించువిషయముల్
వినువారి తలఁపులఁ జొనుపునేర్పు
నడిగినప్రశ్నల కనుకూలముగ సమా
ధానంబుసెప్పు విద్యాబలంబు
సరసిజాక్షేతర సమవస్తువుల నను
రాగంబులేని వైరాగ్యపటిమ

ఘనతరాపదలు పైకొనికలంచినఁగాని
హరిభక్తి విడువని స్థిరమనస్సు
సత్యమార్జవ మింద్రియ జయము మార్ద
వ స్వభావము వరభాగవతజనాంఘ్రి
కమలసేవయుఁ గలిగినవిమలగుణుఁడు
దేశికోత్తముఁడని నీవు తెలియు మబల॥ 49

ఆ॥ చెలువముందునే వచించిన సద్గురు
చిహ్నములును సేవచింప నలవి
కాని లక్షణములు కలవి సమీర కు
మారునందు వేయిమాటలేల॥ 50

తే॥ నీవు నీవారలైనట్టి నీరజాక్షు
లందఱుఁ శ్రీరామదూత భవ్యాంఘ్రియుగము
కొలిచి పరతత్త్వమహిమంబు తెలిసికొంటి
రేని మోక్షంబుఁజెందెద రింతనిజము॥ 51

ఆ॥ అనివచింపుచున్న జనకునివాక్యముల్
విని తదీయపత్ని విమలభక్తి
పాణియుగముమోడ్చి ప్రాణేశమచ్చిత్త
మందుఁగలదు వేఱు సందియంబు॥ 52

ఆ॥ సద్గురూత్తముని విషయములు కొన్ని వ
చించినారు గాని చెడ్డగురుల
చేష్టలించుకైనఁ జెప్పరైతిరి వాని
వినఁదలంతు విన్నవింపు డనిన॥ 53

సీ॥ వెలయ డెబ్బదిరెండు వేల్వల లెక్కచే
వసియించె నిటమనవానరాళు
లలయుధా జిద్విదేహాది బాంధవరాజ
సైన్యంబులొప్పె లక్షలకొలంది
వివిధ దేశాధినాథవరండముల వెంటఁ
జనుదెంచుసేనకు సంఖ్యలేదు
స్వజనంబుఁ మఱి విభీషణుని చమూసమూ
హంబులు గణనలేకలరుచుండెఁ
గానియిందఱు రేయిపగలునుదిన్న
రామచంద్రుని ధనధాన్యరాసులించు
కైనఁదఱుగవిదేమి మాహాత్మ్యమో వ
చింపు మారుతనందనా! చిన్నిధాన॥ 8

సీ॥ శరణన్నమాత్రాన సాపరాధులనైన
స్వీయాంగమట్లు రక్షింపుచుండు
స్నేహించుమాత్రానఁ జెలఁగి నీచులనైనఁ
దనప్రాణములరీతి మనుచుచుండు
దరిజేరుమాత్రానఁ బురుదరిద్రులనైన
విత్తవంతులను గావించుచుండు
స్తుతియించు మాత్రానఁ దులువలనైన ని
ర్మలురఁ గావించి ప్రేమమునఁ బ్రోచుఁ
గౌసలేయుండహా త్రిలోకంబులందుఁ
గలఁడె యిటువంటి దాత మర్కటులమైన

ఆ॥ జనకభూవిభుండు జాయనువీక్షించి
పలికె నిట్టులనుచుఁ బంకజాక్షి
దొంగగురుల చెయ్వులుం గరంబెఱింగింతు
రాణ వినఁగదే పరాకులేక॥ 54

సీ॥ తెలివిమాలిన నీచ దేవతామంత్రంబు
లపవర్గదాయకం బనెడువారు
ప్రత్యక్షముగఁ గానఁ బడుచుండునట్టి ప్ర
పంచంబు మిథ్యని పలుకువారు
జగము నిక్కముకాని జగదీశ్వరుండను
వాఁడు లేడని కల్లలాడువారు
నరకంబు నాకంబు పరమపదంబు లే
దన్నియు నీలోకమనెడువారు
శ్రుతులు ధర్మశాస్త్ర తతులితీహాస పు
రాణ సంఘములు నిరర్థకమని
చెప్పువారలెల్లఁ జేడియరో దొంగ
గురువులంచుఁ దెలిసికొనుము నీవు॥ 55

సీ॥ పొలుపారఁగాఁ బాదపూజ చేసెడువేళ
వేయి నూటపదాఱు లీయవలయు
శ్రీపాదతీర్థంబు స్వీకరించెడువేళఁ
జెలఁగి భూదానంబు సేయవలయు
మంత్రోపదేశ సమయమునఁ బట్టువ
స్త్రములు సువర్ణంబొసంగవలయు

సాష్టాంగముగ నమస్కారంబొనర్చుచో
నెనలేని విత్తంబు నీయవలయు
జూడవచ్చినపుడు పాడియావులఁ బాడి
బట్టె లీయవలయు భక్తితోడ
మాకు మీరటంచు మాటికి శిష్యుల
తో వచించువారు దొంగగురులు॥ 56

సీ॥ ముకు గ్రోళ్లు నోరును మూసి చూచితివేని
ఘనబ్రహ్మనినదంబు వినఁగవచ్చుఁ
జెవులు కన్నులు వ్రేళ్లచేత మూసితివేని
యాతతంబై తోఁచు జోతిమాల
తెప్పవాల్పక కనుల్ విప్పిచూచితివేని
భ్రూమధ్యమునఁ దోఁచు భూరిసుమము
సూటిగా సోహమంచు వచించితేని నీ
లోననే బ్రహ్మంబు కానవచ్చు
వీనిచే మోక్షమబ్బును కాని నీకుఁ
దీర్థయాత్రలు జపములు దేవపూజ
నము లతిథిపూజనములు వ్యర్థములటంచుఁ
గపటగురువులు బోధింపఁగలరు తరుణి॥ 57

సీ॥ నీరుకాకులటంచు నిందించెదరు మహా
నదులఁ గ్రుంకెడు పుణ్యనరులఁగాంచి
ప్రజ్ఞారహితులంచుఁ బరిహాసింతురు భగ
వన్మూర్తు లర్చించు వారిఁగాంచి

పిచ్చివారని ప్రలాపింతురర్థుల కోలి
ధనములొసంగు దాతలనుగాంచి
వాచాలురంచు భావనచేయుచుందురు
హితబోధచేయు పండితులగాంచి
మిడిసిచావనేల మీరనెదరు మితా
హారులైన మంచివారిగాంచి
దొంగగురువులిట్టి త్రోవనుందురు వారి
జేరినట్టులైన జేటువచ్చు॥ 58

సీ॥ జ్ఞానప్రియగు గంజాయి లేకున్నచో
బుద్ధి సిల్కడకాదు పుత్రులార
సారాయమును గల్లు వారబోయకయున్న
జగదంబ పలుకదు సాధులార
విమల మాంసంబు నైవేద్యంబిడక మంత్ర
సిద్ధిగల్గదుచుమీ శిష్యులార
మైధున కైంకర్య మాత్రంబుచే ముక్తి
కల్గు మీకోవయః కాంతలార
మొనసి కోరినంత ధనము మాకిచ్చిన
నందవచ్చుసౌఖ్య మాధ్యులార
యని వచింపుచుందు రనయంబు పాపిష్ఠి
గురుల జేరరాదు కువలయాక్షి॥ 59

సీ॥ ఈరేడులోకంబు లీ శరీరమునందె
కలవు చూడుమటంచు దెలియపరచి

పంచేంద్రియంబులే పంచ గంగలుగాని
లే వన్యమంచు లాలించి చెప్పి
మూడుగుణములే త్రిమూర్తులుగాని యొం
డొరులు లేరను భావ మొందఁజేసి
లేమియే నరకంబు భూమీశుఁడే బ్రహ్మ
మైశ్వర్యమే మోక్షమని వచించి
యాత్మకంటె లాఁతియగు పరబ్రహ్మంబు
లేనె లేదటంచుఁ బూని తెలిపి
శిష్యులైనవారిఁ జెడఁగొట్టు పాపిష్ఠి
గురులఁ జేరరాదు కువలయాక్షి॥ 60

ఆ॥ భిన్ననావ నెక్కి భీతితోన ట్టటఁ
గూలువానిపోల్కి బేలగురునిఁ
జెట్టపట్టువాఁడు చెడి ఘోరపాప స
ముద్రమందు మునుఁగు మోహనాంగి॥ 61

ఆ॥ చెలువ యిపుడు నేవచించిన పాపిష్ఠి
గురుల లక్షణంబొకటియు నాంజ
నేయునందు లేదు నిఖిలముముక్షువు
లాశ్రయింపఁదగు మహాత్ముఁడితఁడు॥ 62

వ॥ అని వచించిన జనకరాజుతోఁ దదీయ ధర్మపత్ని దేవా! దేశిక లక్షణంబులు దెలిపితిరి. శిష్యలక్షణంబు లెట్టిఁగింపుడను టయు నతం డిట్లనియె. నారీమణీ! ధర్మార్థకామమోక్షంబు లను చతుర్విధ పురుషార్థములకు నాచార్యుండు కావలయు

నందులో మోక్షార్థికి గుర్వంగీకరణం బవశ్యక ర్తవ్యంబు
కావున॥ 63

ఆ॥ అతి తపస్వియై సదాచార్య లక్షణ
శీలుఁడైన గురునిఁ జేరి తదుప
దేశ మొంది విష్ణుదేవునిపాదంబు
లాశ్రయించవలయు నతని యాజ్ఞ॥ 64

తే॥ తనకు దైవభక్తి తత్వంబుఁ దెలిపిన
గురుఁడు బీదయగుచుఁ బరగెనేని
శక్తికొలఁది దేహసంరక్షణము సేత
తన్వి శిష్యవగుని ధర్మమండ్రు॥ 65

సీ॥ అలసిన వేళఁ బాదాబ్జంబులొత్తి దే
హాయాస మెల్లను మాయఁ జేసి
తిండికిఁ గొఱంత లేకుండ సమర్పించి
తగిన నీరమొసంగి దాహముడిపి
తీరికగానున్నచో రహస్యంబుల
నడిగితదర్థంబు లాత్మనిల్పి
నభ్యంజనాదుల నానంద మొందించి
శ్రీపాదతీర్థంబు స్వీకరించి

వాంఛనడిగినట్టి వస్తువులెల్ల తే
దనకయిచ్చి కోపమందినపుడు
తాములొంగి గురుని దైవంబుగానెన్న
వలయు శిష్యులైనవారు సాధ్వి॥ 66

సీ॥ ఆచార్యదర్శనం బబ్బినప్పుడు మహా
రాజునుఁబోలె గౌరవమొసర్చి
దేశికుండడరి బోధించుచో బంగారు
దొరకినభంగి సంతోషమొంది
సద్గురునందు దోషములు దోఁచిన లోష్ట
నికరంబునట్లు తృణీకరించి
గురుఁడు కష్టములచేఁ బరితాపయుక్తుఁడై
నప్పుడు శాస్త్రవాక్యములఁదేర్చి
గురుపదంబులందు గురుమంత్రమందును
దైవమందుఁ దన మతంబునందు
భక్తిగల్గి వేఱుపాయంబు లరయక
సిద్ధిఁ జెందవలయు శిష్యవరులు॥ 67

మ॥ ధనధాన్యంబులొసంగియుం వివిధరత్నంబుల్ సమర్పించియుం
దనువుం వాక్యముచిత్తమిచ్చినను వస్త్రక్షేత్రముల్పూర్చియుం
దనుజీవేశ్వర మర్మముల్తెలిపి యాతత్వత్రియజ్ఞానమి । చ్చిన
యాచార్యుఋణంబుఁ బాపుకొనఁగా శిష్యాళికిం శక్యమే॥

ఉ॥ భ్రాతలు మాతలుంబితలు బంధువులుం సుతులుం హితుల్కా
లా । దాతలు ద్రవ్యదాతలును దారలు సంసృతి నామవా
ర్ధిలోఁ । ద్రోతురు సద్గురుండు కృపతో నపవర్గపథంబుఁజూపి
త । ద్భీతిఁ దొలంచి ప్రోచుఁగద ప్రేయసి యాతని తుల్యు
లేపరుల్ ॥ 69

ఆ॥ గురునికన్న రక్షకుండు సంసారంబు
కంటె వైరి విష్ణుకథలు వినుట

కన్న సుఖములేదు గాఢవైరాగ్యంబు
కన్న లాభమొకటి కానరాదు॥ 70

ఆ॥ అగ్నితప్తమయ్యు నష్టాపదము వెలి
గారమాశ్రయించి కాదె కరుగు
నట్లు విష్ణుభక్తుఁడైన సద్గురుచెంతఁ
జేరికాని ముక్తిఁ జెందలేడు॥ 71

ఆ॥ నీటఁబాసినంత నీరేజబంధుని
చేత నీరజము నశించునట్లు
గురుని విడుచువాఁడు హరినిగ్రహమునకుఁ
బాత్రుఁడగునుకాదె పంకజాక్షి॥ 72

ఆ॥ త్రికరణంబులచేతను దేశికునకుఁ
జేయరాదపకారంబు చేయువాఁడు
తనప్రమాదంబునకు నొచ్చుకొనుచు నతనిఁ
జేరి మ్రొక్కి-క్షమింపఁగఁ గోరవలయు॥ 73

సీ॥ ఆచార్యునందు దోషారోపణముచేసి
సిగ్గేది పరులకుఁ జెప్పువాఁడు
గురుదత్తమైన శ్రీహరిమంత్ర మితరుల
చెంత వెల్లడిగా వచించువాఁడు
గురునకు శుశ్రూష కోరిసేయక బద్ధ
కించి శరీరంబుఁ బెంచువాఁడు
తనదేశికున కొసంగిన ద్రవ్యమింతని
లెక్కించి మదిలోనఁ బొక్కువాఁడు

దేశికోచ్ఛిష్టమందుఁ దదీయపాద
తీర్థపానంబునందు సందేహ మొంది
మానుకొనునట్టివాఁడు దుర్మార్గశిష్యుఁ
డనివచింతురు పండితులైన మునులు॥ 74

సీ॥ తనుజూడ మందిరంబునకు వచ్చినఁ బెద్ద
పులిఁగన్న చందాన నులికిడాఁగి
ధనధాన్య ముఖపదార్థము లేవియైన స
మర్పించుచోఁ జోరునట్లు పాఱి
వాలాయముగ. భగవత్కథల్ వినుమని
నియమించుచో గాఢనిద్ర జెంది
యపవర్గమార్గంబులరసి నిర్మలకృపఁ
దెలుపుచో భూరి సందేహ మొంది
భగవదవతారముల నరప్రాయములుగఁ
దలఁచి గురునకు లొంగకాదరము విడిచి
సోమరి తనంబుఁగాంచు శిష్యులకు జన్మ
జన్మముల దుఃఖ మొదవును జలరుహాక్షి॥ 75

వ॥ కావున సదాచార్యుండు నస్ఖలితబ్రహ్మచారియు వేద వేదాంత వేదియు వైరాగ్యనిధియు భగవదవతార రహస్యవిదుండును విశదవాక్యశిఖామణియు సీతారామభక్తాగ్రేసరుండు నగు నిమ్మహనీయుండను నాచార్యునిగాఁ దలంచి కృతార్థురాలవుఁ గమ్మని జనకుం డాంజనేయు నుచితగృహంబున నుండఁజేసి తానును శుద్ధాంతంబున కరిగి భార్యాసహితుండై సుఖ నిద్రఁ గావించి మఱునాడరుణోదయంబున లేచి స్నానా

ద్యనుష్ఠానంబుల నెఱపి రాజకీయవ్యవహారంబులకుంజనియె
నంత జనకపత్నియగు సుశీలాదేవి తొల్లి రామసౌందర్య
మగ్నురాలై తదీయదర్శనంబుఁ గోరుచున్న బ్రహ్మ క్షత్రియ
వైశ్య శూద్రాది పుణ్య స్త్రీలను బలుమందిని రావించి
వారి కిట్లనియె॥ 76

చ॥ అవనిసుతా వివాహసమయంబున రాముని సోయగంబు మీ
రవిరళ భక్తితోడఁ గని నప్పటినుండియుఁ దృప్తిలేక చూ
పవలయునంచు నన్నెపుడు ప్రస్తుతిఁ జేయుదు రమ్మలార! దా
నివలన వేగువాని నొకనిన్ వెసనంపితి రామునొద్దకున్॥ 77

ఉ॥ ఆరఘువీరుఁడేను తనకంపిన లేఖకు సంతసించి వి
స్తార మనీషినిన్ నిజపదద్వయతామర సద్విరేఫు సా
మీరినిఁ బంచె నాతనిసమీపమునంపున మీరలాదటుం
జేరి నమస్కరించిన వచించును రాముని తత్త్వమంతయున్॥

క॥ నా విని యప్పువుబోడులు
భావంబునఁ బట్టరాని ప్రమదంబున న
బ్జాభవరు పత్నికి వినతులు
గావింపుచు నిట్టులనిరి కౌతుక మొలయన్॥ 79

క॥ మాలాలస నెఱవేర్చుట
కీలాగునఁ గష్టమనక యెంతోపని సం
భాళించి చేసినందున
మేలోర్చిన దానవైతి మిహికాంశుముఖీ! 80

ఆ॥ చెలి పరోపకారశీలురౌ మీవంటి
వారు లేకయున్న వసుధయందు

మమ్ముఁబోటివారు మనియుండి సార్థక
మించుకైనఁ గల్గదెంచిచూడ॥ 81

తే॥ అనుచుఁ గొనియాడి తద్వథూజనములెల్ల
జనకపత్నీసమేతులై చని సమీర
పుత్రుఁ వీక్షించి తత్పదాంభోజములకుఁ
బ్రణుతులొనరించి యిట్లని పల్కి రపుడు॥ 82

క॥ సీతారాముల పాదా
బ్జాతములకు భృంగమగుచుఁ జరియించు భవ
త్పూతచరిత్రం బెన్నఁగ
నేతన్మాత్రులకు శక్యమే హనుమంతా॥ 83

క॥ మాకులదైవంబగు సీ
తాకాంతారత్న మాత్మ దయితునితోన
స్తోకముదంబునఁ గూడియుఁ
గైకొనునే భోగములు వికర్తనతేజా॥ 84

సీ॥ బొమ్మపెండ్లిండ్లు నేర్పునఁ జేయుచో మమ్ముఁ
గూడి వియ్యములందుకొన్న సొంపు
చెలఁగి యుద్యానభూములయందు మాతో వి
హారంబు సల్పినయట్టి పనులు
చెలువొప్ప చంద్రశాలలయందు మమ్ములఁ
గలసి తాఁ జేయు లీలలవిధంబు
కడు వేడ్క మేమెద్దియడిగిన నదియెల్ల
దయతోనొసంగు నౌదార్యమహిమ

భర్తయైన రామభద్రునితో విఃథి
లాధిపతి కుమారియైన సీత
విన్నవింపుచుండ వింటివే యెపుడైన
రుజ్నివార యో మరుత్కుమార॥ 85

ఆ॥ అమ్మలార మీరలడిగిన భూపుత్రి
నాకు మీకు సర్వలోకములకు
జననియైన భవ్యసాధ్వి రామునిఁగూడి
భూరిసౌఖ్యములనుఁ బొందుచుండె॥ 86

ఆ॥ మఱువలేదు భూకుమారి మిమ్ములఁగూడి
చిన్ననాడొనర్చు చెయువులెల్లఁ
గౌసలేయుతోడఁ గలసి మేలములాడు
వేళఁ జెప్పుచుండ వినుచునుందు॥ 87

ఆ॥ నేనువచ్చునపుడు మానినీతిలకమా
భూమిదేవిపుత్రి భూరికరుణ
నడిగెఁ గాదె మిమ్మునందఱినిం బేరు
పేరువరుస నమ్మలార మొన్న॥ 88

తే॥ అనిన విని సంతసించి శ్రీయాంజనేయు
మ్రోలఁగూర్చుండి కామినీ జాలమిట్టు
లనివచించిరి వినుము మహానుభావ
కలదొకరహస్యమైన వాక్యంబునేడు॥ 89

తే॥ బహుదినంబుల క్రింద లేఁబ్రాయమపుడు
రామభూపతి మిథిలాపురమునుగూర్చి

యరుగుదెంచి ధరాపుత్రి నతిముదమునఁ
బరిణయంబాడెఁ గాదె యోపవన తనయ॥ 90

ఉ॥ ఆతని సోయగం బతని యద్భుతతేజము బాహువిక్రమ
స్ఫీతము ధైర్యమార్జవ విశేషము నింద్రియనిగ్రహంబు వి
ఖ్యాతబలంబు శీలమునఖర్వదయామయ భావమేము సం
ప్రీతిదలిర్పఁ జూచితిమి బీద మహానిధిఁ గన్న చాడ్పునన్॥91

సీ॥ కమ్మనూనియరాచి కడుసోగ నెఱికురు
లీరుగాఁ జిక్కులు తీసి తీసి
బలువేడ్క నలుగిడి బాగైన పన్నీట
ననువుగా జలకంబు లార్చియార్చి
తడియొత్తి మేలి వస్త్రములు తాల్పఁగఁజేసి
వాసించు గంధంబుఁ బూసిపూసి
కుసుమ మాలికలఁ గైకొనఁజేసి విడియంబు
లింపగునట్టు లందిచ్చి యిచ్చి
కౌసలేయుఁ బెండ్లికాలంబునందుఁ బూ
జించి శుభములెల్లఁ గాంచినాము
కాని యమ్మహాత్ముపై నుండు కూరిమి
వదలదయ్యె మమ్ము వాయుపుత్ర॥ 92

సీ॥ పెండ్లికుమారుఁడై ప్రేమతో జానకీ
గళమునసూత్రంబుఁ గట్టువేళ.
జేతులుసాచి మాసీతాశిరంబునఁ
బ్రాలుపుగాఁదలఁబ్రాలుపోయువేళ

నవనీకుమారితో నవరత్నశిబికపై
నెలమితో నెక్కి యూరేగువేళ
దమ్మితూడునుఁబోలు ధరణిజాహస్తంబు
నింపుగాఁ బాణిగ్రహించువేళఁ
గౌసలేయుని సోయగముగన్న మాకన్ను
లితరవస్తువులు గణించరోసి
మరల నతనిఁజూడ మఱిమఱిఁగాంక్షింపు
చున్నవార్తితోఁ బ్రసన్నహృదయ॥ 93

సీ॥ ఎఱ్ఱతామరపూల నెగతాళిసేయుచుఁ
దనరారు మృదులపాదములవాఁడు
తలలైదుగల మహాదండశూకములతోఁ
దులఁదూగు నిడుద చేదోయివాఁడు
బాకినోటిమెకంబుఁ జీకాకు నొందింపఁ
దగినట్టి సూక్ష్మ మధ్యంబువాఁడు
పూలమాలికలు ముత్యాలహారంబు లం
దముమీఱఁదాల్చు వత్సంబువాఁడు
సోగకురులవాఁడు సోగకన్నులవాఁడు
పూవుటమ్మువానిఁ బోలువాఁడు
రామచంద్రుఁడింక నేమూడ్కి మాకన్నుఁ
గవకుఁ గానవచ్చు గాఢ్పుపట్టి॥ 94

సీ॥ విమల రాజీవముల్ వికసించినట్లుండు
విచ్చినప్పుడు రామవిభునికనులు

మంచిముత్తెములు కూర్పించిన గతినుండు
దశరథరాజనందనురదములు
సంపెంగపూవుతో సంబంధ మొనరింపఁ
దలఁచును శ్రీరఘూత్తమునిముక్కు
కార్ముకంబులతో జగడమాడఁగానోపు
భూమిజానాథుని భ్రూయుగంబు

చక్కిలములు రామచంద్రునివీనులు
విద్రుమములు రామవిభునిమోవి
లద్దములు ఖరాసురారి కపోలంబు
లహహా! వాని నెన్న నలవియగునె॥ 95

సీ॥ కౌసలేయుని మందహాసంబొలయుచోట
రాజోదయము నిష్ప్రయోజనంబు
రామ తేజః ప్రసారంబు గల్గినచోట
రాజీవబంధుని రాక కాదు
సాకేతవిభునిరోషము రగిలినచోట
ననలుని దీప్తి నిరర్థకంబు
కాకుత్స్థకులు ననుకంపవేరినచోట
సకల దైవత కటాక్షమ్ము వమ్ము
దశముఖారి మేనితావి గల్గినచోట
నిఖిల పుష్పచయము నిష్ఫలంబు
గాఁదలంచి మేము కలకాల మారాము
ప్రాపు గోరెదము సుపర్వవినుత॥ 96

సీ॥ గమనించువేళ రాఘవునియందముఁ జూడ
గా సహస్రాక్షులు కలుగవలయు
భాషించుచో రఘుప్రభుని చాతుర్య
మాకర్ణింప వేచెవుల్ కలుగవలయు
విహరించుచో రఘువీరు నెమ్మోయితావి
మూచూడ వేముకుల్ మొలవ వలయుఁ
గూర్చుండు నపుడు రఘుస్వామి సేవ సే
యంగ వేకరము లుండంగవలయు

నట్లు లేకున్నఁ జాలవటంచు సారె
కోరితిమి కాని యామాయదారి బ్రహ్మ
దేవుడొసగూర్ప నందుకు దిగులు నొంది
నాముగద రామవిభు పెండ్లినాడు మేము॥ 97

సీ॥ రసికాగ్రగణ్యుఁడై రమణులు తనుబాళిఁ
జూచినఁ గన్నెత్తి చూడనోడుఁ
గోడె ప్రాయముగల్గు వాఁడయ్యుఁ దరుణులు
పరిహాసించిన మాఱువలుక వెఱచు
మాటనేర్పరియయ్యు మగువలు ప్రశ్నలె
న్నెన్ని యిచ్చినఁగాని మిన్నకుండుఁ
జక్కందనము గల్గి చానలు మోహించి
కదిసినఁ దానేమి కదలకుండు

రాముఁ డేమిచిత్రమో మహీస్థలమందు
నింత నిశ్చలంబు నెనయువాని

నింత యందగాని నిటువంటి మన్నీనిఁ
గానమైతి మేము గాడ్పుపట్టి॥ 98

సీ॥ పచ్చినంజుడు మెక్కు పాడురక్కసి వంగ
డమునందుఁ బుట్టు మిటారులైనఁ
గాయలాకులు మేసి కాననంబులు డాసి
చరియించు కామినీ జనములైన
శాల్యన్నము భుజించి చంద్రశాలల నమో
ఘక్రీడఁ గావించు కన్యలైన
నమృతంబుఁ ద్రావి మహానందమున నంద
నవనిం దిరుగు మరున్నారులైనఁ
గాపురముల రోసి కాంక్షలఁ దెగఁగోసి
నిశ్చలాత్ములౌ మునివరులైన
జనకజా మనోహరుని సోయగముగన్న
వలపుఁగాంతురో యనిలతనూజ॥ 99

సీ॥ రామచంద్రుని పేరురంబుఁ గాంచినయంత
వలుదచాచుల నొత్తవలయునంచు
లక్ష్మణాగ్రజు కపోలములు సూచినయంత
నెలమితో ముద్దిడవలయునంచు
రాఘవు రమ్యాధరములు వీక్షింపుచోఁ
జెలఁగి పానముసేయ వలయునంచు
దశరథాత్మజుని సౌందర్యంబుఁ గన్నచో
వలపుమీఱఁగఁ బొందవలయునంచు

భరతపూర్వజు సుగుణసంపదనుఁగన్న
వాస్తవంబుగ మహిషి కావలయునంచుఁ
దలఁపని నెలంత ముల్లోకములను మూఁడు
కాలములయందు లేదయా కపికులేంద్ర॥ 100

చ॥ హనుమ ఖరాసురాంతకునకాసొగసా నగవావిలాసమా
వినయము సద్గుణంబులు వివేకము నామృదుభాషణంబు లా
తనురుచి సత్యమార్జవముదగ్రపరాక్రమ మెట్టులబ్బెనో
యనుచు నదభ్రవిస్మయమునందుచు నుండుదు మేము నిత్య
ముఁ॥ 101

చ॥ పకపకనవ్వునప్పుడు శుభప్రదవాక్యము లాడునప్డు శ
య్యకుఁ జనిపండునప్పుడు నొయారముగా విహరించునప్పుడూ
రకనిలుచుండునప్పుడును రామునిసోయగ మెన్నరాని పో
లికలఁగరంచుచుండునవలీలఁగనుంగొను వారిచిత్తముల్॥102

సీ॥ అలరాఘవునిఁగన్న దాదిగామాకన్నుఁ
గవ లన్యవస్తువు లాఁకఁ చరోసి
దశరథాత్మజుమేను దాఁకుట మొదలు మా
చేతులితరమైన చెయువులుడిగి
కాకుత్థ్సపలుకు లాకర్ణించుటాది మా
వీను లేకథలైన వినుట మాని
కౌసలేయుని సోయగముఁగన్నదాది మా
చిత్తముల్ వేనిపైఁ జేరవెఱచి
మరలరామచంద్ర చరణాంబురుహ సన్ని
ధానలాభ మెప్పుడైనఁగల్గు

నా యటంచుఁజాల నవయుచున్నవిగదా
రుజ్నివారయో మరుత్కుమార॥ 103

ఉ॥ రామునకీప్రభావమొగిరాఁ గతమేమి వనాటవర్య యీ
రాముఁడెవండు మాకిటు విరాళిధరాతనయాహృదీశుపై
నేమిటికబ్బెఁజూపరకు నెల్లనిదేవిధమా మదీయహృ
త్తామరసంబులేమిగులఁ దల్లడమందెనొ చెప్పుమాదయన్॥

ఉ॥ నా వినియవ్వనాటకులనాథుఁడు విస్మితమానసాబ్జుఁడై
యీవనితాచయంబు మునుపేమితపంబొనరించెనో జగ
త్పావనుఁడైనరాఘవుని పాదములందెడలేనిభక్తినే
డీవగఁగల్గెనెంతశుభ మెంతటిపుణ్యమిఁకేమనందగున్॥ 105

వ॥ అని యమ్మానినీ నికరంబుతో నిట్లనియె. 106

ఉ॥ పిల్లలయందుఁ దమ్ముమనుఁబెంచినతల్లులయందునాత్మహృ
ద్వల్లభులందుబంధుజనవర్గమునందు నగీములందునన్
మొల్లమునందుఁజానలకు, మోహముకల్గునుగాని జానకీ
వల్లభునందుభక్తియిటువర్ధిలునే సుకృతంబులేనిచో॥ 107

శా॥ ఆహారంబు భయంబు మైథునము నిద్రాధిక్యమెవ్వారికిం
బాహాటంబుగమేనితోడ నెలలిం బ్రాప్తించుసంసార దు
ర్మోహంబున్ విడనాడి తత్త్వవిదులై ముక్తిప్రదుండైన సీ
తాహృద్వల్లభు నాశ్రయించుటకు సాధ్యంబౌనె జీవాళికిన్॥

సీ॥ నడు వీధిలోఁజేరి నానాజనములతోఁ
డాటోటుగాఁ జేటుమాటలాడ
నారాటమొప్ప నిద్రాహారములుమాని
పెరవారితోఁ జీట్లపేకలాడఁ

బందిరీతిగఁదిని భార్యతోసీవలా
వలివారువినునట్లు వాదులాడ
సారమేయముభంగి నూరిలోనింటింట
హద్దులేక చరించి ప్రొద్దుపుచ్చ
జగడమాడువారి సన్నిధానముఁజేరి
యూరుకొండటంచు నూఱడింపఁ
దీఱుచుండుఁగాని తీఱదు శ్రీరామ
పాదభక్తిసేయఁ బామరులకు॥ 109

సీ॥ వేశ్యాగృహములఁ బ్రవేశించుటకుఁదీఱుఁ
గల్లుదుకాణము ల్గదియఁదీఱు
నక్రమమైన కార్యములొనర్పఁగఁదీఱు
బీదలౌవారి నేడ్పింపఁదీఱుఁ
దాలిమిమాలి జూదంబులాడఁగఁ దీఱుఁ
దెగువతోఁ బరులనిందింపఁదీఱుఁ
జెలఁగి నాస్తికవాదము లొనర్పఁగాఁదీఱుఁ
జౌర్యంబునకును హింసలకుఁదీఱుఁ
బరవధూవర్ణనముసేయు పనికిఁదీఱు
సొంపుమీఱఁగ సుతులలాలింపఁదీఱుఁ
గాని వాంఛాప్రదుండైన కౌసలేయు
భక్తి సేవింపఁదీఱదు పామరులకు॥ 110

సీ॥ రోగార్తుఁడైనచో రాగంబువిడనాడి
డాయంగ వెఱచు పెండ్లమును నమ్మి

పాయంబు రాగానె భార్యమాటలువిని
తనువీడి పోవు నందనులనమ్మి
పుట్టింటిసొమ్మెల్లఁ గట్టి స్వప్రాణ నా
థుని౯ జేర్పజూచు కూతుండ్రనమ్మి
ధనహీనమైనచో దన్నొకతృణముగాఁ
దలఁపోయు బంధు బృందములనమ్మి
శోకయుతమైన సంసారసుఖమునమ్మి
ఫేనసన్నిభమైన నెమ్మేనునమ్మి
జ్ఞానహీనులు ముక్తి నిధానమైన
రామచంద్రుని నమ్మరు రామలార॥ 111

ఆ॥ ధనములేనివాడు దారిద్ర్యమున భక్తి
చేయఁజాలనని కృశింపుచుండు
ద్రవ్యమున్నవాఁడు దైవంబు కనఁబడు
నేని౯ గొల్తుననుచుఁ బూనిపల్కు॥ 112

చ॥ తవిలిభయంబుఁ జూపినను దారుణశిక్షలఁ జెందఁజేసిన౯
రవరవగాఁగఁ గోసినను రాయిడిపెట్టిన రాలమొత్తినం। జెవి
కడ నిల్లుకట్టుకొని చెప్పిన హేతువు లెన్నిచూపిన౯। రవి
కులవర్యుఁడై వెలయు రాముని౯ గొల్వఁగలేరు పామరుల్॥

ఉ॥ అన్నము లేకయున్న విపులాంబరముల్ లభియింపకున్న నా
పన్నతఁజెందుచున్న బహుభంగుల రోగము లేచుచున్న నే
మన్ననలేక యుండినను మందులు సంసృతి నీసడించి వి
ద్వన్నుతమైన రామపద వారిజముల్కనరేర రక్కటా॥ 114

మ॥ కులకాంతల్ నిరసించినం గొడుకులుం గోడండ్రు దూషించి
నన్ । దలిదండ్రుల్ విడనాడినన్ సకల మిత్రవ్రాతము ల్బాంధ
వుల్ । తొలఁగంద్రోసిన సంసృతింబడి సదా దుఃఖింతురే
కాని శ్రీ । లలనాధీశ్వరుఁడైన రామునొగిఁ గొల్వం జూడ
రిప్పామరుల్॥ 115

చ॥ సిరులుమెఱుంగులట్లువినశించుట మబ్బులజాడరోగముల్
సరగునఁగ్రమ్ముకొంట పులిచాడ్పునదేహమునందునన్ జరా
భరముప్రవేశమాటఁగని పాపులుసంసృతిఁబాసి జానకీ
వరుచరణాంబుజస్మరణ వావిరిఁజేయరదేమిచిత్రమో॥ 116

చ॥ వ్రతములుతీర్థయాత్ర లుపవాసములున్ మహనీయదానము
ల్క్రతువులుదేవపూజ లుపకారములెన్నియొచేసి పాప సం
హతినిరసించిపుట్టిన మహాత్ములుసంసృతికోసి జానకీ
పతిచరణాంబుజంబుల నుపాసనచేయుదురెల్లభంగులన్॥ 117

ఉ॥ ఆకలిగల్గినట్లు ఘనమైనపిపాస జనించినట్టు లా
రోకలిఁబట్టిదంచుతఱి రోమములం జెమటూరినట్లు నీ
రాకరమందు వీచులనయంబును రేఁగినయట్లుగల్గు ద
ర్వీకరశాయియైన రఘువీరునిపైరుచిభక్తకోటికిన్॥ 118

చ॥ చిగురులఁగోరుకోవెలల చెన్నునఁబూవులఁగోరు తేటిచా
ల్వగఫలలబ్ధిఁగోరు శుకవారముభంగి దినేంద్రుఁగోరు చ
క్రగణమురీతిభక్తుల వికాసమనంబులుగోరుచుండు రే
వగలునుభూమిజావిభుని పాదసరోజములేమిచెప్పుదున్॥ 119

సీ॥ ఎలమితో నందలం బెక్కునాడందలం
బెక్కినవాని వహించునాడు

సింహాసనమున వేంచేయునా డటుల వేం
చేయువానికి సేవచేయునాడు
తులలేని ధనముచే వెలయునా డాలిబ్బి
చే బొంగువాని యాచించునాడు
సరసాన్నభుక్తిచేఁ బరగునా డట్టి వా
రిండ్లకుఁ బులికూటికేగునాడు
విలువగలుగు వస్త్రములు ధరించిననాడు
గోచిపాత కొఱకరి కొసరునాడు
రామచంద్రుపాద రాజీవముల నొక్క
పగిదిఁగొల్చువాఁడు భక్తుఁడండ్రు॥ 120

చ॥ అనలుఁడు చల్లనైనను దినాధిపుడుజ్వలకాంతిఁ బాసినన్
వననిధులింకినం గిరులు వ్రాలిన ధారుణికంపమొందినన్
ఘనులగుదేవతల్ భయముఁగాంచిన దిక్కులదృశ్యమైన బా
యని రుచిరాముపై నెరపునట్టి మహాత్ములు భక్తులౌ
జుమీ॥ 121

చ॥ కలుముల నీసడించి కులకాంతలపైఁ దగుబాళిడించి విం
దులనటులుంచి నందనులతోఁగల నెయ్యముకుంచిభోగవాం
ఛల వెసఁద్రుంచి దేహముల శాశ్వతమంచుఁదలంచి రాముఁడే
కలఁడనియెంచి కొల్చినప్రగల్భులు భక్తులటండ్రు కోవిదుల్

తే॥ అని మఱియు నిట్టులనియె నాహనుమ తల్లు
లార! మీరెల్ల నన్యాలాలసలుమాని
రామ పాదారవిందముల్ రాత్రిదివము
లెలమిఁదలఁచుట భాగ్యవంతులరు చుమ్ము॥ 123

మ॥ మునియో సిద్ధుఁడో పద్మబంధుఁడో మరున్ముఖ్యుండో పం
కేరుహా। సనుఁడో మానవుఁడో పినాకధరుఁడో చంద్రుండో
మీనాంకుఁడో । యను సందేహముచేత దాశరథి మాహా
త్మ్యంబు విన్పింపవే । యని మీరంటిరి సావధానముగ నే
డాలింపుఁడీ తెల్పెదన్॥ 124

చ॥ గరళగళుండుగాడు శశిగాడు మునిప్రవరుండుగాడు పు
ష్కరమణిగాడు మానవుఁడుగాడు సురేంద్రుఁడుగాడు భారతీ
వరుఁడునుగాడు రాక్షసుల వావిరి ద్రుంప నిజాశ్రితాళి నా
దరమునఁ బ్రోవ రాముఁడయి ధారుణిఁబుట్టిన విష్ణువౌగదా॥

సీ॥ బ్రహ్మ యెవ్వనినాభి పంకజంబునబుట్టి
కీర్తిమీఱఁగ సృష్టికర్తయయ్యె
మౌనీంద్రులెవని నామములు మంత్రములుగా
జపమొనరింతు రార్జవముతోడ
శర్వుఁడెవ్వని పాద జలము మస్తకమున
ధరియించి తులలేని ధన్యుఁడయ్యె
సురసంఘమెవ్వాని చరణాంబుజములాశ్ర
యించి వాంఛితములు కాంచుచుండు
జీవులెవ్వాని దివ్యప్రభావమెఱఁగి
వరుసఁ బ్రాపింతు రయ్యపవర్గపదవి
నట్టి విష్ణుండు రాముఁడై యవతరించెఁ
గాని సామాన్యమనుజుండుగాడు చుమ్ము॥ 126

ఉ॥ ఆతనియందు మీకు ననయంబు మహత్తరమైన ప్రేమ మీ
రీతినిఁగల్గె గావున విరించి బలారి ముఖాఖిలామర

వ్రాతములందరానియపవర్గ మహాసుఖవయ్యె భూరి వి
ఖ్యాతిలభించెఁ బేరినయఘంబులఁ బాసితి రేమిచెప్పుదున్॥

వ॥ అనిన నయ్యంగనామణు లంజనానందనునితో నిట్లనిరి. 128

చ॥ చెడుపను లెన్ని చేసిన నిసీయనిరోసినఁ దప్పుత్రోవలన్
నడచిన మందుఁడైనఁ బరనారులఁగూడినఁగాని నాథుఁడే
కడయని కొల్వఁగావలయుఁ గాదని చానలు పుణ్యవాంఛచే
విడివడరాదటంచు బలువీఁకవచింతురు పూరుషుల్సదా॥ 129

ఉ॥ హానిఁదొలంగి మోక్షసుఖ మందఁగఁ గారణమైనయట్టి యీ
మానవజన్మమెత్తియును మానవతుల్ మగవారి కెప్పుడుం
బానిసలై చరింపుడని బ్రహ్మలిఖించెనె చాలుఁజాలు ప్ర
జ్ఞానిధులైన దేశికుల సన్నిధిఁ జేరుట పాపకార్యమే॥ 130

చ॥ చదువఁగరాదు శాస్త్రములు సాధులబోధవినంగరాదు కెం
బెదవిఁగదల్చి మంత్రము జపింపఁగరాదిలువెళ్ళరాదు దు
ర్మదమునఁదన్నుభర్తలకు మాఱువచింపఁగరాదటయ్య యో
ముదితల నేలనేలపయి మూఢవిరించిసృజించెమారుతీ॥ 131

చ॥ దురితమనస్కుఁడై చెడుగుత్రోవఁజరించెడుభర్తృవాక్యము
ల్పొరిఁబొరినాలకించి యటు పోవుటమాచిదొ లేకధీరుఁడౌ
గురువచనానుసారముగఁ గూళలమాటలనీసడించి శ్రీ
ధరుఁడగు రామచంద్రునిపదంబులఁగొల్చుట మేలొ చెప్పుమా॥

చ॥ ఇనుఁడిలువెళ్లఁగొట్టిన మహీశుఁడుదండనచేసినం దనూ
జనికరమెల్లదూఱినను సాటివధూటులుధిక్కరించినన్ జన
నియుఁదండ్రియుంబలు విచారమునొందికృశింపుచున్నమా
మనములు రాముసందురుచి మావవు కానవులాఁతిబండముల్॥

వ॥ అనినవిని హనుమంతుండిట్లనియె నమ్మలారా మీమనంబులు స్ఫటికంబులభంగి నిర్మలంబులై యొప్పుచున్నవి. మీయందు దోషారోపణంబుసేయువారికినరకంబుగాని మీకేమియునపాయంబు లేదెట్లంటిరేని ధర్మంబు సామాన్యంబనియును విశేషంబనియు రెండుతెఱంగులఁ బ్రవర్తిల్లు నారెండింటిలో సామాన్యధర్మంబు ముందు గావివరించెద సావధానులరై యాకర్ణింపుడు. ద్రవ్యార్జనంబును, మాతాపితృభక్తియుఁ గూపారామ తటాక దేవాలయాది నిర్మాణంబును భార్యా పుత్రబంధుజనరక్షణంబును, యాగదానాగ్నిహోత్ర వైశ్వదేవాదులొనర్చుటయు నంగనాజనంబులకుఁ బాతివ్రత్యంబును నివిసామాన్యధర్మంబులనంబడు. సామాన్యధర్మంబుచే నీలోకసౌఖ్యంబు పరలోకంబున స్వర్గసౌఖ్యంబునుఁ గలుగుఁ గాని మోక్షంబుచేకూఱదు. సర్వసంగపరిత్యాగ పూర్వకంబుగా సర్వకాల సర్వదేశ సర్వావస్థలయందుఁ దైలధారా ప్రకారంబున నవిచ్ఛిన్నస్మృతిచే శ్రీమన్నారాయణుని సేవించుట విశేషధర్మంబు. దీనిచే మోక్షంబులభించు. భగవదర్పణబుద్ధిచేఁజేయు సామాన్యధర్మంబైనను క్షీరమిశ్రిత నీరంబులభంగి విశేషధర్మంబు పగిది మోక్షప్రదంబగుఁ బరస్పర విరోధంబు లేనప్పుడు రెండునుం జేయందగు. విరోధంబు కలిగినచో సామాన్యధర్మంబు విసర్జించి విశేషధర్మంబనుష్ఠింపవలయుననిన రామదూతతో మిథిలాపుర స్త్రీలిట్లనిరి. గురువర్యా! మీరిప్పుడు సెలవిచ్చిన వాక్యంబులన్నియు నర్థంబయ్యెంగాని చివరవాక్యంబు చెవులకెక్కం

గాని మనస్సున కెక్కదయ్యె నింకొక్కసారి వక్కాణింపు
మనిన నంజనానందనుం డిట్లనియె॥ 134

చ॥ హరిభజనంబుచేయు సమయంబున విఘ్నము చేయునట్టి సో
దరులను భార్యలన్ సుతులఁ దల్లినిఁ దండ్రిని బంధువర్గముం
బొరుగిరుగిండ్లవారిఁ దడిపుట్టములట్టులవీడి కేశవ
స్మరణ మొనర్పఁగావలయు సాధులు మానినులార ధీరులై॥

స్త్రీలు

చ॥ పెరిమనుమోచిమోచి కనిపెంచిన తల్లిని సొమ్ముగూర్చి సా
దరమునఁ బ్రోచు తండ్రినిఁ బదంబులఁజుట్టి పెనంగుబిడ్డలం
గరుణగలట్టిసోదరుల గౌరవమిచ్చి భజించు బాంధవో
త్కరమునువీడి లాఁతియగు కంజదళాక్షునిఁ గొల్వనేటికిన్॥

ఆంజనేయవాక్యము

ఉ॥ తల్లులఁగన్నవాఁడు మనతండ్రులభార్యల బంధువర్గముం
బిల్లలసోదరాదులనుఁ బ్రీతి సృజించినవాఁడు నన్ను మి
మ్మెల్లరఁ బుట్టజేయుటకు హేతువనందగువాఁడు భార్గవీ
వల్లభుఁడైన రాముఁడగు వానిదలంచుట లన్యమార్గమే॥

మ॥ తలిగర్భంబుననుండువేళ ధరమీఁదంబుట్టి వర్ధిల్లు వే
ళల దోగాడెడుపాయమందు మఱి లీలాసక్తివర్తించుచో
నెలపాయంబు జరాభరంబు గలనాడెంతోదయన్ దేహధా
రులరక్షించెడు దాత విష్ణువెకదా రూపింపవెవ్వేటికిన్ ॥138

చ॥ జలములనున్న వేళల రసాస్థలిఁ గ్రుమ్మరువేళఁ గాననం
బులఁ జరియించువేళ బలుపూనికతో నిదురించువేళ బా

ములఁబడువేళ రోగములు ముఁగినవేళ శరీరధారులం ।బలి మిని(బోచువాఁడు మధుభంజనుఁ డాతఁడె రాముఁడేఁగదా॥

స్త్రీలు

వ॥ దేవా! భూమి పాఁడిపంటలొసంగియు నీరు స్నానపానంబుల కుపయోగించియు నగ్ని సర్వపదార్థపచనంబొనర్చియు వాయు వుచ్ఛ్వాసనిశ్వాసంబులొసంగియు నాకాశం బవకాశంబిచ్చియు శరీరుల రక్షింపుచున్నవి. యిది ప్రత్యక్షముగా నుండగా నెన్నడు కానరాని విష్ణువు రక్షించునని చెప్పుట విపర్యాసముగా నున్నదే॥ 140

ఆంజనేయులు

అమ్మలారా! మీజ్ఞానం బింతలోనున్నది. నేనేమిచేయుదును. 141

స్త్రీలు

అయ్యా! మానీరస ప్రశ్నంబులకు మీరు విసుగు కొనరాదీ విషయంబున మీరు కోపించినచో లోకంబునకు దిక్కేమి గలదు. మేమబలలము. అజ్ఞానములో మునిఁగిన వారము సందేహనివారణార్థమై యడుగుచున్నాము గాని దేవరవారి సామర్థ్యమునుఁ బరీక్షించుటకు గాదు దయతో సమాధానమిమ్ము. 142

ఆంజనేయులు

సవిత్రులాఁరా! యదార్థంబు వక్కాణించెద నాలకింపుఁడు. సమస్తజీవులు బొమ్మలు. విష్ణుండు సూత్రధారి. సూత్రధారి బొమ్మల నాడించునట్లు విష్ణువు దేహులం ద్రిప్పు

చున్నాడు. యెట్లనఁగా సర్వవ్యాపకుఁడగు విష్ణుదేవుఁడే భూమి నావేశించి భరించుచు నింగినుండి యవకాశ మిచ్చుచు గాలియందుండి సుఖస్పర్శ గలిగించుచు నగ్ని యందుండి పదార్థములు పచనముచేయుచు నీటియం దుండి పోషకంబగుచు భూతములం గాపాడుచున్నాడు. దానివలననే పరబ్రహ్మమునకు విష్ణువనునామంబుకలిగెను॥

స్త్రీలు

స్వామీ! సూర్యచంద్రుల కాంతిచేతఁగదా లోకంబు వర్ధిల్లు చున్నది. 144

ఆంజనేయులు

పుణ్యవతులారా! నారాయణునకు సూర్యచంద్రులు నేత్రం బులు, పాతాళంబతని పాదంబులు, భూలోకంబు కటిప్రదే శంబు, నింగి కంఠంబు, నాకంబు శీర్షంబు, మేఘంబులు శిరోజంబులు, సముద్రములు జఠరంబు, జలంబు వీర్యంబు, వృక్షంబులు రోమంబులు, పర్వతంబు లెముకలు, సరస్వతి వాక్కు, అగ్నిహోత్రంబు రోషంబు, దిక్కులు చెవులు, వాయు వుచ్ఛ్వాసనిశ్వాసంబులు, వేదంబులుస్తోత్రంబులు, సర్వదేవతలు భృత్యులు, స్త్రీపురుషానురాగకారణుండగు మారుం డతని కనిష్ఠకుమారుండు, జగన్నిర్మాతయగు ధాత జ్యేష్ఠపుత్రుండు, సకలైశ్వర్య ప్రదానియగులక్ష్మి ముఖ్య మహిషి. మఱియు నతనికి ననంతకోటి దివ్యనామంబులు గలవు. వానిలో గోవింద విష్ణు వాసుదేవ నారాయణ

నామంబులు ముఖ్యంబు లమ్మహానుభావునితో సరియైన వాఁడే లేడనునప్పుడు మిగిలిన వాఁడెక్కడనుండును. 145

స్త్రీలు

దేశికశిఖామణీ! దేవరవారిచే వచింపఁబడిన మహాపురుషుని దర్శించుటకు స్పర్శించుటకు నుతించుటకు సాధ్యపడని వాఁడుగా నున్నాడే. 146

ఆంజనేయులు

అవునవు నందులకు సందియంబు లేదు. 147

స్త్రీలు

అట్లైనచో నంత పెద్దదేవుని సమీపింపఁజాలము. మఱియొక కొలఁదిదేవునిం దెలుపుము. 148

ఆంజనేయులు

పరబ్రహ్మంబొక్కఁడు గలండుగాని బలుమంది లేరు. సమస్తశాస్త్రంబులయందును సర్వవేదంబులయందును సర్వలోకంబులయందును గాలించినను విష్ణువొక్కండె సర్వాధికుండు.

స్త్రీలు

అమ్మహాపురుషుం డెచ్చటనుండును ? 150

ఆంజనేయులు

అనంతకోటి బ్రహ్మాండములయందు నిండి నిబిడీకృతమైయుండును. 151

స్త్రీలు

అన్నిట నున్నచోఁ గానరాడే. 152

ఆంజనేయులు

ప్రాకృత మాంసలోచనంబులకుం గానరాఁడు. జ్ఞాననేత్రం బులుగలవారికిమాత్రము కానఁబడుచుండు. 153

స్త్రీలు

మనకుఁ గానరాకుండ మనసమాచారంబు లతం డెట్లు గ్రహించు? 154

ఆంజనేయులు

ఆవిష్ణుండు సర్వశక్తుఁడు. సర్వజ్ఞుఁడు. కన్నులు లేకయే చూచునుఁ జెవులు లేకయే వినును. నాలుక లేకయే రుచిఁ గాంచును. నాసిక లేకయే మూచూచును మనస్సు లేకయే గ్రహించునుఁ గాళ్లు లేకయే నడచును. చేతులు లేకయే చేయును. నోరు లేకయే నమలును. మఱియు నతండు కొద్దిది గొప్పదిగా గొప్పది కొద్దిదిగాఁ జేయు నమ్మహాపురు షున కసాధ్యంబు లేదు. తనకుఁదానే పరమాధారుఁడు. సత్యసంకల్పుఁడు. జ్ఞానశక్తి బలైశ్వర్యవీర్య తేజస్సు లమ్మ హానుభావుని సంకల్పంబునకు బానిసలు. 155

స్త్రీలు

అంగడిలో నన్నియున్నవిగాని యల్లునినోట శనియున్న దన్నట్లు విష్ణువునందుఁ గల్యాణగుణంబులు కలవుగాని మాకు దుర్లభుఁడుగదా॥ 156

ఆంజనేయులు

అట్లని నిరాశ జెందవలదు. దేవతానది దుర్లభమైనదైనను భగీరథుని కాలమున భూలోకవాసులకు సులభమైనట్లును

దంతావళంబు గొప్పదైననుఁ బందుకొనినప్పు డెక్కుటకు సులభమైనట్లును శ్రీమన్నారాయణుఁ డధికుండైనను భక్త వత్సలుండు. 157

## స్త్రీలు

నీవాక్యంబు సత్యంబైనచో నతండంత సులభుం డగుటకు దృష్టాంతమేమి? 158

## ఆంజనేయులు

ఈలోకంబున నిక్కాలంబున మనుష్యరూపంబున నవతరించి మనమాంసలోచనంబులకు గోచరింపుచు సాంగత్యసల్లాపంబు లొనర్చుచుండుటయే తార్కాణము. 159

## స్త్రీలు

అతండేడీ? మాకుం గానఁబడలేదే? 160

## ఆంజనేయులు

అయ్యయ్యో! మీరెంతటి పిచ్చితల్లులు దశరథ పట్టమహిషి యగు కౌసల్యాదేవియం దుద్భవించి యెవ్వఁడు రామ నామముఁ గాంచెనో యేపురుషోత్తము నాశ్రయించి మహా మునులు కృతార్థులైరో యేపరాక్రమశాలి బాహుబలంబునఁ ద్రిలోకకంటకులైన రావణాది రాక్షసులు నశించిరో యేసర్వశక్తుని దయావిశేషంబున నిలింపులు నిర్భయానందంబులొందిరో యేపురుషోత్తముని విజయంబున నమరీ జనంబు లుత్తమాలంకార సమేతస్వేచ్ఛావిహారంబులు సల్పిరో యేజగన్మోహనుని దివ్యమంగళవిగ్రహ దర్శన మాత్రంబున మీమనస్సు లన్యపదార్థంబు లన్యసౌఖ్యంబుల

నీసడించెనో యట్టి సీతావల్లభుండు శ్రీరామచంద్రుండే శ్రీమన్నారాయణుండు. 161

స్త్రీ లు

గురుపుంగవా! మీరుచెప్పినది సత్యమేనా? 162

ఆంజనేయులు

సందేహించవలసినపనిలేదు. నన్నుఁగన్న తల్లిదండ్రులమీదను నాసుకృతంబు మీఁదను శాబ్దిచేసెదను. సీతావల్లభుండు పరబ్రహ్మస్వరూపుఁడు. 163

స్త్రీ లు

ఈరహస్యంబు మీకెట్లు తెలిసినది? 164

ఆంజనేయులు

బహుజన్మసహస్రార్జిత పుణ్యవిశేషంబువల్లను మహామునుల సాంగత్యబలము వల్లను భగవదనుగ్రహంబు వల్లను నెఱింగితిని. 165

స్త్రీ లు

ఈసీతానాథునివల్ల మనకురాఁబోవు ప్రయోజనంబెద్ది? 166

ఆంజనేయులు

శ్రీరాముని దూషించువారు శాశ్వతదుఃఖంబులు నమ్మహాత్మునిం గొనియాడువారు శాశ్వతానందంబునుం గాంతురు.

స్త్రీ లు

రెండును లేనివారేమగుదురు? 168

ఆంజనేయులు

సంసారసముద్రంబున మునింగి దరిగానకయుందురు. 169

స్త్రీలు

మేమితరవ్యాపారములుమాని కనిపెంచిన తల్లినిఁ బూజింతుము. శ్రీరాముని విడుతుము. 170

ఆంజనేయులు

మంచిది. తల్లినినమ్మినన్తైనఁ గాద్రవేయులభంగి నాపత్తునుం జెందుదురు. 171

స్త్రీలు

మీరు సెలవిచ్చినది మాకన్వయించలేదు. విపులముగాఁ జెప్పుడు. 172

ఆంజనేయులు

పూర్వము కద్రువ వినతలను కాంతామణు లిద్దరు కశ్యపుని భార్యలైయుండి యొక్కనాడు దేవేంద్రుని వెల్లతేనుగు విషయమై కలహించి శాబ్ది నేర్పరచుకొని కద్రువ తన కుమారులగు సర్పసమూహంబులం బిలిచి మీలోనొక్కరుం డనృతంబాడి మదీయశాబ్ది నెఱవేర్పుడనుటయు నప్పాప మిన్నలు పాపంబునకు వెఱచి నిరాకరించి రంత నాకద్రువ వారలంగాంచి దురాత్ములారా! మీరందఱు భవిష్యత్కాలంబున నొక భూపాలుం డొనర్చు హోమకుండంబునంబడి దగ్ధులగుదురుగాక యని శపించెం గావునఁ దల్లి రక్షించునని నమ్మరాదు. 173

స్త్రీలు

అదికాని పక్షమున సర్వవిధంబులం గాపాడిన తండ్రిని సేవింతుము. 174

ఆంజనేయులు

మాతృగర్భంబుఁ జొచ్చినదాది భగవద్ధ్యాన నిష్ఠాగరిష్ఠు డగుప్రహ్లాదునికొఱకు సర్వవిధమారణోపాయంబు లాచరించిన హిరణ్యకశిపుని వృత్తాంతము విన్నవారికిఁ దండ్రి రక్షకుండు కాజాలఁడని తోఁచును. 175

స్త్రీలు

అట్లైనచో నల్లారుముద్దుగా నాదరింపుచున్న సహోదరులం బూజింతుము. 176

ఆంజనేయులు

శరణాగతుండైన సుగ్రీవుని నిరంతరము వాలి బాధించెను. హితోపదేశము చేయుచున్న విభీషణుని రావణుడు తన్ని వెడలంగొట్టెను. పిమ్మట సుగ్రీవ విభీషణుల కారణమున వాలి రావణులు హతులైరి. సుందోపసుందులు పరస్పరము తన్నులాడి చచ్చిరేతద్వృత్తాంతములచే నన్నదమ్ములు రక్షకులు కాజాలరు॥ 177

స్త్రీలు

ఏదియుంగానిచో నక్కచెల్లెండ్ర నాశ్రయింతుము. మాసంగ్రాంతయేమి? 178

ఆంజనేయులు

శూర్పనఖయను రాక్షసి తనముక్కుచెవులు పోయినందులకు దుఃఖించి ఖరాసురరావణాసురుల కుటుంబములకు నాశన హేతువయ్యెఁ గద్రువ వినతచే ననేకవేలసంవత్సర

ములు దాసీతనము చేయించుకొనెనుఁ గావున నక్క చెల్లెండ్రు
రక్షకులు కాజాలరు. 179

స్త్రీలు

ప్రాణసమానులగు భర్తల నారాధించి కృతార్థుల మగు
దుము. 180

ఆంజనేయులు

నలుండు మహాపతివ్రతయగు దమయంతిని నట్టడవిలో దిగ
విడిచి స్వేచ్ఛంజనియె. నహల్యను గౌతముండు రాయివి
కమ్మని శపించె. జమదగ్ని తనభార్యయగు రేణుకను ఖం
డింప నియమించె నక్కారణంబున భార్యలకు భర్తలు
రక్షకులు కాజాలరు. 181

స్త్రీలు

మాకనుకూలంబుగా నున్నచో మాభర్తలమేము పోషింతు
ముగదా! రక్షకులముగామా! 182

ఆంజనేయులు

చాలు. జాలు. చంచలాత్ములతి చాపల్యముగలవారు. హేతు
వేమనఁగా స్వకీయులగు మూడువందలయేబదిమంది భార్య
ల నుదాసీనంబుగాఁ జూచి తన్నులాలించు దశరథుని
నిష్ఠురవాక్యంబులఁ దూలనాడి ప్రాణంబులదీసిన కైకేయీ
వృత్తాంతముచే భార్యలు రక్షకులు కాఁజాలరు. 183

స్త్రీలు

కొడుకుల నాశ్రయించి జీవింతుము. 184

ఆంజనేయులు

మందోదరి తనకుమారులగు నతికాయేంద్రజిదాదిరాక్షసులుండగాఁ దన కేనాటికి భయంబు లేదని తలంచియుండెను. కాని తన్నంగదుండు కొప్పువట్టి యీడ్చి పరాభవించినప్పుడు దిక్కులేనిదై యేడ్చె నందువల్లఁ కుమారులు రక్షకులుకారు. 185

స్త్రీలు

జననీజనకు లొక్కొక్కరైన బలము చాలదేమో యిద్దరి నాశ్రయింతుము. 186

ఆంజనేయులు

శునశ్శేపుని తల్లిదండ్రులు లక్షవరహాలు పుచ్చుకొని యతని నంబరీషునకు యాగపశువుగా విక్రయించుటచే వారిద్దఱుంగలసి రక్షకులు కానేరరని తోఁచు. 187

స్త్రీలు

మహాప్రేమగల బంధువుల నాశ్రయింతుము. 188

ఆంజనేయులు

ధనవంతులైన వారికి బంధువులు గలరది తక్కువయినచో లేనే లేరు. 189

స్త్రీలు

సర్వవిధంబులఁ బోషించునట్టి ధనము నాశ్రయింతుము. 190

ఆంజనేయులు

తే॥ సరవి నార్జించువేళ రక్షణమొనర్చు
నాడు వెచ్చించునాడు మానసమునందు

నార్తిఁగలిగించునట్టి ద్రవ్యంబు రక్షు
కంబు కాఁజాలదమ్మ యోకాంతలార॥ 191

స్త్రీలు

ప్రపంచమునకుం బరమోపకారకులగు సూర్యచంద్రుల
నాశ్రయింతుము. రక్షింపరా? 192

తే॥ స్వేచ్ఛనొకచోట నివసింప వీలుగాక
ఘనరిపులచేత వివిధరోగములచేత
బాధపడు సూర్యచంద్రు లెబ్భంగిమిమ్ముఁ
గావగలరో తలంపుడీ కాంతలార॥ 193

స్త్రీలు

త్రిలోకాధిపతియుఁ గామధేనువుఁ గల్పవృక్షము చింతా
మణియుంగలిగి ముప్పదిమూడుకోట్ల దేవతలకుఁ బ్రభు
వగు నింద్రునిం గొలిచి సుఖించెదము. 194

ఆంజనేయులు

సీ॥ విశ్వరూపునిఁజంపి విపులపాపంబుచే
దామరతూడులోఁ దాఁగినాడు
మునిపత్నిపైఁగల మోహంబుచేనేగి
తనువెల్ల యోనులఁ దాల్చినాడు
గరుడుండు పీయూష హరణార్థమైరాగ
నోడియాతని శరణొందినాడు
మేఘనాదాది సర్వాఘరాక్షసులచేఁ
గడలేనిబాములఁ గాంచినాడు
తపమొనర్చి తనపదము నెవ్వఁడైన నా
సించునో యటంచుఁ జింతసేయు

నట్టిమఘవుఁగొల్చి యానందమేరీతిఁ
బొందఁగలరు మీరు పొలఁతులార॥ 195

స్త్రీలు

హరవిరించనుల నాశ్రయించి శాశ్వతానందముఁ గైకొం
దుము. 196

మ॥ పదివేలేడులు బ్రహ్మఁగూర్చి తపమింపారంగఁగావించి య
ప్పిదపన్ శంకరుపాదముల్ గొలిచి నిర్భీతాత్ముఁడై యింకనా
పదలేదంచుఁ మదించురావణునిఁ గాపాడంగ లేరైరి బ
ల్లిదుఁడౌ రాముఁడు చంపుకాలమున శూలిబ్రహ్మలింతే కదా॥

స్త్రీలు

క॥ మేమెత్తి చెప్పినట్టి మ
హామహులందఱు నశక్తులని నుడివితి విం
కేమహనీయునిఁ గొల్చిన
సేమంబులభించునో వచింపుము దేవా॥ 198

ఆంజనేయులు

సీ॥ ప్రళయార్ణవంబులోఁ బడికుందుచున్నమా
ర్కండేయు నెవ్వాఁడు కరుణఁ బ్రోచె
నవనిరసాతలంబంటంగ నెవ్వాఁడు
పూనినిలిపె యథాస్థానమందు
వేదచోరువధించి వేదముల్ విధికిచ్చి
యెవ్వాఁడీసృష్టిఁ జేయుంచెనోలి
నాత్మాంఘ్రితీర్థ మహాత్మ్యంబుచేసి వా
వల్లభు నెవఁడు పావనునిఁ జేసె

బ్రహ్మరుద్రుల వరదానబలముచేత
రేఁగిజగముల నేఁచు రాత్రించరాళిఁ
ద్రుంచి యెవ్వాఁడు మేలొనరించెనట్టి
శ్రీధరుఁడురక్షకుఁడు చుమీ చెలువలార॥ 199

స్త్రీలు

స్వామీ! నారాయణుండు సర్వోత్కృష్టుండనియుఁ బరబ్రహ్మమనియు వేనోళ్లవక్కాణించితి రమ్మహాపురుషుండును బహువిధావతారంబులెత్తి సుఖదుఃఖముల పాలగుచున్నట్లు తోఁచుచున్నదే. 200

ఆంజనేయులు

మానవతులారా! యేతాదృశ నీరసవాక్యంబులు మీనోట వెడలినందులకు మిక్కిలి పరితాపంబగుచున్నది. నేను గర్భనరక మనుభవించునప్పుడునుఁ బరాధీనుఁడనై పొత్తులనుండు నాడును, నిద్రాహారంబులు వర్జించి సీతామహాదేవిని వెదకినప్పుడునుఁ గ్రూరరాక్షసులతోఁ బోరునప్పుడు నింతకష్టంబు నాకుఁ బ్రాప్తించినదికాదు. భక్తునకు భగవద్దూషణాలాప శ్రవణమునకన్నను బాధలేదుగదా. 201

స్త్రీలు

ఎందువల్ల, మేము దేవరవారికేమియు నపకారంబుచేయ లేదే. 202

ఆంజనేయులు

అపకారంబొనరింపలేదని మీరు సంతోషించితిరి. కాని చేయవలసిన దంతయుఁ జేసితి రెట్లనఁగా మనకు శరీరంబు

లోనంగి సర్వగతులం బోషింపుచు మనమేలుకొఱకు శ్రీవైకుంఠంబుఁ బాసి యీలోకంబున నవతరించిన మాధవుని దూషించితి రమ్మహాత్ముని పరత్వంబునందు సందేహించిన వారంత్యజాతిసముద్భూతులని శాస్త్రంబులు ఘోషింపుచున్నవి. సరేకదా గోవిందుని నిందించువారును విని సమ్మతించువారును శాశ్వతనరకంబు నొందుదురు. మఱియు నట్టి నీచులుచేయు పుణ్యంబులన్నియుం బాపంబులగుఁ బాపంబు లక్షయంబులగును. వెండియు నట్టివారి కాయుక్షీణంబగు నేలోకంబున నేజన్మంబునసుఖలేశం బైనను లభింపదు. స్నేహితులువిరోధులగుదురు. వారిపాలఁ బీయూషం బైనను విషంబగు, నెంతమాటవింటి నెంతమాటవింటిని.

స్త్రీలు

రామభక్తాగ్రణీ! క్షమింపుము. క్షమింపుము. మేమిప్పుడడిగినది మాహృదయంబుగాదు. పాపులాడువిపరీతవాక్యంబులకు సమాధానం బిచ్చుటకిట్లు ప్రశ్నించితిమి. కోపగించవద్దు.

ఆంజనేయులు

సరే అట్లైనచో బాధలేదు. సందేహనివారణం బొనర్తు నడుగుడు. 205

స్త్రీలు

జీవులకు శరీరంబు లెట్లుకలిగెను ? 206

ఆంజనేయులు

పూర్వకర్మానుసారంబుగాఁ గలిగెను. 207

స్త్రీలు

దేనికొఱకు? 208

ఆంజనేయులు

పాపానుగుణంబుగా నరకంబుఁజేరి దుఃఖ మనుభవించుటకునుఁ బుణ్యానుగుణముగా స్వర్గసుఖ మనుభవించుటకునుఁ బుణ్యపాపానుసారంబుగా నీలోకంబున సుఖదుఃఖము లనుభవించుటకును. 209

స్త్రీలు

పరమాత్మకు శరీరమెట్లు కలిగెను? 210

ఆంజనేయులు

స్వేచ్ఛచేఁ గలిగెను. 211

స్త్రీలు

అతనికి దేనికొఱకు? 212

ఆంజనేయులు

సాధుల రక్షించుటకును దుర్మార్గులఁ జంపుటకును ధర్మము నిలఁబెట్టుటకును. 213

స్త్రీలు

ఇప్పుడు చక్కఁగాఁ దెలిసినది. విష్ణుదేవునిఁ గొలిచిన నేమి ఫలము? 214

ఆంజనేయులు

ఇష్టమైన సుఖములు సంపాదించుటకు ననిష్టమైన దుఃఖంబులు తొలఁగించుకొనుటకును వీలగును. 215

## స్త్రీలు

నారాయణు నారాధించి యట్టిఫలమును బొందిన వారెవ్వ
రైనం గలరా? 216

## ఆంజనేయులు

లెక్కకు మిక్కుటంబుగాఁ గలరు. వారినందఱిని వక్కా
ణించుటకు నాజ్ఞానంబును నానోరును చాలదు. కొలఁదిగా
నెఱింగించెద నెట్లంటి రేని శ్రీధరు నారాధించి ప్రహ్లాదుండు
త్రిలోకపూజ్యుం డయ్యెను. బలిచక్రవర్తి శాశ్వతరాజ్యంబుఁ
గాంచెను. ధ్రువుండు బ్రహ్మపదవికిఁ బైనుండఁగలిగెను.
గజేంద్రుండు సద్యోముక్తికిఁ బాత్రుఁడయ్యె. నారదాది
మహామునులు మృత్యువునోడించి సర్వస్వతంత్రులైరి.
వాల్మీకి కవిప్రథముఁడయ్యె. రుక్మాంగదాంబరీషులు శాశ్వ
తానందంబు నొంది రీరామావతారకాలంబున నతని నాశ్ర
యించి విశ్వామిత్రుఁడు యాగపూర్తిఁ గావించుకొనియె
నహల్య శాపబాధఁ దొలఁగించుకొని ధన్యురాలయ్యె.
విరాధకబంధులు ఘోరరూపంబులు వాసి సురూపులైరి.
శరభంగాది మహామునులు బ్రహ్మదిలోకంబుల నీసడించి
శ్రీవైకుంఠంబుఁ జేరిరి. శబరీజటాయువులు ముక్తిపదంబు
నకుం జనిరి. సుగ్రీవ విభీషణులు రాజ్యంబులఁ బ్రాపించిరి.
వానరు లఘటితకృత్యంబులొనర్పంజాలి, రేను భావి బ్రహ్మ
నైతి. వేయిమాటలతోఁ బ్రయోజనంబు లేదు. చివరమాటఁ
జెప్పెద నాలకింపుడు. 217

ఆ॥ భూరినీచదశలఁ బొందఁగోరినవారు
విష్ణునిందఁజేయ వెఱవఁబోరు
గొప్పదశలు బొందఁగోరినవారు కే
శవుని పాదభక్తి సల్పవలయు॥ 218

ఉ॥ కాంచరిలం బరాభవముఁ గాంచ రధోగతి దీనభావముం
గాంచరు రోగముల్భయముఁగాంచరఘంబులు వైరిబాధలుం
గాంచెద రెల్లసంపదలు కాంతురు విద్యలు భూరిసౌఖ్యముల్
కాంచెద రీప్సితార్థములు కాంతురు మోక్షము విష్ణుసేవకుల్॥

ఆ॥ నిరుపమాన పుణ్యనిధియగా భరతఖండ
మందు మానవత్వమొంది రామ
పాదభక్తిలేని పాపాత్ములతో మాట
లాడరాదు మోము జూడరాదు॥ 220

మిథిలా స్త్రీలు

స్వామీ! శ్రీయఃపతియగువిష్ణుండు సర్వేశ్వరుండనియు సర్వ వ్యాపకుండనియు, సర్వశక్తుండనియు, సర్వాభీష్టఫలప్రదా యకుండనియు, నతండే శ్రీరామచంద్రుండనియు, సీతా దేవియే మహాలక్ష్మియనియు నిశ్చయించితిరి. మేమును వాస్తవమని నమ్మితిమి. కాని యొక్కమనవి. 221

సీ॥ శ్రీరామపాద రాజీవయుగ్మమున స
మ్ముదమొప్ప నలికము లొత్తుదాఁక
నవనిజాధిపుని సర్వాంగసౌందర్యంబు
కడువేడ్కఁ గనులచేఁ గాంచుదాఁక

సాకేతవిభుని భాషాసుధారస మవ
లీలఁ గర్ణములచేఁ గ్రోలుదాఁక
దశరథాత్మజు సన్నిధానంబుఁ బ్రాపించి
మించిన కూర్మిఁ గీర్తించుదాఁక

భరతు నన్నప్రేమోలఁబడి మామనోరథ
సిద్ధిఁ జేయుమని వచించుదాఁక
మేననసువులుండఁగా నోఫ వీకమీఁద
బ్రతుకు టెట్లు మేము పవనపుత్ర॥ 222

తే॥ ఇనుము లెడఁ బాపుటకు మోక్షమిచ్చుటకును
గర్తయగు కేశవుండు రాఘవకులమునఁ
బుట్టియుండఁగఁ జూడలేనట్టి వారి
జన్మములు వ్యర్థమగుఁగదా జగతియందు॥ 223

అని వచించుటయు 224

శా॥ మారారాతిమనోబ్జభృంగ నిఖిలామ్నాయాంతవేద్యా
మరు। న్నారీసన్నుత భూరిసంగరకలానాథాస్య పాథోనిధి
స్ఫారాటోపనివారణాద్భుత శరాసారావృషద్వేషిసం
హారజ్యేష్ఠనలాంగద ప్రముఖకీశానీక సంరక్షణా॥ 225

క॥ అరుణాంబుజ చరణా గురు
కరుణా ముఖసుగుణనిధి వికాసివితరణా
శరణాగత భరణా ఖల
హరణా భవతరణ సన్నుతాదిత్యరణా॥ 226

**మా లి ని**

పరనికరవినాశా పద్మబంధు ప్రకాశా
ఖరదనుజ విదారా కంధిగర్వాపహారా
దరజలధిసమీరా దాసచేతోవిహారా
పురహరగురుచాపా భోగనాశప్రతాపా॥ 227

గద్య

ఇది శ్రీసీతావల్లభప్రసాద సమాసాదిత కవితాప్రవీణ వేదాల
సీతారామాచార్య కృపాలబ్ధమంత్రరత్నాను సంధాన పవి
త్రాంతరంగ నిఖిలదుర్మత శిలోచ్చయ దంభోళీభూత
సముద్రాల లక్ష్మణాచార్యానుగ్రహాబోధిత విశిష్టా
ద్వైతరహస్యార్థ ధురంధర శఠగోపయతిరాడ్వ
రవరయోగిప్రభృతి పూర్వాచార్య చరణ
సరోజ భ్రమరాయమాన మొవ్వ వంశ
తిలక కృష్ణార్య కష్ణమాంబాతనూజ
శ్రీవైష్ణవ విధేయ వేంకటదాస
నామధేయప్రణీతంబైనసీతా
రామప్రభావంబునందు
ద్వితీయాశ్వాసము
స ర్వ ము
సంపూర్ణము.

---

శ్రీమతే రామానుజాయ నమః

# సీతారామ ప్రభావము

## తృతీయాశ్వాసము

క॥ శ్రీమైథిలీహృదీశ్వర
తామరసదళాక్ష దేవతామునిజన హృ
త్తామరసనిలయ వృజిన
గ్రామతమ స్సూర్య దనుజఖండన రామా॥
దేవా! యవధరింపుము.

వ॥ అని యిట్లు సీతారామసందర్శనంబు చేయింపుమని మిథిలాపురాంగన లడుగుటయు నయ్యంజనానందనుం డట్లు కానిండనియె. నంతట సుశీలాదేవి జనకరాజాజ్ఞచే నొక్క సువర్ణ రథంబు దెప్పించి రామపాదాయత్తచిత్తలగు వధూజనంబులనుగూడి హనుమతో నయ్యరదం బారోహించి యయోధ్యాపురంబునకుఁ జని రంతట వాయుపుత్రుండు మొగసాలకడ రథంబు డిగ్గి రామసాన్నిధ్యంబున కరిగి విదేహపురనారీ వృత్తాంతం బెఱింగించి మన్నింపు వడసి సుఖంబుండె నంత స్త్రీజనపరివృతయగుసుశీలస్వకీయ పుత్రీరత్నమగు సీతాదేవి మందిరంబున కరిగిన నాలోకపావని యూర్మిళా మాండవీ శ్రుతకీర్తులంగూడి తల్లి కెదురుగాఁ జని నమస్కరించి యర్ఘ్యపాద్యాదులం బూజించి

భోజన పానాదులం దృప్తిగావించి యుచితాసనంబుల
గూర్చుండ నియోగించి యమరీజనపరివృతయగు శచీదేవి
చందంబున సమస్తవిద్యలతోఁగూడిన సరస్వతి పోల్కి
సువర్ణాసనాసీనయై సీతాదేవి తల్లి కిట్లనియె. 1

ఉ॥ పెంచితివెన్ని నాళ్లొ తినిపించితిగుజ్జనగూళ్లు కోరి చే
యించితిరత్నభూషణము లింపగుబంగరుచీరలిచ్చి కా
వించితిసంతసమ్ము చదివించితివిద్యలు జ్ఞానబోధ చే
నించితిమాహృదబ్జములు నీబుణ మేగతిఁదీర్తుమంబరో॥ 2

చ॥ పరిణయమాచరించి మము బంచినదాదిగఁబ్రాణనాథులన్
మరగిసుఖంబులొందుచును మాండవియున్ శ్రుతకీర్తి యూర్మి
ళా। తరుణులు నేనొకప్పుడును దాసిభవత్పదనీరజంబు లా
దరమునఁ గొల్వమైతి మిది తప్పుగ నెంచకప్రోవు మంబరో॥3

ఉ॥ ఎన్నడువచ్చు నాదుహిత కింపలలారుమగండు కాఁపురం
బెన్నడుచేయు సారెలిక నెన్నడువెట్టుదు సత్కుమారులుం
గన్నియలీమె కెన్నటికిఁగల్గుదు రంచుదలంచి దేవతా
సన్నుతులాచరించుతలి సామ్యముగారొకరైన నుర్విలో॥ 4

చ॥ మగని కెఱుంగ జేయక కుమారులకై నఁదదీయపత్నులా
మగువలకైనఁజెప్పక సమస్తపదార్థములంబరంబులున్
నగలుధనంబుగూర్చి జతనంబుగఁగూతులయిండ్లకంపి కా
వగలసవిత్రితోడఁబెరవారలు తుల్యులెమెన్నిభంగులన్॥ 5

క॥ అనియిట్లువల్కి వసుధా
తనయామణి యూర్మిళాదితరుణులతోడన్

జననికిఁ మ్రొక్కిన నామెయుఁ
దనయలదీవించిపల్కె దద్దయువేడ్కన్॥ 6

సీ॥ అత్తమామలయాజ్ఞ లుత్తమాంగముల వ
హించిశుశ్రూషఁ గావించినారు
మేనికినీడచందాన భర్తలనెడఁ
బాయకసంతోష పరచినారు
ఫలవృక్షములరీతి బాంధవ యాచక
శ్రేణుల నెపుడుపోషించినారు
పాలసంద్రమున నప్పంకజాలయభంగి
సత్కీర్తి మాకు నొసంగినారు
యిరుగుపొరుగువార లిఁకముందురాఁబోవు
వారు పొగడునట్టి వర్తనమున
సంచరించినారు చాలదే నాకింత
కూఁతులార వేఱు కోఁరుఁతగలదె॥ 7

ఆ॥ నన్నుఁజూడరంచు నాకోఁగిఁబరిచర్య
చేయరంచునాకుఁ జింతగలుగ
దుండఁదగినచోటనుండి సద్వర్తన
మాచరించుటొప్పు నంగనలకు॥ 8

వ॥ అని వచియించి యూర్మిళా మాండవీ శ్రుతకీర్తులఁ గౌఁగి
లించి యటుపిమ్మట జనకరాజపత్ని సీతాదేవిం బరిరంభించి
తొడపైఁ గూర్చుండఁబెట్టుకొని ముద్దాడి శిరంబు మూ
ర్కొని యిట్లనియె॥ 9

క॥ భోగములు మానుకొని యను
రాగంబున భర్తయైన రామునితో నీ
వేగితి వరణ్యమునకు వి
రాగాశయులైనమునులు రహివినుతింపన్॥ 10

సీ॥ ముండ్లపై రాలపై మోపిచరించు నా
డెంతకందెనో భవన్మృదుపదములు
వగరుకాయలు దుంపలొగి భుజించినవేళ
నెంతనొచ్చెనో భవదీయరసన
చలిగాలి యెండవానలు సోఁకునాడెంత
గా బడలెనో భవద్గాత్రలతిక
కేలుదిండుగఁ జేసి నేలఁబండిన నావి
నెంత డస్సెనొకో త్వగింద్రియంబు
పులులరొదలు సింగముల గర్జనంబులు
వినిన యప్పుడెంత విసుగుదోఁచె
వీనుగవకు నీవు కానలోనుండుచోఁ
గన్నబాధలెన్నఁగా వశంబె॥ 11

ఉ॥ కాననలోఁ జరించుతఱిఁ గంతుజయంతుల ధిక్కరించు నె
మ్మేనుగలట్టి రాముని సమీపమునందున నుంటఁ జేసి యే
గ్లానియుఁ దోఁపలేదని యొకానొక వేళఁదలంతుఁగాని నీ
వా నరనాథుఁ బాసి యెటులోపితె దేహము లంకఁగూతురా॥

సీ॥ పూనూనె యత్తరు పూసిదువ్వెడు నీదు
నెఱికురుల్ జడగట్టెనే లతాంగి

కొమరారు భక్ష్యభోజ్యములు మెక్కిన జిహ్వ
పస్తుల మాడెనే భవ్యశీల
పన్నీరు గంధంబుఁ బ్రాపించు నెమ్మేను
దుమ్ముచే నిండెనే తోయజాక్షి
శారికాకీర నిస్వనములు విను వీను
లదరెనే రాకాసిరొదలఁ దల్లి
యెంతకష్టపడితొ యేమేమి తలపోసి
శోక మొందినావొ సోఁకుపాలఁతి
బారునడుమ మున్ను పాపిష్ఠి లంకలో
నున్న సమయమందుఁ గన్నతల్లి॥ 13

చ॥ దిరిసెన పూవుకంటె నునుదీవియకంటె సరోజపల్లవో
త్కరముల కంటె మార్దవము కల్గిన గాత్రము నిప్పులోన నే
కరణిని మోపితో మరలఁ గందకయేగతి నేగుదెంచితో
సురముని కీశవారములు చూచిరిగాఁ గనులారఁ గూఁతురా॥

ఉ॥ దానములిచ్చినానొ సుకృతంబు లనేక మొనర్చినానొ సు
జ్ఞానులనాదరించితినొ సత్యముపల్కితినో తపంబుబల్
పూనికతోడఁ జేసితినొ పూర్వభవంబున నట్లుగానిచో దానవ
బాధలొందియును దక్కుదువేయిటునాకుఁ గూఁతురా॥15

చ॥ అనుసమయంబునందు మరుదాత్మజుఁడున్ వరలక్ష్మణుండు చ
య్యనఁజనుదెంచిజానకిపదాబ్జములం దలలుంచిమ్రొక్కి య
జ్జనకనృపాలపత్నినొగి సాధువచస్సులగౌరవించి త
క్కినరమణీలలామలను క్షేమములారసి యంతమీఁదటన్ 16

వ॥ సీతామహాదేవి దివ్యాజ్ఞానుసారంబుగా నుచితాసనంబు
లం గూర్చుండి రయ్యవసరంబున వాయునందనుండు జనక
పత్నియగు సుశీలతో నిట్లనియె. 17

తే॥ నీకొమారితయగు కుంభినీకుమారి
సుప్రభావంబు కనులారఁజూచినాడఁ
దొల్లిలంకాపురంబునందుఁగలనాడు
తరమెనావంటివాని కింతయని చెప్ప॥ 18

సీ॥ పదినెలలాహార పానీయనిద్రలు
వర్జించి మేన జీవములునిలిపె
నంజుడుదిండిచానలు చుట్టునిలిచి ని
ష్ఠురములాడినఁ జెవిఁజొనుపదయ్యెఁ
దానొక్కతైయుండి త్రైలోక్యకంటకుఁ
డగురావణునిఁ దృణంబట్లుద్దూరె
సోఁకుబారులు నాదుతోఁకనగ్నిరగుల్పఁ
గా దానిఁబన్నీరు కరణిఁజేసె
నక్కటకటయెన్నియగచాట్లపాలైనఁ
గాని ప్రాణనాథుపైననుండు
భక్తిచేతఁజిక్కఁబట్టె నసువులు నీ
తనయఁబోలు సాధ్వి ధరణిఁగలదె॥ 19

చ॥ జగములనెల్ల నొక్కనిమిషంబునఁ గాల్చుహుతాశనుండు నీ
దగుసుత మంటలోఁబడ సహాయని చల్లదనంబుదాల్చి భూ
రిగరిమ నీమెనారఘువరేణ్యునకిచ్చి నుతింపుచుండఁగా
నగునగునంచు వేల్పులుమహర్షులుబ్రహ్మయు మెచ్చిరంబరో॥

ఉ॥ జానకి లక్ష్మి రాఘవుఁడు చక్రధరుండని బ్రహ్మ చెప్పఁగా
మానివరేణ్యులున్ సురసమాజములౌనని మెచ్చుచుండమా
వానరులెల్ల దానవులు వామలు విస్మయమందిచూచి రీ
చాననుఁ గూఁతుగాఁబడయఁజాలిన తావకపుణ్యమల్పమే॥

వ॥ అని యిట్లువచించిన విని లక్ష్మణుం డుప్పొంగుచుండె నయ్యవసరంబున మిథిలాపురస్త్రీలు సీతామహాదేవి దివ్యపాదారవిందంబులంబడి నమస్కరించి లేచి నిలుచుండి యంజలీబంధంబులుగీలించి యిట్లనిరి. 22

సీ॥ వనజాక్షులారరరండని నీజతకు మమ్ముఁ
ప్రీతి మాతల్లి పిల్పించునాడు
మమ్ములనెల్ల సన్మానించి చెలరేఁగి
వేడుకతో బంతులాడునాడు
ప్రమదావనుల విహారము సల్పుచో మమ్ము
మెచ్చి పుష్పములు పండ్లిచ్చునాడు
శ్రుతకీర్తి మొదలైన సొంతచెల్లెండ్రతో
సాటిగాఁ గోర్కులొసంగునాడు
మనముచల్పునట్టి పనులాటపాటలో
కప్పుడైనఁ దావకాంతరంగ
మందుఁదోఁచునే రవంతైన ప్రేమంబు
గలదె మమ్ముఁజూడఁ గాఁదలంతె॥ 23

సీ॥ మేమందఱము నిన్నుఁ బ్రేమించి మొత్తమై
పగడసాలాడిన భవనములను

మీతల్లియాజ్ఞచే నీతోడజతగూడి
లీలతోనూఁగిన డోలికలను
వనవిహారశ్రమంబు నశింపమాతోడ
జలకేళిసలిపిన కొలఁకుగముల
వేడుకకైమమ్ముఁగూడి వియ్యములాది
మమతతోఁ దిరిగిన మంటపములఁ
గాంచినపుడు నీవుగానరాకుండుటఁ
జేసి మామనములఁ జెప్పరాని
వెతలుగలిగి నీకువెడలును కన్నుల
నేమనంగవచ్చు రామురాణి॥ 24

తే॥ త్రిజగములఁగలయట్టి పతివ్రతలనుఁ
గావ నరజన్మమెత్తిన కలిమి లేమ
వనుచు మద్గురుఁడంజనాతనయుఁ డిపుడు
వాకొనుటఁజేసి నీప్రభావంబు దెలిసె॥ 25

సీ॥ కైలాసమిఁకమీఁదఁ గదలించి భయపెట్టు
వారు లేరనుచుఁ బర్వతకుమారి
నిజనాథు నన్యులునిందించు హేతువు
సమసెనటంచు భాషావధూటి
తనపత్తనంబుపై దాడిచేయు నవత్నుఁ
డీలిగెనంచు శచీలతాంగి
రక్తి స్వేచ్ఛావిహారములు సల్పఁగమంచి
హదనాయెనని దేవతాంగనలును

సంతసించి నీనుచరణరాజీవముల్
ప్రస్తుతించుచున్నవారు దుష్ట
పంక్తికంతు నీవు భర్తచేత వధింపఁ
జేసినందువలనఁ జేతులెత్తి॥ 26

ఉ॥ అంగదముల్ధరించి మణిహారము లొయ్యనవేసి జాళువా
బంగరు చీరెయుఁ రవిక బాగుగఁదాల్చి యొయార మొప్ప
మా । ముంగలనిల్చి నాకుఁదగు ముద్దుమగండు లభించు
టెప్పుడో । యంగనలార యందు వటులబ్బెఁగదా రఘు
రాముఁ డమ్మరో॥ 27

ఉ॥ నీసౌందర్యము నీవిలాసములు నీసిద్ధంబు లావణ్యముల్
నీసౌశీల్యము మేముఁగాంచినపుడీ నీరేజపత్రాక్షి కు
ల్లాసంబిచ్చు మనోహరుఁ జగతిలో లక్షింతు మేయంచుఁ బే
రాసం జింతిలుచుందుమట్టి వగ రామాధీశు చేఁ దీఱెఁగా॥28

శా॥ పాతివ్రత్యముఁ జూపవేయనుచు నీప్రాణేశ్వరుండాడ ని
ర్భీతిన్ నిప్పులలోనఁ జొచ్చి హిమవారిందేలు చందానవై
చేతోధీశునిఁ గూడి లోకముల వాసింగాంచి తీకార్యమే
వాతుల్చేయుదురమ్మ సత్యబలమున్నన్ విస్మయంబొప్పఁగాన్॥

వ॥ అదియటులుండనిచ్చి నీవు రామచంద్రునితోఁ గూడియుండు
నప్పుడు సేవింపఁగోరి వచ్చితి మనుటయు వల్లెయని యాదివ
సంబుఁ గడుప నారాత్రి శ్రీరామచంద్రుండు భోజనానంత
రంబున సర్వాలంకార భూషితుండై సీతానిలయంబునకు
వచ్చుటయు నవ్వసుంధరాతనయ చేటీసమేతయై పూజించె
నంత నయ్యాదిదేవుం డత్తగారిని సవినయంబుగా గౌరవించి

కుశలంబడిగి రత్నఖచితాసనంబునఁ గూర్చుండె నయ్యవస
రంబున భూపుత్రి రామచంద్రున కిట్లనియె. 30

తే॥ మనవివాహంబునాడు మీామహిమలెల్లఁ
గాంచివిస్మయమంది యిక్కాంతలన్య
మునువిసర్జించి మీాపదమ్ములుమనముల
నిలిపిభజియింపు చున్నారునిశ్చలముగ॥ 31

క॥ మనసామీారి మిథిలకుం
జనిమీావైభవము సంతసమునవచింపన్
వినికనవచ్చిన యీాస్త్రీ
జనులఁగటాక్షింపు డనెడుసమయమునందున్॥ 32

చ॥ హాదనిదియంచు నెంచిమిథిలాంబుజనేత్రలు రామచంద్రు శ్రీ
పదములవ్రాలి లేచిభయభక్తులతోనిలుచుండి హస్తముల్
నుదురులమోపి రాఘవ మనోహరరూప జగన్నివాస నీ
రదసమవర్ణ శ్రీకర పరాత్పరయంచు నుతించివేఁడియున్॥33

సీ॥ జగములన్నియుఁ గొల్చుసావినవ్విధిచే స
పర్యఁగైకొన్న ప్రాభవముతోడ
విబుధస్రవంతి కావిఖ్యాతహేతువై
ప్రఖ్యాతిఁగన్న వైభవముతోడ
మునివధూశాపమిమ్ములఁబాపి మితిలేని
మేలొనర్చిన స్ఫురద్ధూళితోడ
జనకభూపాలుచేఁ గనకపాత్రమునఁ బ్ర
క్షాళింపఁబడిన నేస్తంబుతోడఁ

జాచునపుడూరులకుఁ బరిచర్యవేళ
గరములకు మ్రొక్కుకొనువేళ శిరమునకు ము
దంబొసఁగి సీతనేలుమార్దవముతోడ
వెలయునీపాదపద్మము లోకులుతు మెపుడు॥ 34

తే॥ అంజనానందనుండు త్వదంఘ్రియుగముఁ
దలధరించిననాఁడె చంచలకపిత్వ
ముడిగి బ్రహ్మాధిపత్యంబు నొందుకతనఁ
బ్రస్తుతింపంగఁదరమె నీపాదమహిమ॥ 35

చ॥ అలికములుౕ శిరంబులు త్వదంఘ్రియుగంబునఁ జేర్చి భూరిదో
హలమున మ్రొక్కినంతటనె హాటకపట్టములుం గిరీటముల్
కలిగి మహాసుఖంబులనుఁ గైకొనిరంగదుఁ డవ్విభీషణుం
డలఘుపరాక్రమాఢ్యుడగు నారవిపుత్రుఁడ దేమి చోద్యమో॥

చ॥ భరతుఁడు నీపదంబులనుఁ బాసి శరీరము నిల్పలేక త
చ్చరణసరోజరక్షణము సల్పెడు పాదుకలం గ్రహించి సు
స్థిరతరభక్తితోఁ బసిఁడి సింగపుఁబీఁటను నిల్పి పెక్కువ
త్సరములు కొల్చె మాకటుల సాధ్యముకాదుగదయ్య
రాఘవా ॥ 37

తే॥ తల్లిదండ్రుల భోగపదవులఁ బాసి
నిర్జనారణ్యమునఁ జేరి నీ పదార
విందములుగొల్చి యూర్మిళావిభుఁడు ధన్యుఁ
డయ్యెఁ గాకన్యులకు శక్య మగునె రామ॥ 38

మ॥ శరభంగాదిమహామునీంద్రులు తపస్స్వాధ్యాయములుబ్భూరి వ
త్సరము ల్చేసిఫలంబుఁగానక మహాసందేహముల్పొంది నీ

చరణాంభోజయుగంబుఁగాంచగనె మోక్షప్రాప్తులై రాగతిం
దరణోపాయముమాకొసంగఁగదె సీతానాథ వెయ్యేటికిన్॥

ఉ॥ తారలధిక్కరించి ప్రమదంబునఁ జంద్రునిఁ గేలిజేసి సం
సారతమోవితానమునుఁ జయ్యన మాయగఁజేసికాంతి
విస్తారముచేవెలుంగుచును దాసులఁ బ్రోచుభవత్పదాంబుజో
దారనఖంబులెల్లపుడు ధ్యానము చేసెదమయ్య రాఘవా॥

సీ॥ కెందామరలగోటు క్రిందుఁజేసి వెలుంగు
తావక మృదుపాదతలయుగళికి
బంగారు తాఁబేళ్ల శృంగారమునుదూఱి
రంగారుచున్న నీ ప్రపదములకు
మఱ్ఱిపండులనిక్క మాయించి నుతికెక్క
సొగసుగల్గిన పార్ష్ణియుగళమునకు
నిండారుబలుగండ పెండారమున కను
కూలమై వెలయు నీ గుల్ఫములకుఁ
గాహళంబులఁబోలు జంఘలకు భూరి
బంధురములైతనరు నూరుపర్వములకుఁ
జారుకరిహస్తనిభములౌ నూరువులకు
వేలజోహారు లొనరింతు మోలిరామ॥ 41

తే॥ మానికంబులు కూర్చికడానిచే న
మర్పఁబడు త్రాడుగల్గిమామామనములు
కరఁగఁ జేసెదుతావకకటితలంబు
గరలికీర్తింతు మెపుడు సాకేతనిలయ॥ 42

క॥ గరుడునిపై జాంబూనద
హరిపీఠముపై భుజంగమాధీశునిపైఁ
బరగు భవచ్ఛ్రోణులకా
దరమున మ్రొక్కెదము భూసుతాహృదయేశా॥ 43

ఆ॥ భాకినోటిమెకము నాకులంబొందించు
టీకుగల్గి మిగులసైకమైన
నీవలగ్నమునకు నిరతంబుజోహారు
లాచరించెదము ఖరాసురారి॥ 44

సీ॥ నలినాసనుని జననమునకు మూలమై
రాణించు నీనాభిరంధ్రమునకు
నఖిలలోకంబుల కాధారమై సదా
తులకించు భవదీయతుందమునకు
నాదిలక్ష్మికి డోలలగు పూసరులచేత
భాసిల్లునట్టి నీవక్షమునకుఁ
బోకకుత్తుకహారాయల్ పోకార్చి సుందరా
కారమై వెలయు నీకంఠమునకు
నతిమనోహరమైన నీయంసములకు
లీలవెలుగొందు నీబాహుమూలములకు
వినతులొనరించి పరికించి వేవిధముల
సన్నుతించెదమో ధరాజాహృదీశ॥ 45

సీ॥ ఆశ్రయించినవారి కభయప్రదంబులై
పరిపంథులకు సదాభయమొసంగి

పరమనారీకుచోపరిఁ గొల్వుదీరి న
వీనమర్యాదల విఱ్ఱవీగి
పొలుపైన గందంపుఁబూఁతల సొబగారి
పూలమాలికలచేఁ జాలతనిసి
బలుదానముల వనీపకుల దుర్దశలార్చి
భూభారమెల్ల గొబ్బునణంచి
కంకణము లంగదములు చక్కఁగఁదాల్చి
జనకజాతకుఁ బరిరంభసౌఖ్యమిచ్చి
కరికరాభంబులై లలింగ్రాలు నీదు
చేతులునుతించెదము నతుల్చేసిరామ॥ 46

సీ॥ భూపుత్రిమేనిపై మోపుకాలములందు
రహిమీఱ శృంగారరసముఁదాల్చి
గాధి జారుంధతీనాథాదిమునులకా
రసిమ్రొక్కుచో శాంతరసముఁదాల్చి
పరశురామ సముద్ర ప్రబలావలేపముల్
పసదూల్చుచో వీరరసము దాల్చి
దండకాటవి మునీంద్ర స్తోమములకు ను
ల్లస మిచ్చుచోఁ గృపారసముఁదాల్చి
రావణాది దుష్టరాక్షసాళి వధించి
పొసగుసావిరౌద్ర రసముదాల్చి
తక్కరసములెల్లఁ దగువేళఁ దాల్చు నీ
చేతులిచ్చు రామ చిరసుఖములు॥ 47

సీ॥ సీతామహాదేవి శిరమునఁ బోయుచో
వాలాయముగఁ దలంబ్రాలు పట్టి
సాధువులగు మునీశ్వరులకు వందన
మ్ములు చేయువేళ నంజలిఘటించి
హనుమద్భరత లక్ష్మణాద్యనుకూలు ర
నిమురునప్పుడు విలాసముగ సాగి
ఖరరావణాది ముష్కర దానవులఁ జంపు
తఱి ధనుశ్శరము లందముగఁ దాల్చి
యాశ్రయించువారి కజ్ఞాన ముడిగింప
మొనయువేళ జ్ఞానముద్రఁబూని
వెలయు నీకరములు వివిధసౌఖ్యంబుల
నిచ్చుఁగాక మాకు నినకులేశ॥ 48

సీ॥ న్యగ్రోధఫలముపై నగ్రాధిపత్యంబుఁ
జెల్లించు భవదీయ చిబుకమునకుఁ
బద్మరాగములతోఁ బక్వబింబములతో . . .
నాలంబొనర్చు నీయధరములకుఁ
బోలుపారు ముత్తియంబుల మీఱి మగఱాఁతి
పలుకుల నేలు నీపలువరుసకు
మెఱుఁగుటద్దంబుల మేలౌసితాభ్ర శ : :
కలములఁబోలు నీగండములకు
రాణసంపెంగ నెనయు నీఘ్రాణమునకుఁ
గమలములనీసడించు నీకన్నుఁగవకుఁ

జక్కులంబులనేలు నీశ్రవణములకుఁ బ్ర
ణామశతములొనర్తు మోరామభద్ర॥ 49

సీ॥ సత్యవాక్యముల కాశ్రయమైవరములిచ్చి
నిఖిలభక్తులఁబ్రోచు నీదునోరు
నీలాలకముల కావాలమైనిర్మలో
ద్వేలమైవెలయు నీఫాలతలము
సింగాణులకుఁగల చెలువంబునిరసించి
పొంగారుతావక భ్రూయుగంబు
పార్వణచంద్ర బింబముతోడసఖ్యంబు
నెఱపంగఁజాలు నీనెమ్మొగంబు
సుషులుమూడుగలిగి సొగపెన్నెఱులచే
నీటుగుల్కుచుండు నీశిరంబు
మానసంబునందు మఱిమఱిధ్యానించి
కొలుతుమెపుడు సూర్యకులనిధాన॥ 50

తే॥ పగటిదారశేవ భూరివిభ్రాజమాన
మైప్రకాశించు తావకీనాంగదములు
కంకణంబులు గ్రైవేయకములుహార
మకుటములుసన్నుతింతు మేమఱక రామ॥ 51

క॥ లౌకిక భోగములందు ని
రాకరణము నీదుపాదరాజీవములం
దేకాంతభక్తియునుమా
కేకాలముగలుగ వరములీగదె రామ॥ 52

క॥ సీతో సంబంధము మా
కేతటిఁ జెడకుండఁ దావకేతరవస్తు
వ్రాతమున రోఁతగలిగెడు
భాతివరం బిమ్ము పతితపావన రామా॥ 53

వ॥ అని పరమభక్తి తలకెక్కి నుతింపుచున్న వనితాజనంబుల
నాదరించి రాఘవుం డిట్లనియె. 54

క॥ మానవతులార మీ మీ
మానసకమలములు నన్ను మరఁగినకతనన్
హీనత్వం బెడఁబాసె నిఁ
కేనాటికి సంకటంబు లెనయవుమిమ్మున్॥ 55

ఆ॥ పూర్వమందుఁ బుణ్యములచేతఁ బాపనా
శనము చేసికొన్న సజ్జనాళి
లాఁతిపనులుమాని ప్రీతితోననుఁగొల్చు
చుందు రెల్లగతుల సుదతులార॥ 56

ఆ॥ పైనఁ జెప్పినట్టి పద్ధతిగలవారు
మీరుగాన నిట్లపారభక్తి
నాతులారపాడమె నాయందుమీకనా
రతము ధన్యలైతి రితరమేల॥ 57

క॥ కారాశాలలవంటి శ
రీరంబులు బాయుదాఁక ఋజుభక్తి నిదే
తీరునఁ జేయుడు నాదరిఁ
జేరుదురటుమీఁదఁ జింతఁ జెందకుఁడిపుడున్॥ 58

వ॥ అని లీలామానుషవిగ్రహుండగు పరమపురుషుండు పలికిన నమ్మహనీయాంగనలు సీతారాముల సేవింపుచు సుఖంబుండి రయ్యవసరంబున నయోధ్యలోఁ గలకొంద ఱుత్తమజాతి స్త్రీ లొక్కచోటఁ జేరితమలోఁ దామిట్లనిరి॥ 59

ఉ॥ దూరమునందునన్ మెలఁగు తుమ్మెదచాలు మరందలబ్ధికై
నీరజమాశ్రయించుగతి నిర్మలులౌ మిథిలాపురాంగనల్
శ్రీరఘురాము నంఘ్రులు భజించిరి తమ్మికిఁ జెంతనుండుశా
లూరము లట్టులన్ మనము లోపముజెందితిమేమి పాపమో॥

ఆ॥ శైశవంబు మొదలు జనకజానాథుండు
చేసినట్టి దివ్యచేష్టలెఱిఁగి
యాశ్రయించమైతి మవ్విదేహస్త్రీలు
తెలిసికొలిచి రొక్కదినమునందె॥ 61

ఆ॥ ఆడువారమగుట నభిమానమున సంశ
యించి బందుగులఁ ద్యజించ వెఱచి
రామచంద్రుపాద రాజీవముల నాశ్ర
యింపనేరమైతి మింతులార॥ 62

ఆ॥ తెంపులేక విడదు దేహాభిమానంబు
తెంపులేక భక్తి తేటపడదు
తెంపులేక విష్ణుదేవుండు దొరకడు
తెంపులేక రాదుదివ్యపదవి॥ 63

ఆ॥ తెంపుసేసి యివ్విదేహకాంతలు రఘూ
త్తముని ప్రాపుఁగాంచి ధన్యలైరి

మనము తెంపులేక మాలిన్య సంసార
వార్థిఁబడితి మమ్మ వనితలార॥ 64

ఆ॥ అనుచు బహువిధముల నాలోచనలొనర్చి
యవ్విదేహకాంతలందుఁ గలసి
వాతసూతిబోధచేత రామప్రభా
వంబెఱింగి చిరసుఖంబుఁ గనిరి॥ 65

వ॥ వీరి యానందం బిట్టులుండ నొక్కసంవత్సరంబు కడచె నంత లంకాపురంబున నొక్కనాఁడు విభీషణుని సన్నిధికిం జని రాక్షస స్త్రీ లిట్లని రయ్యా! మహాపాతకుండగు మీయన్న రావణుండు మమ్ముల నిర్బంధించి యశోకారామంబునఁ గాఁపుంచుటం జేసి యరుంధతీ సమానయగు భూపుత్రినిఁ దర్జన భర్జనంబులచే వేధించితి మప్పాపంబునకు మాఱుగా రావణ వధానంతరంబున మమ్ముల జంపుట కుద్యోగించిన హనుమంతుని నివారించి జనకపుత్రి మమ్ముల రక్షించె నయ్యుపకారంబుఁ దలంచినప్పుడెల్ల మాహృదయంబులు కరగుచున్న వెందుకంటివేని. 66

సీ॥ వినుటకు మరల వాకొన వీలుగానట్టి
పరుషవాక్యము లెన్నొ పలికినాము
ఖండించెదము చూడు మండ నీకెవరంచు
మించి యాయుధము లాడించినాము
పొడిచెద మిదుగొ మాకడిమిఁ జూడుమటంచు
నెనలేని శూలంబులెత్తినాము

క్రింగెద మిసుగా నూసంగతిఁ గనుమంచు
నొప్పుగాఁ బెనునోళ్లు విప్పినాము
పాపకర్ముఁడైన పంక్తికంధరు నాజ్ఞ
నెన్నిగతుల మేము తన్నుబాధ
పరచియున్నఁగాని పాటింపకుండ భూ
పుత్రియసువులిచ్చి ప్రోచెమమ్ము॥ 67

సీ॥ తనకుఁగీడొనరించెననిగదా కోపించి
జనని కనూరుండు శాపమిచ్చె
తనశాసనముమీరెననిగదా జమదగ్ని
రేణుకజంపఁ బ్రేరించెసుతులఁ
దననిద్రవితసేసెననిగదా మునుజర
త్కారుండు భార్యపైఁగనలివిడిచెఁ
దనమాటవిననేరరనిగదా సుతుల వి
శ్వామిత్రకర్మంది చావఁదిట్టెఁ
దప్పుగల్గెనేనిఁ దనవారినైనదం
డించినారుగాని మంచిలేని
ఖలురమైనమమ్ముఁ గాచినభూపుత్రి
వంటివారుగలరె వసుధయందు॥ 68

సీ॥ జఠరాగ్నినోర్చి భోజనపానములుమాని
మాసదశక ముపవాసముండె
హనుమతోఁకకు సోఁకులంటిం మఱి ఖనిఁజం
దనముచందాన శీతలమొనర్చె

శీతలంబగువహ్నిచే నిండ్లుగాల్పించి
మనుజాశనులఁ దాఱుమాఱుసేసె
వీతిహోత్రుని భయపెట్టినట్టిదశాస్య
నిజతపోమహిమచే నీఱుసేసె
నగ్నిలోనఁబడి హిమాంబువులోఁదేలు
కరణిలేచిరాముఁ గలసిమెలఁగె.
మునులచేతవేలుపులచే నుతులుగాంచె
జగతి సీతఁబోలు సాధ్విగలదె॥ 69

వ॥ అని పల్కుచున్నతఱి వారలనివారించి సరమ విభీషణున
కిట్లనియె. 70

ఆ॥ నాకుఁదల్లిదండ్రి నాకులదైవంబు
నానిధానమగు జనకకుమారి
చరితమిపుడువీరు సన్నుతించుటఁజేసి
సాటిలేని సంతసంబుపొదలె॥ 70

సీ॥ ఈమహీజముక్రిందనేగదా భూపుత్రి
హారామ రాఘవా యనుచు నడలె
నిచ్చోటనేగదా యినకులాధిపు పత్ని
పంక్తికంఠునిదూఱి పాఱఁదోలె
నీవృక్షమూలమందేగదా సీతకు
శ్రీరామవార్త వచించె హనుమ
ఈస్థానమునఁగదా స్వస్థయై భూపుత్రి
నాతోడ సంభాషణము లొనర్చె

నని యశోకవనమున కే జనిన వేళ
జానకీదేవి విషయముల్ జ్ఞాపకంబు
వచ్చినప్పుడు గుండియల్ విచ్చునట్లు
దిగులుమోపయ్యె నేమని తెల్పవచ్చు॥ 71

చ॥ తనపతితోడఁగోసల పదంబున కేగెడువేళ ధారుణీ
తనయమదీయమూర్ధమునఁదత్కరపద్మము మోపి సౌఖ్యముల్
కనుము సఖీయటంచుఁ గుతుకంబుననిచ్చిన దీవెనల్ మనం
బునఁదలపోయుకాలమునఁ బుట్టెడుసంతసమేమి చెప్పుదున్॥

సీ॥ సీతామహాదేవి శ్రీరాముచంద్రుతోఁ
గొలఁకుల జలకేళి సలుపువిధము
జనకకుమారి కౌసల్యాసుతునితోడఁ
దివిరి పూఁదోఁటలఁ దిరుగునేర్పు
వైదేహి శ్రీరఘువరునితోఁ జంద్రశా
లాదులఁ బగడసాలాడురీతి
మైథిలి రామునిమరఁగి శయ్యాగృహం
బులయందుఁ గైకొను బలుసుఖములు
తొడరి చూచుటకుఁ గుతూహలమగ్గల
మయ్యెఁగాన నన్ను నాదరించి
పైనమైతివేని ప్రాణముల్ నిలుచును
లేనియెడల నిల్పలేను నాథ॥ 73

వ॥ ఇట్లుపల్కుచున్న సరమారాక్షసాంగనల వాక్యంబు లాద
రించి విభీషణుండు వారితో నంగనలలారా! మీకు సీతా
రామభక్తి జనించుట కెంతయు నానందంబయ్యె మీ

జన్మంబులు ధన్యంబులయ్యెఁ దొల్లి రామచంద్రుండు తన వియోగంబున కోర్వలేని నన్నుం గాంచి ధనుర్మాసంబున మత్కులదైవతంబగు రంగనాథుని యుత్సవంబు జరుగు నక్కాలంబున సపరివారుండవై రమ్మని సెలవొసంగె నయ్యుత్సవకాలం బిప్పుడె తటస్థించెఁ గాన మీయుద్దేశం బులును దాని కనుకూలంబులయ్యె నని ప్రార్థనాపూర్వ కంబుగాఁ గుబేరపుష్పకంబుఁ దెప్పించి యవ్విభీషణుండు మంత్రిచతుష్టయంబుతోడను సరమారాక్షస స్త్రీలతోడనుఁ గూడి పుష్పకవిమానంబెక్కి బయలుదేఱి యెడనెడఁ బత్త నంబులు పల్లెలు వనంబులు సలిలాశయంబులు దాఁటి యయోధ్యకేగి తానొక్కండు మాత్రము విమానం బవరో హించి శ్రీరామచంద్రుని సన్నిధి కరిగి తదీయ పాదారవిం దంబులంబడి నమస్కరించి లేచి నిలుచుండి చేతులు జోడించి॥ 74

తే॥ ఆవునెడఁబాయు వత్సమట్లయ్య నిన్నుఁ
బాసి లంకాపురికి నేగి పాపకర్ము
లైన రాకాసిమూఁకతో ననవరతము
కాలమెల్లట్లొ గడపితిఁ గానలేయ॥ 75

క॥ నినుఁ బాసియున్న దినములు
ఘనవర్షములై చతుర్యుగములై చతురా
ననఘస్రములై యటుపైఁ
బెనుకల్పములగుచు దోఁచెఁ బృథ్వీశవరా॥ 76

మ॥ రవివంశోత్తమ నీపదంబులకు దూరంబా దినంబాదిగా
భవవారాశిమునింగి భార్యలనుచుఁ బంధూత్కరంబంచుఁ బు
త్రవరండంబు లటంచు నెంచుటకు సాధ్యంబయ్యె నేకాని రా
ఘవ రామాయని నిన్నుతించుటకు వీల్గాదయ్యె సీతాపతీ॥77

ఉ॥ ఎంతటి యోగికైనను జయింపఁగ సాధ్యముగాదు సంసృతి
ధ్వాంతము నీదయార్ణవ సుధారసమించుక సోఁకుదాఁక ర
వ్వంతసుఖంబుచేకుఱ దహోయటులౌట భయంబుఁజెంది మీ
చెంతవసింతమన్న నిరసించితి రెవ్వరు దిక్కు రాఘవా॥ 78

చ॥ అది యటులుండనిమ్ము జగదాశ్రయ మామకలంకనుండి వ
ల్వదనుచుఁ జెప్పినన్ వినక వచ్చిరి రక్కసి లేమ లెల్ల మీ
పదములు భూమిజాచరణ పద్మములంగనువాంఛమానవుల్
బెదరుదు రేమొ వీరుకనిపించిన నెచ్చట నుంతుఁజెప్పుడీ॥ 79

వ॥ అప్పలుకులకలరి రామభద్రుండు హనుమల్లక్ష్మణులఁ
బిలిపించి వారితో మహాత్ములారా! మనకంతరంగుండగు
విభీషణుండు వచ్చెంగావున మంత్రి చతుష్టయసమన్వితుం
డగు నతని నొక్క భవనంబునందుంచి సరమను సీతకడకుఁ
బంచి తక్కిన రాక్షసస్త్రీల నొక్క సౌధంబునందుంచి యుచి
తాహారంబులొసంగి నాల్గువైపులఁ గవాటంబులు బంధిం
పుడు. తెల్లవారినపిమ్మటఁ బౌర బాంధవ జనంబులానందంబు
నం జూడంగలరని నియమించిన వారలట్లు కావించిరనంత
రము సరమామణి సీతాదేవి సన్నిధానంబున కరిగి తత్పా
దపద్మంబుల కెఱఁగిన నభూభపుత్రి యద్దానవాంగనను లేవ

నెత్తి కౌఁగిలించి సువర్ణాసనంబునం గూర్చుండఁబెట్టి
పుణ్యాంగనా పరివేష్టితయై సరమతో నిట్లనియె. 80

చ॥ మొగమునమందహాసమును మోవులనెఱ్ఱదనంబు మేనిలో
నిగనిగరంగు యానమున నీటు కుచంబులయందునుబ్బు వా
లుఁగనులయందుఁజంచల విలోకనముల్ గనరావు నీమదిన్
దిగులుగలట్లుతోఁచెదవు తెల్పుముకారణమేమొమానినీ॥ 81

ఆ॥ కండబలుపులేక కనకసన్నిభమైన
కాంతిలేకకప్పు గలిగినీదు
గాత్రమిపుడునాకుఁ గనిపించుచున్నది
దేమికారణంబొ కోమలాంగి॥ 82

క॥ తనయలు తనయులు ప్రమదా
వనములు లోగిండ్లు కన్నవారలు దాసీ
జనములు ధనములు గుఱ్ఱము
లనువగు నేనికలు సేమమగుఁగాదె చెలీ॥ 83

ఉ॥ రావణుఁడల్గి నీమగని రాజ్యమునుండి తోలంచినప్పుడుం
బావనులైన రాఘవులు పన్నగపాశము లొందినప్పుడున్
హావళిఁజెందియున్ననను నాదరణంబున దేర్చినప్పుడున్
నీవిటుదైన్యముంగనవు నేటికిఁ బొందితివేల చెప్పుమా॥ 84

వ॥ అవ్వచనంబులకు మాఱుగా సరమ యిట్లనియె. 85

క॥ చిరకాలంబు భవత్పద
సరసిజములుకొలిచి భూరిసంతోషంబున్
మరగిన చిత్తము చింతా
భరయుక్తంబయ్యె నిన్నుఁబాసినకతనన్॥ 86

తే॥ పెన్నిధానంబుఁగోల్పోవు బీదభంగిఁ
బాడి మొదవునుఁ బాయు లేదూడపగిది
జలములకు దూరమైన మత్స్యంబుపోల్కి-
బాధఁలొందితి నిన్నెడఁబాసితల్లి॥ 87

సీ॥ శ్రీరాముఁ దలఁచి నీవారాట మొందిన
కుజముచెంతకుఁబోయి కొంతసేపు
సతులచే మంగళస్నానంబు నీవు గై
కొన్నచోటికిఁబోయి కొంతసేపు
రావణాదులఁజంపి రాముండు నీకుఁ జే
కుటినచోటికి నేగి కొంతసేపు
శిఖిచేఁ బాగఁద్దఁగాంచి మనోహరుని నీవు
కూడినదెస కేగి కొంతసేపు
మగనితోడ నవ్విమానమిూ వెక్కి-ప్ర
యాణమైనచోటి కరిగి కొంత
సేపుసూచి నీ సురూపంబు గానక
తల్లడిఁపుచుందుఁ దల్లి నేను॥ 88

సీ॥ రామవియోగభారమున నీవేడ్చిన
వగనుండు కోవెలస్వనము విన్న
బలుమాఱు నీవు సంభాషించినట్లుండు
కీరమాలాపించు తీరువిన్న
రాముఁగన్గొన నీవు రహినేగినట్లుండు
నింబా మరాళయానంబుఁ గన్న

రామాంకమున నీవు రాజిల్లినట్లుండు
చెలఁగు నీలముపైఁ బసిండిగన్నఁ
గాని వస్తుయథార్థంబులోనఁ దెలిసి
నంతనే నీవుగావని చింతనొంది
కాలుచుండెను త్వద్వియోగశిఖచేత
మామకాశయ మేమందు భూమిపుత్రి॥ 89

క॥ తులువయగునలువ నన్నా
పొలదిండి కొలంబునందుఁ బుట్టింపక నిన్
గొలిచెడు దాసీజనచయ
ములలోఁ సృష్టింపరాదె మునుకృపయున్నన్॥ 90

సీ॥ ఇనకులేంద్రుని రాక నెఱిఁగించి నినుఁబొంగఁ
జేయు చేడియలు జేజేలకంటె
మీదంపతుల దివ్యపాదాంబుజమ్ము లి
మ్ములనొత్తులేమ లమ్మునులకంటె
రాముమాటలు నీకు నీమాట లతనికి
వినుచు చానలు పల్కు వెలఁదికంటెఁ
బాన్పున నిన్ను నీపతినిఁ జేరిచికాంచు
తెలిగంటు లాశచీదేవికంటెఁ
గాసలేయుని నినుఁ బరిహాసవాక్య
వితతిలాలించి నవ్వించి వినుతిసేయు
సరసిజాక్షులు స్వాధ్యాయపరులకంటె
భూరిసుకృతాత్మలౌఁగదా భూకుమారి॥ 91

సీ॥ పూలదండలుగూర్చు పొలఁతిగానైన న
న్నుంచితివేని లాలించినట్లు
జలకంబు లాడించు చెలియగానైనఁగా
వించితివేని రక్షించినట్లు
పాదముల్కడిగెడు పనికత్తెగానైనఁ
జేసితివేని మేల్చేసినట్లు
తల్పముల్ సవరించు దాసిగానైన శా
సించితివేని మన్నించినట్లు
నన్నటులఁగాక రాకాసులున్న లంకఁ
జేరుమాయని మరలవచించితేని
కనికరముమాని జమువీటి కనిచినట్లు
మనమునఁ దలంతునిఁక వేయిమాటలేల॥ 92

తే॥ క్షణము సుఖమిచ్చి రెండవ క్షణమునందుఁ
గష్టమొనఁగూర్చు తుచ్ఛభోగములనమ్మి
పోవఁగాఁజాల సంతతంబును సుఖంబు
లిచ్చుమీదాస్యవైభవమిమ్ముతల్లి॥ 93

ఉ॥ అన్నగనిట్టులాడి సరమాంగన భూతన యాంఘ్రిపద్మముల్
కన్నులనద్ది ఫాలఫలకంబున మోపి యనేకరీతులన్
సన్నుతిఁజేసి నేలఁబడి సారెకుమ్రొక్కుచు లేచుచుండ న
క్కన్నియ భక్తిమెచ్చుకొని కౌఁగిటఁజేరిచి సీతయిట్లనున్॥

సీ॥ కఱకు రాకాసిమూఁకలచే వ్యసనమొందు
తఱి బహుగతుల నోదార్చినావు

బాంధవజనులు కన్పడని కాలమునందు
నీవె స్వజనముగా నిలిచినావు
ఖల నిశాచర మర్మములు దెల్పుమని నీప
తిని నావిభుని చెంత కనిచినావు
పగవారి చావు మత్ప్రాణేశు జయమప్పు
డప్పుడారసి వచ్చి చెప్పినావు
స్వజనయిత్రికంటె స్వసకంటెఁ బ్రేమతోఁ
జూచినావు ముదము రేఁచినావు
తెలిసి నీఋణంబు దీర్పంగ రాదెన్ని
భవములందునైన భవ్యశీల॥ 95

మ॥ అతివా నన్నెడబాసి నీవెటుల దీర్ఘాయాసముం గాంచి త
గ్గతి నిన్నాయుటలాదిగా దిగులు నేఁ గైకొంటి నీవంటి దీ
క్షితిలోఁ గల్గునె మూడుకాలముల మజ్జీవంబు లిమ్మేనిలో
నతుకం జేసిన దీవుగాదె కలలోనైనం దలంతుం జుమీ॥ 96

తే॥ భామినీ నీవు నన్నెడఁ బాసినంత
బ్రతుకలేనని యిచ్చోట సతతముండు
పనులు గల్పింపుమని యార్తిఁ బల్కుచుంటి
వది తగునె నీకు మగనాలి వగుదుగాదె॥ 97

ఆ॥ భర్తఁగూడి నీవు బ్రహ్మకల్పము దాఁకఁ
జిరసుఖంబు యశము సిరులుగల్గి
భూరిసద్గుణంబు లారోగ్యమునుఁగల్గి
చింతలేక ధర వసింపవమ్మ॥ 98

క॥ మహిమఁజూడఁ బ్రేమగలిగిన
సమయంబున జేనితోడ సరగున మాదే
శము రావచ్చును తక్కిన
సమయంబుల లంకనుండి సౌఖ్యము గనుమీ॥ 99

క॥ ప్రారబ్ధానంతరము శ
రీరంబులు వాసి నీదు ప్రియుడును నీవుం
జేరుదురు పరమపదమ
చ్చో శ్రీరాముని నన్నుఁ గొలిచి సుఖపడవచ్చున్॥ 100

చ॥ అని యలరించి తల్లి మొదలైన విదేహ పురాంగనామణీ
జనములకున్ స్వకీయులగు చానల కర్తల కవ్విభీషణాం
గనమును చేసినట్టి యుపకారము లద్ధరణీకుమారి చె
ప్పినఁగొనియాడిరందఱునువిస్మయమందుచుసారెసారెకున్॥

వ॥ తదుపరి నెక్కడివారక్కడ సుఖనిద్రఁజేసి రమ్మఱునా
డరుణోదయంబున శ్రీరామచంద్రుండు సభాభవనంబున
రత్నసింహాసనాసీనుండై సమస్తజనంబులఁ బిల్వనంపిన మం
త్రిసామంత వైతాళిక పరిహాసక విదూషక కవి బుధ ప్రము
ఖులును భరతలక్ష్మణశత్రుఘ్నాంజనేయులును శ్రీరాముని
బరివేష్టించి కొలిచియుండి రాసమయంబున రామాజ్ఞం
గైకొని సీతాదేవి జననీప్రభృతిమిథిలాంగనా చయంబుల
తోడనుఁ బురాంగనా సమూహంబులతోడను సరమ
తోడనుఁ గలసి యొక్క సువర్ణాసనంబునఁ గూర్చుండి
యుండె నప్పుడు విభీషణుని నల్వురుమంత్రులు రామశాస
నంబు శిరసావహించి రాక్షసస్త్రీలం దీసుకొనివచ్చి సభా

సదనంబునకుఁ గించిద్దూరంబున నిలిపి చేతులెత్తి సభాసదు
లారా! తొల్లియశోకవనంబున సీతామహాదేవికిఁ గావలి
యున్నవారు వీరేయని చూపించుటయు నాసామాజికు
లాశ్చర్యభయంబులతోఁ జూచుచుండి రంతలో భూసుతా
సమీపంబునం గల మానిను లిట్లనిరి॥ 102

సీ॥ చీలమండలదాఁక వ్రేలాడెనీ బోటి
కెంతెంతచన్నులే యింతులార
కరిహస్తములలీలఁ గ్రాలుచున్నవి దీని
పెదవులెంతెంత యోసుదతులార
పెనుగట్టుగవులట్లు తనరుచున్నవి దీని
ముక్కుగ్రోల్లుచూడరే ముదితలార
తలయెంత వెడలుపై వెలయుచున్నదో దీని
కారసిచూడరే నారులార
కటికిచీఁకటి నూఁతు లిక్కాఁతకనులు
పాఱచిప్పలుదీని యభ్రపురదములు
గడ్డపాఱలుదీని కేర్పడ్డ వ్రేళ్లు
వింతపరికించరమ్మ యోవెలఁదులార॥ 103

సీ॥ గున్నచింతనుఁబోలెఁ గూర్చున్నరాకాసి
చెవులుచేటలుగదే చెలువలార
కడతెల్లనరసినిల్కడఁ గాంచుదానవి
నోరెంతపెద్దదే నారులార
సారిదిసభ్యులఁదొంగి చూచునక్తంచరి
తొడలుమ్రాఁకులుగదే పడఁతులార

కన్నొకటిగల్గి చరణమొక్కటియె గలిగి
కేలొకటిగల్గి పెద్దమీసాలుగలిగి
యడ్డమగుముక్కు గలిగి యున్నట్టివారిఁ
జూచితిరెకన్నులార మోసుదతులార॥ 104

సీ॥ పులిగోళ్లగెలిచి పన్నులుగాంచు గోరులు
సింగంబులైన హసించురోదలు
పర్వతంబులనైనఁ బగిలించు పిడికిళ్లు
గౌరులనైన మ్రింగఁగల నోళ్లు
శిలలనేనియుఁ బిండిచేయు దంతంబులు
కత్తులకైనఁ దెగనియొడళ్లు
పెనుగొండ చిలువల కెనయైన నాలుక
ల్తాళవృక్షంబులఁ బోలుతొడలు
నుక్కుకడ్డీలఁబోలిన పెక్కునరము
లక్కజంబుగఁ గల్గి పెంపెక్కినట్టి
యీనెలంతలఁ గాంచిన నెంతవార
లైన సాధ్వసమొందరే యతివలార॥ 105

వ॥ అని పెక్కుచందంబుల విస్మయాలాపంబులాడి యాడి య
మ్మానినీ జనంబు లవనీసుతను వీక్షించి॥ 106

సీ॥ వేల్పుమూఁకలనైన వెఱపించు వీరియా
కారంబు లెమ్మాడ్కిఁ గాంచితమ్మ
పాపిష్ఠులగు వీరి పరుషవాక్యంబులు
క్రేవల నెట్లాలకించితమ్మ

దయయనుమాట సుంతయులేని వీరితోఁ
గాలమేచందానఁ గడపితమ్మ
మనుజుల మాంసంబు దినునట్టి వీరితోఁ
బదినెల లేరీతి బ్రతికితమ్మ
కనికరముతోడ మానవాకార మొంది
నట్టి లక్ష్మివిగాన లక్ష్యంబులేక
బ్రతికితివిగాని మాబోటి భామలిట్టి
రక్కసులఁగన్న నీల్గరే దిక్కుమాలి॥ 107

వ॥ అనుచున్న సమయంబున రామపత్నిని సమీపించి తదీయ దివ్యాంఘ్రిసరోజంబులకుఁ బ్రణమిల్లి తమ్ముఁగాంచి బెదరుచున్నవారి నూరడించి భూపుత్రి కిట్లనిరి. 108

ఆ॥ బ్రహ్మమొదలుచీమ పర్యంతమునుఁగల
భూతములకు నీవు మాతవగుటఁ
జేసినీకుఁగల దయాసమృద్ధిజగంబు
నందుఁబొడమ దాకరిత్రైనఁదల్లి॥ 109

ఉ॥ వాడిగలట్టి శూలములు వాలములుంగొని మేములంకలోఁ
నేడుచునిన్నుఁగాంచి బెదరించనిఘుస్రము లేదు లేదు పె
ల్లాడనినిష్ఠురంబు తెగనాడనిపూటయు లేదుగాని య
క్కీడుదలంచకుండ బ్రతికించితివి నీకృపనెన్నశక్యమే॥ 110

మ॥ సిరులెల్లప్పుడొసంగి లోకముల దాక్షిణ్యంబుతోఁ బ్రోచునిం
దిర వౌనిన్నిటుబాధపెట్టితిమి సందేహంబులేకుండ న
ద్దురితంబేగతిఁ బాయునోయని మహాదుఃఖంబువాటిల్ల నీ
చరణాబ్జంబులు గొల్వవచ్చితిమి కౌసల్యాజనీ జానకీ॥ 111

మ॥ గరిమన్ లక్ష్మణుపై విదేహపతిపై గౌసల్యపైనూర్మిళా
సరసీజేక్షణపై సుమిత్రపయి నాసామీరిపైఁ దల్లిపై
వరశత్రుఘ్నునిపై లలిన్ భరతుపై వర్తిల్లుచున్నట్టి మీ
స్థిరకారుణ్యముతోడ మమ్మెపుడు రక్షింపందగున్ జానకీ॥

శా॥ మున్నే పాపములాచరించితిమొ దుర్మోహంబుచేఁ గానిచో
నిన్నీచంబగు దైత్యవంశమున నింతేకాక యాలంకలో
బన్నంబుల్ కలిగించురావణుని సంబంధంబులో వాని చే
సన్నం జెయ్యవలోనర్చునట్టివిధితో జన్మంబు లెట్లబ్బెడున్॥

మ॥ వశమాకాదు హృషీకసంచయము దుర్వ్యాపారమా మెం
డు కా!కశనం భాపలలంబు నిశ్చలవరిష్ఠాచారమా లేదు దు!
ర్యశమానైజము వైరులామునులు సర్వాదిత్యులీ ఘోరక!
ర్కశర క్షోభవమేలచేసెనో కొవాకాంతుండహాభూమిపై॥

మ॥ ఖరుపై దూషణుపైఁ ద్రిశీర్షుపయి శక్రద్వేషియా రావణా
సురుపైఁ దాటకపై విరాధుపయినా సుగ్రీవవిద్వేషిపై
శరసంఘాతములేసి నీవిభుఁడుమున్ జక్కాడుచందానమా
దురితంబుల్ వినశింపఁ జేసి వగపుల్ తూలింపుమంబా కృపన్॥

శా॥ లేరా క్రొత్తధులుర్విలోఁ జనువరా లీలావతుల్ నిర్మలా
పార ప్రేమ భజింపరా మగల సంపాదింపరా కీర్తు లిం
కేరీ నీగతి పాపరాధులను హాయింగూర్చి రక్షించు స
త్కారుణ్యాత్ము లయోనిజాతలు త్రిలోకస్తుత్యపాదాంబుజా॥

శా॥ క్షారంబైన పయోధినీరములు మేఘప్రాప్తిచే మాధురీ
స్ఫారాసారముగా ధరంబడి లలిన్ సస్యంబులంబ్రోచు మే

మారీతిఁ భవదంఘ్రిపద్మనుతిచే నంహస్సులంబాసి వి
స్తారానందముఁగూర్తు మీజగతికో తల్లీ ధరానందనా॥ 117

మ॥ సురపై మాంసముపైఁబరాపకృతిపైఁ జూదంబుపై నిందపైఁ
గరవాలంబులపై నిశాచరులపైఁ గాఠిన్యభావంబుపై
దురితక్రీడలపై గుచిన్మరఁగు మాదుస్స్వాంతము ల్త్రిప్పి నీ
చరణాబ్జంబుల నిల్చునట్టులుగ వే సల్పంగదే జానకీ॥ 118

మ॥ వరయజ్ఞంబులపై సురాంగనలపై వాచం యమశ్రేణిపైఁ
నరసంఘంబులపై సుపుణ్యములపై నానానిలింపాళిపైఁ
పురుకోపంబు వహించుమాహృదయము ల్పాతంబుగాదిద్దినీ
చరణాంభోజములందు నిల్చుగతి వేసల్పంగదే జానకీ॥ 119

సీ॥ బంగారు మంటిలోపల బూడ్చిపెట్టిన
జిగియును వెలయు నశించనట్లు
మల్లెపూవులు మాలపల్లెలోఁ బూచినఁ
బ్రబలసౌరభ్యంబుఁ బాయనట్లు
నెఱిముత్తియము లుప్పునీటిలోఁ బుట్టిన
విపులమౌ గరువంబు విడువనట్లు
సొంపైన విరిదమ్మి రొంపిలోఁ గలిగినఁ
గాని గొప్పతనంబు మాననట్లు
లక్ష్మివగు నీవు మనుజకులంబునందు
లీలఁబొడమినఁ బ్రకృతి మాలిన్యచయము
లంటనేరవు సుజ్ఞానులైనవార
లిదియెఱుంగుదు రజ్ఞాను లెఱుఁగలేరు॥ 120

సీ॥ నత్తలు దినుకొంగ ముత్తంబు లెఱుఁగునే
పొంగారు పొందమ్మి పూలసౌరు
టకటొంకుగల కుక్కుటంబు లెఱుంగునే
విలువగలట్టి కెంపుల తెఱంగు
పోరటసాధనములౌ గరిసె లెఱుఁగునే
కమనీయమైన శాకముల సొంపు
మలభక్షణ మొనర్చు బలిభుక్కు లెఱుఁగునే
గొనబారు చిగురుటాకుల మృదుత్వ

మావిధంబున లోకావనార్థమగుచు
నవతరించిననిన్ను రాఘవు నెఱింగి
సన్నుతింపరు పాపిష్ఠిజానపదులు
జనకభూపాల పుత్త్రి విష్టపపవిత్రి॥ 121

సీ॥ పానీయమిశ్రమౌ పాలువేఱుగఁదీసి
రహిమీఱఁద్రావు మరాళమట్లు
నీరసపుష్పముల్ నిరసించి పద్మమ
రందమానెడు బంభరంబుపోల్కి
నానాపదార్థముల్ మాని చక్కెరలోనఁ
జేరికోరిభుజించు చీమజాడ
గొమ్మలు చిగురు లాకులుత్రోసి మామిడి
ఫలములాసించు రాచిలుకపగిది

బ్రహ్మవేత్తలు మాయాప్రపంచసౌఖ్య
జాలమునుదాటి నీపదాబ్జములుగోరి

సన్నుతింతురు ఋజుభక్తి సహితులగుచు
జనకభూపాలపుత్రి విష్టపసవిత్రి॥ 122

సీ॥ చిలుకకుఁబద్యంబు సెప్పవచ్చునుగాని
కాకంబునకు నేర్పఁగాఁ దరంబె
లలి నెద్దుచేబండి లాగింపనగుఁగాని
కుక్కచేలాగించుకొన వశంబె
యెకరింత నెక్కి యూరికిఁ బోవనగుఁగాని
పయనింపశక్యమే పందిచేత
నశ్మసారము హేమమగుఁగాని యుప్పరు
సంబుచే ఘటశకలంబటగునె

జ్ఞానవంతులైన జనులకుమీప్రభా
వంబెఱుంగఁ జెప్పవచ్చుఁగాని
ఖలుల కెఱుఁగఁజెప్పఁగాసాధ్యమే పద్మ
భవునకైన రామభద్రపత్ని॥ 123

సీ॥ వేడ్కగంధపుఁజెక్క వీపుపైమోపిన
ఖరమారయునె దాని పరిమళంబు
నిజలలాటమున మానికముగట్టిన దున్న
పోతెఱుంగునె దాని జాతిమహిమ
కోరిబంగారు కోటీరముంచిన శున
కం బెఱుంగునె దానిగౌరవంబు
తీరుగామంచి పన్నీరుచిల్కిన వరా
హం బెఱుగునె దానికైనవిలువ

పతితపావనమా మీప్రభావమోలి
బుధవరులు చెప్పుచుండినఁ బుణ్యహీను
లైన జనులాలకింతురే యధికభక్తి
జనక భూపాలపుత్రి విష్టపపవిత్రి॥ 124

సీ॥ చెలరేఁగి చెరలాడు జింకలు కంఠీర
వధ్వానమును విని వడకినట్లు
పొలమున మేయు మేకలు గొఱ్ఱియలు పెద్ద
పులిఁ జూడగనె పాఱిపోయినట్లు
చకచక దిరుగు మూషికపాళి బుసకొట్టు
విసదారిఁ జూడగాంచి వెఱచినట్లు
స్ఫుటలెత్తి యాడు సర్పములు మయూరకే
కారవంబాలించి యడలినట్లు

మిమ్ముదూషించు దుష్టులు మీప్రభావ
వేత్తలగు వారిఁగనిన వెల్వెల్లఁబాఱి
యదరి పాఱెదరమ్మ దైన్యమువహించి
జనక భూపాలపుత్రి విష్టపపవిత్రి॥ 125

ఆ॥ మిగుల విబుధుఁడైన మీభక్తిలేని మా
నవుఁడు మిమ్ము దూషణంబొనర్చు
దుండగీంద్రుఁగాంచి దండించకయె యుదా
సీనుఁడై తొలంగి చేటుఁగాంచు॥ 126

ఆ॥ కత్తిచేతలేని గండరగండని
ఖాతివిద్యలేని భాగవతుఁడు

మిమ్ము దూఱుఖలురమీఁద డీకొనిగెల్వ
లేక యార్తిజెంది లేచిపోవు॥ 127

ఆ॥ దండికొండమీఁదఁ దగగు డీకొనినట్లు
తరువుగాలి గెల్వఁ దలఁచినట్లు
పాపరతులు మీప్రభావవేత్తలతోడఁ
బోరి చెడుదురెపుడు భూకుమారి॥ 128

క॥ సతియుఁ బులోమజ భాషా
సతి మొదలగు వరనిలింప సరసీజాక్షుల్
బ్రతుకుదురు నీదుపాద
ద్వితయము సేవించి వేఱుతెల్పఁగ నేలా॥ 129

ఉ॥ పుట్టిననాటనుండి వితపోయెను కాలము నేటికైనమీ
పట్టునఁజేరి గుట్టెఱిఁగి భక్తులమై కొనియాడి నందుకి।
క్కట్టులుమాన్చి మా హృదయకంజము లెప్పుడు నిన్నుఁ
జేరియి। టట్టులఁబోవకుండ ననయంబును నిల్వ వరం
బొసంగుమా॥ 130

వ॥ అని వెండియు. 131

మ॥ అలికన్యస్తకరారవిందములతో నానందజాతాశ్రువుల్
గలనేత్రంబులతో మహత్తరశిరఃకంపంబుతో నార్తితోఁ
బులకల్ రేఁగునొడళ్లతోడ వసుధాపుత్రిన్ విలోకింపుచుం
బలలాహారకులాంగనానిచయముల్ ప్రార్థించిరెంతో రహిన్॥

ఉ॥ ఆనుడులాలకించి మిథిలాధిపనందన వారిగాంచి యో
మానినులార తొల్లి చెడుమార్గమునన్ నివసించు మీవచో

మానసముల్ శరీరములు మంచిపథంబునఁ జేరి మామకా
ధీనములయ్యెఁగాన సుగతింగనవచ్చు విచారమేటికిన్॥ 133

తే॥ నాకుమీకు సర్వలోకంబులకుఁనాథుఁ
డైన రామచంద్రు నాశ్రయించి
భక్తిచేఁ దదీయపాదారవిందముల్
కొలుచుచుంటిరేని కలనుముక్తి॥ 134

క॥ వేదాంతమర్మములు బహు
శాదరమునఁ దెలియవలయు నటుగాకున్నన్
వేదాంతవేద్యుఁడైతగు
నాదయితు నెఱుంగరాదు నానాగతులన్॥ 135

క॥ జ్ఞానానుష్ఠానంబుల
చే నలరు, గురుండు లేక జీవులు తెలియం
గానోపరు వేదాంతము
గాన మరుత్సూనను గురునిగాఁ గైకొనుడీ॥ 136

వ॥ ఏతత్సమయంబున సభాసదులా రాక్షసాంగనలకుఁ గలిగిన భక్తిజ్ఞానవైరాగ్యంబులకును వారినట్లుగావించిన సీతాదేవి దయాప్రభావంబులకును విస్మయానంద భరితాంతఃకరణులై బహుభంగులంగొనియాడి రటుపిమ్మట మిథిలాపురీ వధూలలామ లయ్యసుర స్త్రీలతో నిట్లనిరి॥ 137

ఉ॥ మానుగమీరుజానకి సమక్షమునందు ననేకమాసముల్
పూని వసించుమాత్రమునఁ బూతచరిత్రులరై విరాగమున్
జ్ఞానముగల్గియొప్పితిరి చందనవృక్షముచెంతనుండు నా
నానగపాళి దానిసుగుణంబున సౌరభ మొందుకైవడిన్॥

తే॥ ఏపరంజ్యోతిచే మీరలింత పుణ్య
శీలురైతిరో యానేలచూలిమహిమ
మాకుమెప్రాణేశుఁడైన శ్రీరామమహిమ
కొలఁదిగానైనఁ దెలియంగవలయుఁజమ్మ॥ 139

సీ॥ కంధిలోనుండు ముక్తాఫలమ్ముల జాడఁ
జెప్పునే మత్స్యంబుఁ జేరియడుగఁ
జందనభూజ మెచ్చటనుండునని మృగం
బులవేడ వివరింపఁగలవె కాన
నింటిలో యజమానుఁడేమయ్యెనని సార
మేయంబు నడిగిన మెదలఁగలఁదె
వర్షించె నేపాటి వాన యీనాడనఁ
గాఁజెప్పఁగలదె భేకంబెఱింగి
జానకీరామ మహిమమాచందమున వ
చింపశక్యమె శ్రుతులు చర్చించి చదువు
వారికైనను సామీరివంటి భక్త
వర్యులకుఁ గాక దానవ వనితలార॥ 140

సీ॥ పండియుండిన మావిదండఁ జేరినఁ గదా
మంచిఫలము లారగించవచ్చు
భవ్యాపగా సమీపమున కేగినఁగదా
స్నానపానంబులు జరుపవచ్చుఁ
జొరవమై జలధిలోఁ జొచ్చినప్పుడు గదా
మంచి మానికము లార్జించవచ్చుఁ

జెలఁగి పట్ణము ప్రవేశించినప్పుడు గదా
బహుపదార్థంబులు బడయవచ్చు
మైథిలీ రామతత్వ మామూఢ్కి బ్రహ్మ
వేత్తలగువారి నడిగి సేవించి తెలియ
వచ్చునే గాని యటుగాక వశమె తెలియఁ
బలువగలనైనఁ బొలదిండి పడతులార॥ 141

వ॥ కావున మీరందఱు మదీయాచార్యుండగు సమీరకుమారు పాదారవిందంబు లాశ్రయింపుడనుటయు వారలట్లు కావింప మిథిలాంగన లయోధ్యా సరోజాక్షులు లంకాపుర స్త్రీలు సరమయు నొక్కటిగాఁ జేరి గంధవహానందను నాశ్రయించి వేదాంతవిషయంబు లాలకింపుచు సీతారాముల సేవింపుచు వైకుంఠంబున నిత్య సూరులభంగి నానందసముద్రంబున నోలలాడుచుండి రక్కాలంబున రంగనాథుని ధనుర్మాసోత్సవంబునకు రమ్మని శ్రీరాముండు లేఖలంపినందున నానాదేశపు రాజులును యుధాజిత్తును జాంబవదంగదాది పరిమిత ప్లవంగులంగూడిన సుగ్రీవుండును రుమాది వానరాంగనలతోఁ గూడిన తారయు నయోధ్యకువచ్చి సీతారాముల దర్శించి సాష్టాంగదండవత్ప్రణామంబు లాచరించి తదీయ దివ్యశాసనంబు వహించి భోజనపానాదులఁ దృప్తి జెంది ధనుర్మాసోత్సవంబు సేవింపుచు వారివారికిఁ దగిన విడుదులవసించి రందొక్కనాడు భాస్కరపుత్రుండు శ్రీరామచంద్రుని సన్నిధానంబుఁ బ్రాపించి జోహారు లొనర్చి యిట్లనియె॥ 142

ఉ॥ దేవరవారియాజ్ఞ నిజదేశముఁ జేరి ప్రభుత్వధర్మముల్
తీవిదలిర్పఁగానడపి డీల్పడకుండ బ్లవంగవారమున్
వావిరిఁ బ్రోచి భోగములవారిగఁ గైకొనుచుంటిఁగాని నీ
సేవకు దూరమైన వగచేఁ గనుపట్టదు మోదమెన్నఁడున్॥

మ॥ కరులేలా సిరులేల వాజులు శతాంగంబుల్ నగల్ భూరిసుం
దరులేలా విరులేల చేలధనసౌందర్యంబులేలా సహో
దరులేలా సరులేల ధేనువులు సౌధంబుల్ కులంబేల నీ
చరణాబ్జంబులుగొల్చు సౌఖ్యమిదునే సర్వంబు సీతాపతీ॥

ఉ॥ వనములఁ గాయలాకులునుఁ బండ్లుభుజింపుచు భార్యఁ బాసి నే
దినములుత్రోయుకాలమున దేవరవారిడినట్టి రాజ్యమే
ఘనమనిపించెఁగాని యటుగాదిపుడన్నియుమాని నీపదా
బ్జనికటమందుఁ గొల్చుటయె బాగనితోచెగదయ్య రాఘవా॥

ఉ॥ ప్రాణభయంబుఁ బాపి మునివర్యుల దండకలోనఁ బ్రోచి వి
న్నాణముతో విభీషణుని నన్నుఁ బతివ్రతలం గపీంద్ర గీ
ర్వాణులనాదరించి బలువాంఛితముల్దయనిచ్చినట్టి నీ
పాణులుపాణులే త్రిదశపాదపశాఖలుగాక రాఘవా॥ 146

ఉ॥ స్థాణుని విల్లుఁద్రుంచి జమదగ్నికుమారునదభ్రగర్వ ని
ర్వాణమొనర్చి కాకిగరువంబడఁగించి పయోధిసేతు ని
ర్మాణముసేసి లోకులకమానుషతేజము సూపినట్టి నీ
పాణులుపాణులే విపులపాటవశాలులుగాక రాఘవా॥ 147

ఉ॥ బాణపరంపరల్ పరపి బంధురవిక్రమమొప్పఁ బూర్వ గీ
ర్వాణకులాధినాధుఁడగు రావణు నా ఘటకర్ణునిన్ ఖరున్

బాణునిఁబోలు దూషణకబంధవిరాధులఁజంపినట్టి నీ
పాణులుపాణులే ఖలురపాలిటి మిత్తులుగాక రాఘవా॥ 148

ఉ॥ భూతనయాశిరంబునఁ గపోలకుచంబులఁ దచ్ఛిరోరుహ
వ్రాతములందు భర్మమయ వస్త్రమునందు వలగ్నమందు వి
ఖ్యాతకృశోదరంబుపయి గాత్రముపైఁ బులకాళినించు నీ
చేతులు చేతులే మరునిచెయ్వులకిక్కలుగాక రాఘవా॥149

ఉ॥ సీతకుసౌఖ్యమిచ్చియు శచీప్రముఖామర మత్తకాశినీ
భీతులడంచి నిర్వపణ భీరునికాయ్యములై ధరావధూ
స్ఫీతభరంబువాపి విలసిల్లు యశోంగన కూఁతలైన నీ
చేతులు చేతులే సుకృత చేష్టలకిక్కలుగాక రాఘవా॥ 150

ఉ॥ భూతులొసంగి పంటగల భూములొసంగి విలాసినీ జన
వ్రాతములిచ్చి గోవులను వాజులనిచ్చి గజంబు లందనూ
జాతులనిచ్చి దాసుల నజస్రము బ్రోచియుఁ దృప్తిలేని నీ
చేతులు చేతులే పుడుకుఁ జెట్టుల శాఖలుగాక రాఘవా॥

వ॥ ఇట్లు వినుతించి చాలించినంత విభీషణుండు రవినందనునితో
నిట్లనియె॥ 152

చ॥ జననుతుఁడైన రాఘవుని సన్నిధిఁ జేరుట వల్లఁగాదె నీ
జననము నా భవంబు మునిసన్నుతమై తనరారె లేనిచో
వనములఁ గాయలందినుచు వాఁకలలో నుదకంబుద్రావుచుం
బెనువగ దైవమాయనుచు బీదలమైయెటులుందుమోకదా॥

చ॥ వెలవెలఁ బాఱనట్టి సురవృక్షము జంగమమైన హాటకా
చలము జడత్వమొందని ప్రశస్తనిధానమునాకు నీకునై

వెలయు ధరాసుతావిభుని విశ్వజగజ్జన మోహనాంగు ని
ర్మలగుణుఁగాన కెన్నియొ సమానికరంబులు వ్యర్థమాయెగా॥

ఉ॥ స్నానము లేకయున్న నిజజాయలు సౌఖ్యమొసంగకున్నఁ బ్రా
ణానిలపోషకంబులగు నన్నము నీరము లేకయున్న సుం
తైన దిగుల్జనింపదహహా రఘువీరుని పాదపద్మముల్
గానని నాడు దుఃఖమధికంబగుచుండును కీశనాయకా॥ 155

ఉ॥ అన్నియునుండి ప్రాణనిభుఁడైన మనోహరు డింటలేనిచో
నన్నులమిన్న భూరి విరహానల లబ్ధిఁ గృశించునట్లు నే
నెన్ని సుఖంబులొందియు మహీతనయాధిపు రామచంద్రు నా
పున్నెపురాశినిం గనక పొక్కితి స్రుక్కితి నేమి చెప్పుదున్॥

చ॥ ఇటు దిగులొందఁగా మరల నేగతిన న్గనిసాగనంపునో
పటుగతి లంకకేగుమని వాకొని రాఘవుఁడంచు నెంచుచోఁ
బిటుపటగుండియల్ పగిలి ప్రాణములెల్లఁ గలంగుచున్న విం
కెటుమనియుందు లోకమున నెవ్వరు దిక్కిక నేమి చేయుదున్॥

ఉ॥ రాముని పాదపద్మము లరాతులఁ జంపు మహాభుజంబు లా
శ్యామలవర్ణమా మొలయు సైకపుమధ్యమునున్నఁ జెక్కులా
మోమును సోయగంబుమునిమోహనరూపము సోగకన్నులా
ధామముఁ గాంచకున్న తఱి దక్కెనె నాకసువుల్ కపీశ్వరా॥

ఉ॥ నావిని యవ్వనాటకులనాథుఁడు రాక్షసరాజుఁ గాంచి యో
పావనశీల నీవిపుడు పల్కినదంతయు నిక్కువంబు చు
మ్మీ వనజాప్తవంశజుఁడు హీనపరాక్రమశాలి గాదె నీ
జీవము నాదు జీవము వసింపఁగఁ జేసెను మేనులందునన్॥159

ఉ॥ కంటికి నిద్రలేకయునుఁ గాలికి సౌఖ్యములేక సొంత వా
ల్గంటినిఁ బాసి గింజెములు కమ్మనితిండియులేక వాలి యే
తంటలు దెచ్చునో యనుచుఁ దల్లడమొందెడుకాలమందు న
న్నంటినబాధలం దొలఁచి నట్టిమహామహుఁ డీతఁడేకదా॥

వ॥ ఇట్లు సుగ్రీవవిభీషణులు పరస్పరసల్లాపంబు లాడుచుండ విని
యానందించి యుధాజిద్భూభవరుండు వారల న్నిలిపి రామ
చంద్రునితో నిట్లనియె॥ 161

సీ॥ తనరు ధారాధరధ్వాన మాకర్ణించు
నపుడు నీగళనిస్వనాతిశయము
మల్లెలు మొల్లలు మంచిముత్తెమ్ములు
దర్శించుచో నీరదములసొంపు
కర్పూర కస్తూరి గంధసారాదులు
కానిపించంగ నీమేనితావి
యతసీసుమములఁ బుల్లంటురాల తెఱఁగుఁ
బొడగాంచినపుడు నీయొడలిరంగు
షండగజమృగేంద్ర శార్దూలగతులు వీ
క్షించినపుడు నీదు మంచినడలు
జ్ఞాపకంబువచ్చి యేపనితోఁచక
తల్లడింతు భూసుతాహృదీశ॥ 162

సీ॥ అరవిందబంధూదయము కానఁబడుతఱిఁ
దావక తేజః ప్రధానమెన్ని
నక్షత్రచయము ప్రత్యక్షమైనప్పుడు
నీనఖంబులసొంపు నిర్ణయించి

వరచంద్రికా విభవంబు తోఁచినవేళ
నీమందహాసంబు నిశ్చయించి
పార్వణచంద్రబింబము కానఁబడు సావి
తావకవదన సౌందర్యమెన్ని
శిఖిశిఖాతిగ్మపటిమ వీక్షించినపుడు
తావకీనప్రతాపవిధాన మెన్ని
నేను జెప్పంగ సభవిన్న జానపదులు
విస్మయావిష్టచిత్తులై విందు రెపుడు॥ 163

మ॥ అరవిందధ్వజశంఖచక్ర హలచాపానేక పచ్ఛత్ర చా
మరవజ్రాంకుశ రేఖలెల్లెడల నైర్మల్యంబులై యొప్ప బం
ధురరక్తోత్పల సన్నిభంబులగుచుం దోఁతెంచి భక్తాళికిం
బురుసౌఖ్యంబులొసంగునీపదతలంబుల్ సన్నుతింతున్ హరీ

ఆ॥ అంపకోతకంటె రాతిదెబ్బలకంటె
వీతిహోత్రశిఖల వేడికంటెఁ
బట్టపగటి ఘుస్రపతికంటెఁ దీక్ష్ణమై
యొప్పె నాకు నీవియోగవేళ॥ 165

క॥ ఇఁకమీఁద నీవియోగము
నకుఁ బాత్రుఁడగాక నేననారతము భవ
న్నికటముననుండి యానం
దకరాశిం దేలునట్లు దయచేయఁగదే॥ 166

వ॥ ఇవ్విధంబున స్తోత్రమొనర్చుచున్న యుధాజిద్విభీషణ సుగ్రీ
వాదులంగాంచి శ్రీరామచంద్రుండు దయామయంబులును
బీయూషోపమంబులునగు వాక్యంబులచేత లాలించె నంత

రుమాదిప్లవంగకాంతలంగూడిన తార సీతాదేవిసన్నిధి కరిగి ప్రణామంబులాచరించి యామె చెంతనుండు సరమంగాంచి యిట్లనియె॥ 167

క॥ మనతల్లియైన జానకి
వినిపించెను మున్ను నీదువృత్తాంతం బా
దినమాదిగఁ గనుఁగొన్నటి
కొనగూడునొకోయటంచు నుంటిని ప్రేమన్॥ 168

క॥ మాదేశము మీరెఱుఁగరు
మీదేశము మీవిధంబు మేమెఱుఁగ మహా
భూదేవిపుత్రిదయచేఁ
గాదే బాంధవము మనకుఁ గలుగుట లక్కా॥ 169

క॥ పలలాశనులకు నడవుల
ఫలములుదిను మర్కటులకు భవ్యచరిత్రులై
వెలయుదినేంద్రాన్వయులకుఁ
గలిగెం జుట్టఱిక మరయఁగాఁ జిత్రమగున్॥ 170

క॥ తనుబంధుత్వంబునఁ గలు
గును చెలిమియుఁ బగయు నట్లగుటలేదు చుమీ
మన కాత్మబాంధవంబై
తనరారుటఁజేసి యెన్నితరములకైనన్॥ 171

క॥ శ్రీరాముఁడు శాఖామృగ
వారముతో లంకఁజేరి పలలాశులతోఁ
బోరుతఱి నీవిభుఁడు వే
సారక కావించెఁగాదె సాయముపెలుచన్॥ 172

క॥ పగతుల మర్మము నీపతి
తెగించి మనవారితోడఁ దెలుపకయున్నం
బగఱవధింపఁగ శక్యమె
మగువా యుద్ధమున నెంత మగవారలకున్॥ 173

సీ॥ నింగిమ్రింగిన భంగిఁ బొంగుచు నక్కుంభ
కర్ణుఁడాలమునకుఁ గడఁగునాడు
నడురేయి నమ్మేఘనాదుండదృశ్యమై
కెరలితూపులు ప్రయోగించునాడు
బల్లిదులగు పెక్కు పలలాశనులు వచ్చి
కోపంబుతోడ డీకొన్ననాడు
చోరుఁడౌ రావణాసురుఁడు మాయలచేత
మించిజన్యమునఁ గారించునాడు
మొత్తమై రాత్రివేళల ముట్టడించి
లంకఁ గాల్చిననాడు నిశ్శంకతోను
పాయములు దెల్పి కీశ నికాయమునకు
విజయమొనఁగూర్చినది భవద్విభుఁడ కాదె॥ 174

క॥ ఈరీతిఁ బల్కుచుండెడు
తారాంగనఁగాంచి సరమతద్దయు వేడ్కన్
వారించి కౌఁగిలించి సు
ధారసనిభవాక్యసమితి తనరఁగ ననియెన్॥ 175

క॥ నామగడు నీమగడు సం
గ్రామంబున బాసటైనకతన గెలిచె శ్రీ

రాముఁడు దనుజులనను నీ
కేమని ప్రత్యుత్తరంబు లిత్తును సుదతీ॥ 176

సీ॥ సతసంద్రముల నొక్కశరముచే నింకించి
నిర్మలోదకముచే నింపఁజాలు
దారాదినేంద్రచంద్రముల వేపడఁ గూల్చి
చెలువొప్ప మరల సృష్టింపఁజాలు
నరసురాసురముఖ నానాశరీరుల
నోడించి సత్కీర్తి నొందఁజాలు
శివవిరించన శచీధవుల పాలిటఁ గల్గు
నాపదల్ గడియలోఁ బాపఁజాలు

బహువిశాలమైనబ్రహ్మాండముల నెత్తి
వేడుకలర బంతులాడఁజాలు
నట్టిశక్తిమంతుఁడగు రామునకు మన
వారిసాయ మేల వారిజాక్షి॥ 177

సీ॥ వాలిరావణులనుఁ బోలుదుష్టులు బొందు
బాము లిట్టివటంచు బయలుపుచ్చ
నీనామగలవంటి నీతిమంతులు గాంచు
సుఖము లిట్లుండునంచు వివరింప
సామీరివంటి నిశ్చలభక్తు లిబ్భంగి
విజయ మొందుదురని వెల్లడింప
సీతవంటిపతివ్రతాతన్వు లిటుసమా
ఖ్యానందముః లు గాంతురనుచుఁ దెలుపఁ

గోఁతి తెగలవంటి కొలఁదివారైన న
న్నాశ్రయించి ధన్యు లగుదురన్న
నీతిఁ దెల్ప రాముఁ డీతీరున నటించె
గాని శక్తి లేక కాదు తల్లి॥ 178

మ॥ మునియాగంబునుఁ గాచితద్విమతనిర్మూలంబు గావించుచో
ననలాక్షోగ్రశరాసముం విఱుచుచో నంభోనిధిం దూల్చుచో
వనిలో నాఖరదూషణాదిఖలురం వారించి చక్కాడుచో
నినవంశాధిపుఁ డొక్కఁడో నలువురో యిం కెందరో చెప్పుమా॥

క॥ మనవారి జన్మములు పా
వనమగుటకు రామపాద వనజాతంబుల్
కని భజియించుటకా క
య్యినకులునకు సాయపడుట లేటికిఁ జెపుమా॥ 180

సీ॥ బహుదినంబులనుండి పాషాణమైయున్న
మునిపత్ని శాపమిమ్ముల నడంచె
ఒచ్చినంజుడు మెక్కు పలుగాకియైన వి
రాధుని శాపంబు రహిఁ దొలంచెఁ
గడుపులోపల నోరు గలిగి దుఃఖించు క
బంధునిశాపంబు బాయఁ జేసె
సంచారముడిగి తోఁచక దుఃఖపడుచున్న
సంపాతి కపుడు పక్షములొసంగె
దనుజులైన మాకు వనచరులగు మీకు
శ్రీలొసంగి మేలుసేసి ప్రోచె

నట్టి రామవిభుస కన్యుల సాహాయ్య
మేల చెప్పామమ్మ యోలతాంగి॥ 181

వ॥ అవ్వాక్యంబుల కయోధ్యా, మిథిలా నివాసులగు స్త్రీ
పురుషాదు లత్యంతానందాశ్చర్యంబులొంది సరమను వే
నోళ్లఁ గీర్తించి రయ్యంజనానందనుండు శిరఃకంపముతోఁ
గూడిన వాఁడై యచ్చటఁగల వారితో నిట్లనియె. 182

ఆ॥ పూర్వజన్మమందుఁ బుణ్యంబొనర్చిన
వారు పురుషులైన నారులైనఁ
దమకుఁదామె రామతత్త్వంబెఱుంగుదు
రితరులైనజనము లెఱుఁగలేరు॥ 183

సీ॥ తల్లిగర్భమునందె దామోదరు నెఱింగి
ప్రహ్లాదుఁడేరీతిఁ బ్రస్తుతించె
నాఱేండ్లనాడె శ్రియఃపతిఁ బొడఁగాంచి
ధ్రువుఁడెట్లుకాంచెను ధ్రువపదంబు
పల్లెవంగడములోఁ బ్రభవించి గుహుడెట్లు
శ్రీరామభక్తి నార్జించి వెలిఁగె
నడవిలోఁగలబోయ పడఁతియేగతి ఫలా
హారంబుచేరాము నలరఁజేసెఁ

బూర్వజన్మమునఁ దపోధనంబొనఁగూర్చు
కొన్నవారలెట్టి కులమునందు
నెట్టిపాయమందు నేదేశమందున్నఁ
దెలియఁగలరు రామదేవుమహిమ॥ 184

సీ॥ తినవీలగునె రోగికెన లేనిమాధురి
గలపదార్థము లింటఁగలిగియున్న
గనశక్యమగునే యఖండప్రపంచంబు
విపులాంధకునకుఁ బట్టపగలైన
వినఁగాదరంబె చెవిటికి సమీపమునం
దనువైన సత్కథల్ వినుచున్న
నడువసాధ్యమె పంగునకు మార్గమిదియని
మంచివారేచి చూపించుచున్న
నల్లెసుజ్ఞానులైన మహానుభావు
లంచితోక్తుల చేత బోధించుచున్నఁ
బద్ధసంసారులైయుండు పామరులకు
దెలిసికొని రామచంద్రుఁ గీర్తింపఁదరమె॥ 185

సీ॥ కొంగున ముడివేసుకొననిల్చునే నీర
మిసుకలో నూనెఁదీయింపనగునె
నానునేయినుమెంత వానలోవేసినఁ
గరఁగునేరాయి యెక్కరణినైన
నేయి తేవచ్చునే నిలిపి జల్లెడతోడఁ
గట్టవచ్చునె వడగండ్లమేడ
సరిజేయనగునె భషకవాలమెల్లైన
విడికట్టియలు ముడివేయఁదరమె
కామరాగాదిగుణములలోమునింగి
యేమి తెలియని కిల్బిషస్తోమరతుల

మంచివారలఁ జేసి రామపదభక్తి
కలుప సాధ్యముగాదెంత ఘనులకైన॥ 186

సీ॥ జలమునువిడిచి మత్స్యంబు జీవించునే
విమలమైన మహౌషధములచేత
వాన నీరుడిగి జీవమునిల్పునే చాత
కమున దీనత తటాకములచేత
విరితేనెమాని జీవితము సాగించునే
యలి పాళి వేఱుపాయములచేతఁ
బసిఁడి తమ్ములఁ బాసి బ్రతుకునేరాయంచ
కొమరారు వివిధవృక్షములచేత

నావిధంబున శ్రీరాము నాశ్రయించి
భక్తిఁగావించు వారలార క్తిమాని
విషయసౌఖ్యముఁలొంది జీవించలేరు
తరుణులార మహాత్ములా పురుషులార॥ 187

వ॥ అని యిట్లంజనానందనుండు బోధించిన నాకర్ణించి యయో ధ్యాపురవాసులును మిథిలాపురస్త్రీలును సుగ్రీవాది వానరులును విభీషణాది రాక్షసులును, నానాదేశాధిపతులును, యుధాజిదాది బంధువర్గంబులును, తారారుమాది వానర కాంతలును సరమాంగనంబరివేష్టించియుండు రాక్షసాంగన లును బ్రహ్మానందంబున నోలలాడి రంగనాథోత్సవంబు సేవించి సీతారాముల సేవింపుచు సంవత్సరంబులు నిమిషం బులుగాఁ గడపుచు సుఖంబుండిరి. 188

ఉ॥ కంధరదేహ దుష్టదశకంధర కంధర ఖండనాత్రయీ
కంధర దూషణాంతక సుకంధరవైరి విదారణాశరత్
కంధర చంద్రికా గరళ కంధరకాశ మరాళశంబభృ
త్సింధురతుల్యకీర్తి తులసీదళపూజితపాద రాఘవా॥ 189

క॥ పరభీకరశరచాపా

పరిచితకపిభూప సత్యబహుళాలాపా
సురుచిర రత్నకలాపా
శరభంగప్రముఖ మౌనిసన్నుతరూపా॥ 190

మాలినీవృత్తము.

జలధరనిభగాత్రా సజ్జనస్తోత్రపాత్రా
కలుషకమలనాగా గాఢబాణప్రయోగా
సలిలనిధిగభీరా జానకీచిత్తచోరా
బలరిపుతనయారీ భానుజానందకారీ॥ 191

గద్య

ఇది శ్రీసీతావల్లభప్రసాద సమాసాదిత కవితాప్రవీణ వేదాల సీతారామాచార్య కృపాలబ్ధ మంత్రరత్నానుసంధాన పవిత్రాంతరంగ నిఖిలదుర్మతశిలోచ్చయదంభోళీభూతసముద్రాల లక్ష్మణాచార్యానుగ్రహాబోధిత విశిష్టాద్వైత రహస్యార్థ దురంధర శఠగోప యతిరాడ్వరవర యోగిప్రభృతి పూర్వాచార్యచరణ సరోజ భ్రమరాయమాన మొవ్వవంశతిలకకృష్ణ

ర్య కృష్ణమాంబాతనూజ శ్రీవైష్ణవ
విధేయ వేంకటదాస నామధేయ
ప్రణీతంబైన సీతారామ
ప్ర భా వం బు న
తృతీయాశ్వా
సంబునందు
సర్వము
సంపూర్ణము.

YouTube channel :
pudivada devasthanam
(RAMOJI &URMI) 🙏🙏🙏
cell no : 9000545202

తెనాలి, శారదా ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె. 1936.

మా యత్రాశ్రమమున లభించు గ్రంథమాల

భాష్యకార సమాజస్థాపకులు, మా పితృపాదులు

శ్రీ వేంకటదాసస్వామివారివి:-

| | |
|---|---|
| జ్ఞానసూర్యోదయము | రు. 10- |
| గోపికావిలాసము | |
| సీతారామప్రభావము | |
| వరవరమునిహృదయము | |
| లక్ష్మీస్తవము | |
| భాగవతసురభూజము | 1- |

నావి:....

| | |
|---|---|
| కావ్యకళ | |
| భారతగానము | 6— |
| తపోమహిమ | 6— |

ప్రాప్తిస్థానము:—

కవిభట్టారక, మెువ్వ విష్ణుదాసు (దాశరథిసూరి)

శ్రీ వేణుగోపాల సేవాశ్రమము

పూడివాడ (వయా) చందోలు

గుంటూరుజిల్లా

FROM :

పద్యాల మైథిలీ నాథ ప్రసాద్ 🙏🙏🙏

cell no : 9000545202


భాష్యకార సమాజస్థాపకులు
మహర్షి శ్రీవేంకటదాసస్వామి.
నందం శంకరరామనాథము
Artist
రేపల్లె. గుంటూరు జి.
1957.